*IMPORTANCE OF GITA*

*Dear readers,*
*Bhagavadgita is like a rope which helps to rescue those in the well of miseries and unhappiness.It acts as a medicine during sickness. It gives strength to the weak minds.It gives all the right knowledge any human must know as it is the essence of vedas.*
*Those who work hard to live better in this world are careful and those who work hard to live better here in this world as well as other worlds one acquire after leaving this body are wise. so do not just be careful but be wise!!*
*Read gita mahatyam to understand the importance of reading gita!those who read atleast one sloka with meaning everyday will acquire good human form with satva gunas in their next life and those who read a chapter every day will get to live on chandra loka (divine plane) for a long period and then will get a human form in a wealthy family which posses the knowledge of vedas.Those who read the whole book of gita every day will not have anymore births but merges in god himself.*
*REMEMBER THAT LIFE IS SHORT AND VALUBLE DO NOT JUST SPEND ALL YOUR LIFE  IN MAKING THIS BODY AND SENSES COMFORTABLE....SPEND TIME FOR SOMETHING THATS WORTH A HUMAN LIFE....AND WHAT IS IT WORTH FOR? ACQUIRING KNOWLEDGE!*
*HARE KRISHNA HARE KRISHNA*
*KRISHNA KRISHNA HARE HARE !!*

భారతామృత సర్వస్వం
విష్ణోర్వక్త్రాద్వినిస్సృతమ్
గీతా గంగోదకం పీత్వా
పునర్జన్మ న విద్యతే.

మహాభారతముయొక్క సర్వస్వమున్ను, అమృతస్వరూపమున్ను, విష్ణుభగవానుని ముఖ పద్మమునుండి వెలువడినదియు నగు గీతాగంగ యొక్క ఉదకమును త్రాగినవానికి [illegible] పునర్జన్మయుండ నేరదు. (జననమరణ[illegible]బంధవిముక్తి రూప మోక్షము సిద్ధించును.)



Be Fearless

## దైవప్రార్థన

కరుణామూర్తియగు సర్వేశ్వరా! మాచిత్తము సర్వకాల సర్వావస్థలయందును నీ పాదారవిందము లందు లగ్నమై అచంచలమైన భక్తితోకూడియుండు నట్లు అనుగ్రహింపుము !

పరమదయానిధీ ! ప్రాతఃకాలమున నిద్రలేచి నది మొదలు మరల పరుండువరకును మనోవాక్కా యములచే మా వలన ఎవరికిని అపకారముకలుగ కుండునట్లును, ఇతర ప్రాణికోట్లకు ఉపకారము చేయులాగునను సద్బుద్ధిని దయచేయుము.

సచ్చిదానందమూర్తీ ! నిర్మలాత్మా ! మా యంతఃకరణమునందు ఎన్నడును ఏవిధమైన దుష్ట సంకల్పముగాని, విషయవాసనగాని, అజ్ఞానవృత్తి గాని జొరబడకుండునట్లు దయతో అనుగ్రహిం పుము!

వేదాంతవేద్యా! అభయస్వరూపా! మాయందు భక్తి, జ్ఞాన, వైరాగ్యబీజము లంకురించి శీఘ్రముగ ప్రవృద్ధము లగునట్లు ఆశీర్వదింపుము! మఱియు ఈ జన్మమునందే కడతేరి నీసాన్నిధ్యమున కేతెంచుటకు వలసినశక్తి సామర్థ్యములను కరుణతో నొసంగుము!

దేవా! నీవు భక్తవత్సలుడవు! దీనులపాలిటి కల్పవృక్షమవు! నీవుతప్ప నాకు ఇంకెవరు దిక్కు! నిన్నాశ్రయించితిని. అసత్తునుండి సత్తునకు గొనిపొమ్ము! తమస్సునుండి జ్యోతిలోనికి తీసికొనిపొమ్ము! మృత్యువునుండిఅమృతత్వమును పొందింపజేయుము! ఇదే మావినతి. అనుగ్రహింపుము. నీదరి జేర్చుకొనుము. పాహిమాం! పాహిమాం! పాహిమాం! పాహి!!

ఓం తత్ సత్

---

(ఈ ప్రార్థనను ఎవరు ప్రతిదినము నియమము తప్పక ఉదయము నిద్రలేచునపుడును, రాత్రి పరుండబోవునపుడును మనస్ఫూర్తిగా పఠింతురో, అట్టివారికి జీవితమునం దేలాటి దోషములున్ను కలుగకుండుటయేగాక సర్వేశ్వరునియొక్కయనుగ్రహమునకున్ను వారు పాత్రులు కాగలరు.

# గీతను పారాయణముచేయు పద్ధతి

గీతను పారాయణము చేయుటకు ముందుగా ఈక్రింది శ్లోకముల నుచ్చరించుచు వందన మాచరింపవలయును.

ఓం శ్రీకృష్ణపరబ్రహ్మణే నమః

ఓం శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజం
ప్రసన్న వదనం ధ్యాయేత్సర్వవిఘ్నోపశాంతయే.
ఓం అఖండమండలాకారంవ్యాప్తంయేనచరాచరమ్
తత్పదం దర్శితం యేన తస్మై శ్రీగురవే నమః.
ఓం కృష్ణం కమలపత్రాక్షం పుణ్యశ్రవణకీర్తనమ్
వాసుదేవంజగద్యోనిం నౌమి నారాయణం హరిమ్.
ఓమ్‌వ్యాసాయవిష్ణురూపాయవ్యాసరూపాయవిష్ణవే
నమో వైబ్రహ్మనిధయే వాసిష్ఠాయ నమో నమః.
ఓమ్‌నారాయణంనమస్కృత్యనరంచైవ నరోత్తమమ్
దేవీం సరస్వతీం వ్యాసం తతో జయ ముదీరయేత్.

ఈప్రకారముగ వందన మాచరించిన పిదప భగవంతుడగు శ్రీకృష్ణమూర్తిని, శ్రీవేదవ్యాస మహర్షిని, గీతాగ్రంథమును భక్తిపూర్వకముగ పూజింపవలయును. పిమ్మట ఈక్రింది విధముగ పారాయణమును ఉపక్రమింపవలెను. [పారాయణము చేయునపుడు మనస్సు శ్రీకృష్ణపరమాత్మయందును గీతాభావార్థమందును సంలగ్నమైయుండవలెను. కురుక్షేత్ర రణరంగమున ఇరుసేనలమధ్య రథముపైగూర్చొని శ్రీకృష్ణ

ॐ

శ్రీకృష్ణపరబ్రహ్మణే నమః

# శ్రీ భగవద్గీత

## అథ ప్రథమోఽధ్యాయః

### అర్జున విషాదయోగః

ధృతరాష్ట్ర ఉవాచ :-

ధర్మక్షేత్రే కురుక్షేత్రే
సమవేతా యుయుత్సవః,
మామకాః పాణ్డవాశ్చైవ
కిమకుర్వత సఞ్జయ! 1

ధృతరాష్ట్రుడిట్లుపలికెను:- ఓ సంజయా ! నావారలగు దుర్యోధనాదులును, పాండుపుత్రులగు ధర్మరాజాదులును యుద్ధముచేయఁగుతూహలముతో పుణ్యభూమియగు కురుక్షేత్రమున జేరి యేమిచేసిరి?

సఞ్జయ ఉవాచ :-

దృష్ట్వా తు పాణ్డవానీకం
వ్యూఢం దుర్యోధనస్తదా
ఆచార్యముపసఙ్గమ్య
రాజా వచనమబ్రవీత్. 2

ధృతరాష్ట్రునితో సంజయుడిట్లు వచించెను :- అపుడు రాజైన దుర్యోధనుడు వ్యూహాకారముగా రచింపబడియున్న పాండవసేనను చూచి, తదుపరి గురువగు ద్రోణాచార్యునిసమీపించియిట్లుపలికెను.

పశ్యైతాం పాణ్డుపుత్రాణా
మాచార్య మహతీం చమూమ్,
వ్యూఢాం ద్రుపదపుత్రేణ
తవ శిష్యేణ ధీమతా. 3

ఓ గురువర్యా! బుద్ధిశాలియు, మీ శిష్యుడునగు



ధృష్టద్యుమ్నునిచేత వ్యూహాకారముగ రచింపబడియున్నట్టి పాండవుల ఈగొప్పసైన్యమునుజూడుడు!

అత్ర శూరా మహేష్వాసా
భీమార్జున సమా యుధి,
యుయుధానో విరాటశ్చ
ద్రుపదశ్చ మహారథః. 4

ధృష్టకేతు శ్చేకితానః
కాశీరాజశ్చ వీర్యవాన్,
పురుజిత్కున్తిభోజశ్చ
శైబ్యశ్చ నరపుఙ్గవః. 5

యుధామన్యుశ్చ విక్రాన్త
ఉత్తమౌజాశ్చ వీర్యవాన్,
సౌభద్రో ద్రౌపదేయాశ్చ
సర్వ ఏవ మహారథాః. 6

ఈ పాండవసేనయందు గొప్ప విలుకాండ్రును, యుద్ధమునందు భీమార్జునులతో సమానులునగు శూరవీరులును పెక్కురు కలరు. వారెవరనిన - యుయుధానుడు, విరటుడు, మహారథుడైన ద్రుపదుడు ధృష్టకేతువు, చేకితానుడు, పరాక్రమవంతుడగు కాశీరాజు, పురుజిత్తు, కున్తిభోజుడు, నరోత్తముడగు శైబ్యుడు, శౌర్యవంతుడగు యుధామన్యుడు, పరాక్రమశాలియగు ఉత్తమౌజుడు, అభిమన్యుడు, ఉపపాండవులు. వీరందఱును మహారథులే అయి యున్నారు.

అస్మాకం తు విశిష్టా యే
తాన్నిబోధ ద్విజోత్తమ!
నాయకా మమ సైన్యస్య
సంజ్ఞార్థం తాన్ బ్రవీమి తే. 7

ఓ బ్రాహ్మణోత్తమా! ఇక మనసైన్యములో ప్రముఖులు, సేనానాయకులు ఎవరు కలరో వారలను జ్ఞాపకముకొఱకు మీకుచెప్పుచున్నాను. (వినుడు.)



భవాన్ భీష్మశ్చ కర్ణశ్చ
కృపశ్చ సమితిఞ్జయః,
అశ్వత్థామా వికర్ణశ్చ
సౌమదత్తిస్తథైవ చ.

అన్యే చ బహవశ్శూరా
మదర్థే త్యక్తజీవితాః,
నానాశస్త్ర ప్రహరణా
స్సర్వే యుద్ధవిశారదాః. 9

మీరు, భీష్ముడు, కర్ణుడు, యుద్ధమందు జయశీలుడైన కృపాచార్యుడు, అశ్వత్థామ, వికర్ణుడు, భూరిశ్రవుడు, ఇంకను నాకొఱకు తమ తమ జీవితములను ధారబోయునట్టి అనేక ఇతర శూరులు, అందఱును యుద్ధసమర్థులై వివిధశస్త్రాస్త్రసంపన్నులై ఇచట నున్నారు

అపర్యాప్తం తదస్మాకం
బలం భీష్మాభిరక్షితమ్,
పర్యాప్తం త్విదమేతేషాం
బలం భీమాభిరక్షితమ్. **10**

అట్టిశూరులుకలమనసైన్యము భీష్మునిచేగాపాడబడుచు అపరిమితముగనున్నది. (అజేయమైయొప్పుచున్నది.) పాండవుల యొక్క ఈసేనయో భీమునిచే రక్షింపబడుచు పరిమితముగనున్నది. (జయింపశక్యమైయున్నది).

అయనేషు చ సర్వేషు
యథా భాగమవస్థితాః,
భీష్మమేవాభిరక్షన్తు
భవన్తస్సర్వ ఏవ హి. **11**

మీరందఱున్ను వ్యూహమార్గములందు మీ మీ నియమితస్థానములందుండి భీష్మునే సర్వవిధముల కాపాడుచుండవలయును.



తస్య సఞ్జనయన్ హర్షం
కురువృద్ధః పితామహః,
సింహనాదం వినద్యోచ్చై
శ్శఙ్ఖం దధ్మౌ ప్రతాపవాన్. **12**

పరాక్రమశాలియు, కురువృద్ధుడునగు భీష్మపితామహుడంతట దుర్యోధనున కుత్సాహము గలుగునటుల పెద్దగ సింహధ్వనిజేసి శంఖమును పూరించెను.

తత శ్శఙ్ఖాశ్చ భేర్యశ్చ
పణవానక గోముఖాః,
సహసైవాభ్యహన్యన్త
స శబ్దస్తుములోఽభవత్. **13**

భీష్ముడు శంఖారావము చేసిన పిమ్మట కౌరవసైన్యమందలితక్కినవారున్ను శంఖములను, భేరులను, తప్పెటలు మున్నగువానిని వెంటనే ప్రయోగించిరి. ఆ శబ్దముచే దిక్కులు పిక్కటిల్లెను.

తత శ్శ్వేతై ర్హయైర్యుక్తే
మహతి స్యన్దనే స్థితౌ,
మాధవః పాణ్డవ శ్చైవ
దివ్యౌ శఙ్ఖౌ ప్రదధ్మతుః. **14**

పిమ్మట తెల్లని గుఱ్ఱములబూన్చిన గొప్పరథము నందు గూర్చొనియున్న కృష్ణార్జును లిరువురును తమ తమ దివ్యములగు శంఖములను గట్టిగ ఊదిరి.

పాఞ్చజన్యం హృషీకేశో
దేవదత్తం ధనఞ్జయః,
పౌణ్డ్రం దధ్మౌ మహాశఙ్ఖం
భీమకర్మా వృకోదరః. **15**

అనన్తవిజయం రాజా
కున్తీపుత్రో యుధిష్ఠిరః.



నకుల స్సహదేవశ్చ
సుఘోష మణిపుష్పకౌ. **16**

కాశ్యశ్చ పరమేష్వాస
శ్శిఖణ్డీ చ మహారథః,
ధృష్టద్యుమ్నో విరాటశ్చ
సాత్యకిశ్చాపరాజితః. **17**

ద్రుపదో ద్రౌపదేయాశ్చ
సర్వశః పృథివీపతే,
సౌభద్రశ్చ మహాబాహు
శ్శఙ్ఖాన్ దధ్ముః పృథక్పృథక్. **18**

శ్రీకృష్ణుడు పాంచజన్యమను శంఖమును ఊదెను. అర్జునుడు దేవదత్తమును ఊదెను. భయంకరకార్యములనొనర్చు భీముడు పౌండ్రమను గొప్పశంఖమును ఊదెను. కుంతీసుతుడగు ధర్మరాజు అనంతవిజయ

మును, నకులుడు సుఘోషమును, సహదేవుడు మణి పుష్పకమును ఊదిరి. అట్లే గొప్పధనుస్సుగల కాశీ రాజున్ను, మహారథుడగు శిఖండియు, ధృష్టద్యుమ్ను డును, విరటుడును, అపజయమునొందనివాడగుసాత్య కియు, ద్రుపదుడును ద్రౌపదీ తనయులగు ఉపపాండ వులును, గొప్పభుజబలముగల అభిమన్యుడును సేనయం దంతట వేఱు వేఱుగా తమతమ శంఖములను ఊదిరి.

స ఘోషో ధార్తరాష్ట్రాణాం
హృదయాని వ్యదారయత్,
నభశ్చ పృథివీం చైవ
తుములో వ్యనునాదయన్. **19**

పాండవవీరుల శంఖముల యొక్క ఆసంకులధ్వని భూమ్యాకాశములను దద్దరిల్లజేయుచు దుర్యోధనా దుల గుండెలను బ్రద్దలు చేసెను.

అథ వ్యవస్థితాన్ దృష్ట్వా
ధార్తరాష్ట్రాన్ కపిధ్వజః,



ప్రవృత్తే శస్త్రసమ్పాతే
ధనురుద్యమ్య పాణ్డవః. **20**

హృషీకేశం తదా వాక్య
మిదమాహ మహీపతే !

ఓ ధృతరాష్ట్రమహారాజా! అటుపిమ్మట రణ రంగమున ఆయుధములు ప్రయోగింపబడబోవు చుండగా కపిధ్వజుడగు అర్జునుడు యుద్ధసన్నద్ధులై యున్న కౌరవులను జూచి, ధనుస్సును చేబూని శ్రీకృష్ణునితో నిట్లు పలికెను–

అర్జున ఉవాచ:–

సేనయోరుభయోర్మధ్యే
రథం స్థాపయ మేఽచ్యుత! **21**

యావదేతా న్నిరీక్షేఽహం
యోద్ధుకామానవస్థితాన్,

కైర్మయా సహయోద్ధవ్య
మస్మిన్ రణసముద్యమే. **22**

అర్జునుడు చెప్పెను-ఓ కృష్ణా! ఈయుద్ధారంభమునందు నేనెవరితో పోరుసలపవలయునో, అట్టి ఈ యుద్ధాభిలాషులను ఎచటినుండి నేను చక్కగ జూడగల్గుదునో రెండుసేనలమధ్య అచ్చోటనా రథమును నిలబెట్టుము.

యోత్స్యమానానవేక్షేఽహం
య ఏతేఽత్ర సమాగతాః,
ధార్తరాష్ట్రస్య దుర్బుద్ధే
ర్యుద్ధే ప్రియచికీర్షవః. **23**

దుష్టబుద్ధిగల దుర్యోధనునకు యుద్ధమున ప్రియము నగూర్ప నెంచి ఇచట చేరియున్నట్టి ఈ యోధులను నేను చూచెదను

సంజయ ఉవాచ :-
ఏవముక్తో హృషీకేశో
గుడాకేశేన భారత!



సేనయోరుభయోర్మధ్యే
స్థాపయిత్వా రథోత్తమమ్. **24**
భీష్మద్రోణ ప్రముఖత
స్సర్వేషాం చ మహీక్షితామ్,
ఉవాచ పార్థ! పశ్యైతాన్
సమవేతాన్ కురూనితి. **25**

సంజయుడిట్లు పలికెను-ఓ ధృతరాష్ట్రమహారాజా అర్జునుడిట్లు చెప్పగా నంతట శ్రీకృష్ణుడు ఉత్తమమగు ఆరథమును రెండుసేనలమధ్య భీష్మద్రోణులకును, ఎల్లరాజులకును ఎదుట నిలిపి 'అర్జునా! ఈ చేరియున్న కౌరవులను జూడుము!' అనిచెప్పెను.

తత్రాపశ్యత్స్థితాన్పార్థః
పితౄనథ పితామహాన్,
ఆచార్యాన్మాతులాన్భ్రాతౄన్
పుత్రాన్పౌత్రాన్సఖీంస్తథా. **26**

శ్వశురాన్సుహృదశ్చైవ
సేనయోరుభయోరపి.

తదుపరి అర్జునుడచట రెండు సేనలయందును నిలిచి యున్నట్టి తండ్రులను, తాతలను, గురువులను, మేనమామలను, అన్నదమ్ములను, కొడుకులను, మనుమలను, స్నేహితులను, మామలను, హితైషులను (అందరిని) చూచెను.

తాన్సమీక్ష్య స కౌన్తేయ
స్సర్వాన్ బన్ధూనవస్థితాన్. **27**
కృపయా పరయాఽఽవిష్టో
విషీదన్నిదమబ్రవీత్,

అర్జునుడు యుద్ధభూమియందు నిలబడియున్న ఆ బంధువులందఱిని బాగుగ పరికించి దయార్ద్రహృదయుడై దుఃఖించుచు నిట్లుపలికెను—



అర్జున ఉవాచ :—
దృష్ట్వేమం స్వజనం కృష్ణ!
యుయుత్సుం సముపస్థితమ్. **28**
సీదన్తి మమ గాత్రాణి
ముఖం చ పరిశుష్యతి,
వేపథుశ్చ శరీరే మే
రోమహర్షశ్చ జాయతే. **29**
గాణ్డీవం స్రంసతే హస్తా
త్త్వక్చైవ పరిదహ్యతే,
న చ శక్నోమ్యవస్థాతుం
భ్రమతీవ చ మే మనః. **30**

అర్జునుడు చెప్పెను—ఓ కృష్ణమూర్తి! యుద్ధము చేయుటకై ఇచట సమకూడిన ఈ బంధుజనములను జూచి నా అవయవములు పట్టుదప్పుచున్న వి

నోరెండుకొనిపోవుచున్నది; శరీరమందు వణకుపుట్టుచున్నది. గగుర్పాటు గలుగుచున్నది; గాండీవము చేతినుండి జారిపోవుచున్నది; చర్మము మండుచున్నది; నిలబడుటకైనను నాకు శక్తి లేకున్నది; మనస్సు గిఱ్ఱుసతిరుగుచున్నది.

నిమిత్తాని చ పశ్యామి
విపరీతాని కేశవ!
న చ శ్రేయోఽనుపశ్యామి
హత్వా స్వజనమాహవే. **31**

ఓ కృష్ణమూర్తీ! (పెక్కు) అపశకునములను సహితము చూచుచున్నాను. యుద్ధమునందు బంధువులను చంపిన వెనుక బొందబోవు లాభ మెద్దియో నాకు కనుపించుటలేదు.

న కాఙ్క్షే విజయం కృష్ణ!
న చ రాజ్యం సుఖాని చ,



కిం నో రాజ్యేన గోవిన్ద!
కిం భోగైర్జీవితేన వా. **32**

కృష్ణా! నేను విజయమునుగాని, రాజ్యమునుగాని, సుఖమునుగాని కోరను. రాజ్యముతోగాని, భోగములతోగాని, జీవితముతోగాని మనకేమి ప్రయోజనము?

యేషామర్థే కాఙ్క్షితం నో
రాజ్యం భోగాస్సుఖాని చ,
త ఇమేఽవస్థితా యుద్ధే
ప్రాణాంస్త్యక్త్వా ధనాని చ. **33**

ఆచార్యాః పితరః పుత్రా
స్తథైవ చ పితామహాః,
మాతులాః శ్వశురాః పౌత్రా
స్స్యాలా స్సమ్బన్ధిన స్తథా. **34**

ఎవరి నిమిత్త మీ రాజ్యమును, భోగములను, సుఖములను మనము కోరుదుమో, అట్టి గురువులు, తండ్రులు, కొడుకులు, తాతలు, మేనమామలు, మామలు, మనుమండ్రు, బావమఱదులు, సంబంధులు ఎల్లరునూ ప్రాణములమీద, ధనముమీద ఆశ వదలుకొని ఈ రణరంగముమీద వచ్చి నిలబడి యున్నారు.

ఏతాన్న హన్తుమిచ్ఛామి
ఘ్నతోఽపి మధుసూదన !
అపి త్రైలోక్యరాజ్యస్య
హేతోః కిం ను మహీకృతే. 35

ఓ కృష్ణా! నన్ను చంపువారలైనను వీరిని ముల్లోకముల రాజ్యాధిపత్యముకొఱకైనను నేనుచంప నిచ్ఛగింపను. ఇక భూలోకరాజ్యముకొఱకు వేఱుగ జెప్పవలెనా ?

నిహత్య ధార్తరాష్ట్రాన్నః
కా ప్రీతి స్స్యాజ్జనార్దన!



పాపమేవాశ్రయేదస్మాన్
హత్వైతానాతతాయినః. 36

ఓకృష్ణా! దుర్యోధనాదులను చంపుటచేమన కేమి సంతోషముకలుగును? దుర్మార్గులైనను వీరినిచంపుట వలన మనకు పాపమే కలుగును.

తస్మాన్నార్హా వయం హన్తుం
ధార్తరాష్ట్రాన్స్వబాన్ధవాన్,
స్వజనం హి కథం హత్వా
సుఖిన స్స్యామ మాధవ! 37

ఓకృష్ణా! కావున మనబంధువులగు దుర్యోధనాదులను చంపుటకు మనము తగము. మనవారిని చంపి మన మెట్లు సుఖపడగలము?

యద్యప్యేతే న పశ్యన్తి
లోభోపహతచేతసః,

కులక్షయకృతం దోషం
మిత్రద్రోహే చ పాతకమ్. 38

కథం న జ్ఞేయమస్మాభిః
పాపాదస్మాన్నివర్తితుమ్,
కులక్షయకృతం దోషం
ప్రపశ్యద్భిర్జనార్దన ! 39

ఓ కృష్ణా! రాజ్యలోభముచే భ్రష్టచిత్తులైన దుర్యోధనాదులు వంశనాశనమువలన గలుగు దోషమును, మిత్రద్రోహమువలన గలుగు పాపమును, ఒకవేళ యెఱుఁగకున్నను, ఆరెండింటిని బాగుగ తెలిసినట్టి మనమేల యీ పాపకృత్యమునుండి విరమింపగూడదో అర్థము కాకున్నది.

కులక్షయే ప్రణశ్యన్తి
కులధర్మాస్సనాతనాః,



ధర్మే నష్టే కులం కృత్స్న
మధర్మోఽభిభవత్యుత. 40

అధర్మాభిభవాత్కృష్ణ!
ప్రదుష్యన్తి కులస్త్రియః,
స్త్రీషు దుష్టాసు వార్ష్ణేయ !
జాయతే వర్ణసంకరః. 41

సంకరో నరకాయైవ
కులఘ్నానాం కులస్య చ,
పతన్తి పితరో హ్యేషాం
లుప్తపిణ్డోదకక్రియాః. 42

ఓ కృష్ణా! కులము నశించుటచే అనాదిగ వచ్చు కులధర్మములు అంతరించిపోవును. ధర్మము నశించుటచే కులమంతటను అధర్మము వ్యాపించును. అధర్మము వృద్ధినొందుటచే, కులస్త్రీలు చాల చెడి

పోవుదురు. స్త్రీలు చెడిపోవుటచేవర్ణసంకరమేర్పడును. అట్టి వర్ణసంకరమువలన సంకరముచేసినవారికి, సంకరమునొందిన కులమునకుగూడ నరకము సంప్రాప్తింమను. వారిపితృ దేవతలు శ్రాద్ధములు, తర్పణములు లేనివారై యధోగతిని బొందుదురు.

దోషైరేతైః కులఘ్నానాం
వర్ణసఙ్కరకారకైః
ఉత్సాద్యన్తే జాతిధర్మాః
కులధర్మాశ్చ శాశ్వతాః. 43

ఉత్పన్న కులధర్మాణాం
మనుష్యాణాం జనార్దన!
నరకే నియతం వాసో
భవతీత్యనుశుశ్రుమ. 44

ఓ, కృష్ణా! కులనాశకులయొక్క జాతిసాంకర్య హేతువులైన ఈదోషములచేత శాశ్వతములగు



జాతిధర్మములు, కులధర్మములు నశించిపోవుచున్నవి. కులధర్మములునశించిన మానవులకు శాశ్వత నరకనివాసము కలుగునని మనము వినియున్నాము.

అహో! బత! మహత్పాపం
కర్తుం వ్యవసితా వయమ్,
యద్రాజ్యసుఖలోభేన
హన్తుం స్వజన ముద్యతాః. 45

కటకటా! రాజ్యసుఖమందలి యాశచే మనము బంధువులను చంపుటకుద్యమించి మహాపాపమును చేయుటకు సమకట్టితిమికదా!

యది మామప్రతీకార
మశస్త్రం శస్త్రపాణయః
ధార్తరాష్ట్రా రణే హన్యు
స్తన్మే క్షేమతరం భవేత్. 46

ఆయుధములు ధరింపకయు, ఎదిరించకయునున్న

నన్ను ఆయుధములు చేబూనిన దుర్యోధనాదు లీ యుద్ధమున జంపుదురేని అది నాకు మఱింత క్షేమ మైనదియే యగును.

సఞ్జయ ఉవాచ :—

ఏవముక్త్వాఽర్జునస్సఙ్ఖ్యే
రథోపస్థ ఉపావిశత్,
విసృజ్య సశరం చాపం
శోకసంవిగ్నమానసః. **47**

సంజయుడు చెప్పెను–(ఓధృతరాష్ట్ర మహారాజా!) యుద్ధభూమియం దర్జును డీప్రకారముగ జెప్పి, శోకముచే కలతనొందిన చిత్తముగలవాడై, బాణములో గూడిన వింటిని పాఱవైచి రథముపై చదికిలబడెను.

ఇతి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు
బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే
శ్రీ కృష్ణార్జున సంవాదే
అర్జునవిషాదయోగో నామ
ప్రథమోఽధ్యాయః

---

ఓం

శ్రీకృష్ణపరబ్రహ్మణే నమః

# శ్రీ భగవద్గీత

## అథ ద్వితీయోఽధ్యాయః

### సాఙ్ఖ్యయోగః

సఞ్జయ ఉవాచ :—

తం తథా కృపయాఽఽవిష్ట
మశ్రుపూర్ణాకులేక్షణమ్,
విషీదన్తమిదం వాక్య
మువాచ మధుసూదనః. **1**

సంజయుడు చెప్పెను–(ఓధృతరాష్ట్ర మహారాజా! ఆప్రకారముగ కనికరముతో గూడుకొని కంటనీరు పెట్టుకొనినవాడై వ్యాకులత్వము చెంది దుఃఖించుచున్న అర్జునుని జూచి శ్రీకృష్ణు డిట్లుపలికెను.

శ్రీ భగవానువాచ:-

కుతస్త్వా కశ్మలమిదం
విషమే సముపస్థితమ్,
అనార్యజుష్టమస్వర్గ్య
మకీర్తికరమర్జున! **2**

శ్రీభగవానుడు చెప్పెను- 'ఓ అర్జునా! పామరు లవలంబించునదియు, స్వర్గప్రతిబంధకమును, అపయశస్సును గలుగజేయునదియునగు ఈ మోహము, ఈ యుద్ధసమయమున నీ కెక్కడనుండి దాపురించినది?'

క్లైబ్యం మాస్మగమః పార్థ!
నైతత్త్వయ్యుపపద్యతే,
క్షుద్రం హృదయదౌర్బల్యం
త్యక్త్వోత్తిష్ఠ పరన్తప! **3**



ఓ అర్జునా! అధైర్యమును పొందకుము. ఇది నీకు తగదు. నీచమగు ఈమనోదుర్బలత్వమునువీడి యుద్ధముచేయుటకు లెమ్ము.

అర్జున ఉవాచ:-

కథం భీష్మమహం సంఖ్యే
ద్రోణం చ మధుసూదన!
ఇషుభిః ప్రతియోత్స్యామి
పూజార్హావరిసూదన! **4**

అర్జునుడు పలికెను:- ఓకృష్ణా! భీష్మద్రోణు లిరువురును పూజింపదగినవారు. అట్టివారిపై బాణములను వదలి నేనెట్లు యుద్ధము చేయగలను?

గురూనహత్వాహిమహానుభావాన్
శ్రేయోభోక్తుం భైక్ష్యమపీహలోకే,
హత్వార్థకామాంస్తు గురూనిహైవ
భుఞ్జీయ భోగాన్ రుధిరప్రదిగ్ధాన్.

మహానుభావులైన గురువులను చంపక ఈలోకమునందు భిక్షాన్నమైననుభుజించుట మంచిది. వారిని చంపినచో అత్తఱి వారి రక్తముతో తడిసిన ధన సంపదలనే (కామ్యభోగములనే) అనుభవింపవలసి యుండును.

న చైతద్విద్మః కతరన్నో గరీయో
యద్వా జయేమ యది వా నో
జయేయుః,
యానేవ హత్వా న జిజీవిషామ
స్తేఽవస్థితాః ప్రముఖే ధార్తరాష్ట్రాః

పైగా ఈ యుద్ధమున మనముగెల్చుదుమో లేక వారే గెల్చుదురో చెప్పలేము. ఈ రెండింటిలో మన కేది శ్రేష్ఠమో కూడ తెలియదు. ఎవరిని చంపి మనము జీవించగోరమో అట్టి భీష్మాదులు యుద్ధమున మనయెదుట నిలిచియున్నారు.

కార్పణ్యదోషోపహతస్వభావః
పృచ్ఛామి త్వాం ధర్మసమ్మూఢచేతాః



యచ్ఛ్రేయస్స్యాన్నిశ్చితం
బ్రూహి తన్మే
శిష్యస్తేఽహం శాధి మాం త్వాం
ప్రపన్నమ్. 7

ఓ కృష్ణా! కృపణత్వము (ఆత్మజ్ఞానశూన్యత) అను దోషముచే కొట్టబడినవాడనగుటచే ధర్మవిషయమున సందేహముగలిగి నిన్నడుగుచున్నాను. ఏది నిశ్చయముగ శ్రేయస్కరమో దానిని చెప్పుము. నేను నీకు శిష్యుడను; శరణుబొందిన నన్ను 'ఈప్రకారముగ న[illegible]కొనుము'-అని శాసింపుము.

న హి ప్రపశ్యామి మమాపనుద్యా
ద్యచ్ఛోకముచ్ఛోషణ
మిన్ద్రియాణామ్,
అవాప్య భూమావసపత్నమృద్ధం
రాజ్యం సురాణామపి చాధిపత్యమ్.



ఈభూమండలమున శత్రువులులేని సమృద్ధమైన రాజ్యమును, (స్వర్గమున) దేవతలయొక్క ఆధిపత్యమును పొందియుగూడ, ఇంద్రియములను శోషింప జేయుచున్న ఈ నా దుఃఖము నేది పోగొట్టగలదో దానిని కనుగొనజాలకున్నాను.

సఞ్జయ ఉవాచ :-

ఏవముక్త్వా హృషీకేశం
గుడాకేశః పరన్తపః
న యోత్స్య ఇతి గోవిన్ద
ముక్త్వా తూష్ణీం బభూవ హ. 9

సంజయుడు చెప్పెను:- ఓ రాజా! ఇవ్విధముగ అర్జునుడు శ్రీకృష్ణునితో చెప్పి 'నేను యుద్ధము చేయనని' పలికి ఊరకుండెను.

తమువాచ హృషీకేశః
ప్రహసన్నివ భారత!



సేనయోరుభయోర్మధ్యే
విషీదన్త మిదం వచః. 10

ఓ ధృతరాష్ట్రమహారాజా! రెండు సేనలమధ్య విలపించుచున్న ఆ అర్జునునిజూచి శ్రీకృష్ణుడు నవ్వుచున్నవానివలె ఈ (క్రింది) వాక్యములనుబలికెను.

శ్రీభగవానువాచ:-

అశోచ్యానన్వశోచస్త్వం
ప్రజ్ఞావాదాంశ్చ భాషసే,
గతాసూనగతాసూంశ్చ
నానుశోచన్తి పణ్డితాః. 11

శ్రీకృష్ణభగవానుడు చెప్పెను:- (ఓ అర్జునా!) నీవు శోకింపదగనివారినిగూర్చి శోకించితివి. పైగా బుద్ధివాదముతో గూడిన వాక్యములనుగూడ పలుకుచున్నావు. జ్ఞానులగువారు మరణించినవారిని గుఱించి గాని, జీవించియున్నవారిని గుఱించిగాని [illegible] దుఃఖింపరు.

న త్వేవాహం జాతు నాసం
న త్వం నేమే జనాధిపాః,
న చైవ న భవిష్యామ
స్సర్వే వయమతః పరమ్. **12**

అర్జునా! నేనుగాని, నీవుగాని, (యుద్ధభూమియం దుగల) రాజులుగాని, ఒకప్పుడును లేనివారము కాము. ముందును లేకపోవువారముకాము.

దేహినోఽస్మిన్ యథా దేహే
కౌమారం యౌవనం జరా,
తథా దేహాన్తర ప్రాప్తి
ర్ధీరస్తత్ర న ముహ్యతి. **13**

జీవునకీశరీరమునందు బాల్య, యౌవన, వార్ధక్యములను అవస్థలెట్లు కలుగుచున్నవో, అట్లే మరణానంతరము మఱియొకశరీరమును బొందుటయు తటస్థించుచున్నది. కావున నివ్విషయమునజ్ఞానియగువాడెంతమాత్రమును మోహమును (శోకమును) జెందడు.



మాత్రాస్పర్శాస్తు కౌన్తేయ!
శీతోష్ణసుఖదుఃఖదాః,
ఆగమాపాయినోఽనిత్యా
స్తాం స్తితిక్షస్వ భారత! **14**

ఓ అర్జునా! ఇంద్రియములయొక్క శబ్దస్పర్శాది విషయ సంయోగములు ఒకపుడు శీతమును, ఒకపుడు ఉష్ణమును, ఒకపుడు సుఖమును, మఱియొకపుడు దుఃఖమును గలుగజేయుచుండును. మఱియు నవి రాకపోకడలు గలవియై అస్థిరములైయున్నవి. కాబట్టి వానిని ఓర్చుకొనుము.

యం హి న వ్యథయన్త్యేతే
పురుషం పురుషర్షభ!
సమదుఃఖసుఖం ధీరం
సోఽమృతత్వాయ కల్పతే. **15**

పురుషశ్రేష్ఠుడవగు ఓ, అర్జునా! ఎవరిని ఈ శబ్ద

స్పర్శాదులుబాధింపవో (చలింపజేయవో) సుఖదుఃఖములందుసమభావముగల అట్టి ధీరుడే మోక్షమున కర్హుడగును.

నాసతో విద్యతే భావో
నాభావో విద్యతే సతః,
ఉభయోరపి దృష్టోఽన్త
స్త్వనయోస్తత్త్వదర్శిభిః. **16**

అసత్యములై (నామరూపాత్మకములై, నశించు స్వభావముగలవియై) నట్టి దేహాదులకు ఉనికిలేదు. సత్యమైనట్టి ఆత్మకు లేమిలేదు. తత్త్వజ్ఞానులగువారీ రెండింటియొక్క నిశ్చయమును బాగుగ తెలిసికొనియున్నారు.

అవినాశి తు తద్విద్ధి
యేన సర్వమిదం తతమ్,
వినాశమవ్యయస్యాస్య
న కశ్చిత్కర్తుమర్హతి. **17**



ఓ అర్జునా! ఈసమస్తప్రపంచమున్ను ఏ పరమాత్మచేత వ్యాపింపబడియున్నదో, అది నాశరహితమైయున్నదని యెఱుఁగుము. అవ్యయమగు అట్టి ఆత్మకు వినాశము నెవడును కలుగజేయజాలడు.

అన్తవన్త ఇమే దేహా
నిత్యస్యోక్తాశ్శరీరిణః,
అనాశినోఽప్రమేయస్య
తస్మాద్యుధ్యస్వ భారత! **18**

ఓ అర్జునా! నిత్యుడును, నాశరహితుడును, అప్రమేయుఁడునగు దేహి (ఆత్మ) యొక్క ఈ దేహములు, నాశవంతములుగ జెప్పబడినవి. (ఆత్మయో శాశ్వతుడు.) కాబట్టి (ఆత్మనుగూర్చికాని, దేహమునుగూర్చికాని శోకమును వదలి) నీవు యుద్ధము చేయుము.

య ఏనం వేత్తి హన్తారం
యశ్చైనం మన్యతే హతమ్,

ఉభౌ తౌ న విజానీతో
నాయం హన్తి న హన్యతే. **19**

ఎవడీయాత్మను చంపువానినిగ నెఱుంగునో లేక ఎవడు చంపబడువానినిగ భావించునో, వారిరువురును వాస్తవమెఱింగినవారు కాదు. యథార్థముగ ఈ యాత్మ దేనినిచంపుట లేదు, దేనిచేతను చంపబడుట లేదు.

న జాయతే మ్రియతే వా కదాచి
న్నాయం భూత్వా భవితా వా న భూయః,
అజో నిత్యశ్శాశ్వతోఽయం పురాణో
న హన్యతే హన్యమానే శరీరే.

ఈ ఆత్మ ఎప్పుడును పుట్టుట లేదు. చచ్చుట లేదు. ఇదివఱకు లేకుండ మరల క్రొత్తగా కలుగువాడు కాదు. (ఉండి మరల లేకుండువాడును కాదు) ఈతడు జనన మరణములు లేనివాడు. శాశ్వతుడు. పురాతనుడు. శరీరము చంపబడినను ఈతడు చంపబడుట లేదు.



వేదావినాశినం నిత్యం
య ఏన మజ మవ్యయమ్,
కథం స పురుషః పార్థ
కం ఘాతయతి హన్తి కమ్. **21**

ఓ అర్జునా! ఈయాత్మ నెవడు జననమరణములు లేనివానిగను, నాశరహితునిగను, నిత్యునిగను ఎఱుంగునో, అట్టివాడెట్లు ఒకనిని చంపించగలడు? తాను చంపగలడు?

వాసాంసి జీర్ణాని యథా విహాయ
నవాని గృహ్ణాతి నరోఽపరాణి
తథా శరీరాణి విహాయ జీర్ణా
న్యన్యాని సంయాతి నవాని దేహీ.

చినిగిపోయిన పాతబట్టలను విడిచి మనుజుడు ఇతరములగు క్రొత్తబట్టల నెట్లుధరించుచున్నాడో, అట్లే, దేహియగు ఆత్మయు, శిథిలములైన పాత శరీ

శరీరములను వదలి ఇతరములగు క్రొత్త శరీరములను ధరించుచున్నాడు.

నైనం ఛిన్దన్తి శస్త్రాణి
నైనం దహతి పావకః,
న చైనం క్లేదయన్త్యాపో
న శోషయతి మారుతః. **23**

ఈ ఆత్మను ఆయుధము లెవ్వియును ఛేదింప జాలవు. అగ్ని దహింపజాలదు, నీరు తడుపజాలదు, గాలి యెండింపజాలదు.

అచ్ఛేద్యోఽయమదాహ్యోఽయ
మక్లేద్యోఽశోష్య ఏవ చ,
నిత్యస్సర్వగతస్థాణు
రచలోఽయం సనాతనః. **24**

ఈ ఆత్మ ఛేదింపబడజాలడు, దహింపబడజాలడు, తడుపబడజాలడు, ఎండింపబడజాలడు. ఇతడు



నిత్యుడు, సర్వవ్యాపి, స్థిరస్వరూపుడు, నిశ్చలుడు, పురాతనుడు.

అవ్యక్తోఽయమచిన్త్యోఽయ
మవికార్యోఽయ ముచ్యతే,
తస్మాదేవం విదిత్వైనం
నానుశోచితుమర్హసి. **25**

ఈ ఆత్మ ఇంద్రియములకు గోచరముకానివాడు, మనస్సుచే చింతింప శక్యము కానివాడు, వికారములు పొందింపదగనివాడు నని చెప్పబడుచున్నాడు. కావున ఈప్రకారముగ తెలిసికొని నీవు దుఃఖింప తగవు.

అథ చైనం నిత్యజాతం
నిత్యం వా మన్యసే మృతమ్,
తథాఽపి త్వం మహాబాహో!
నైవం శోచితుమర్హసి. **26**

ఓ అర్జునా! ఒకవేళ ఈఆత్మ (దేహముతో పాటు)నిరంతరము పుట్టుచు చచ్చుచు నుండువాడని తలంచినను అట్టి స్థితియందుగూడ నీవీ ప్రకారము శోకించుట తగదు.

జాతస్య హి ధ్రువో మృత్యు
ర్ధ్రువం జన్మ మృతస్య చ,
తస్మాదపరిహార్యేఽర్థే
న త్వం శోచితు మర్హసి. **27**

(ఒకవేళ నీవీయాత్మను చావు పుట్టుకలుకలవానిగ తలంచెదవేని అత్తఱి)పుట్టినవానికి చావుతప్పదు. చచ్చినవానికి పుట్టుక తప్పదు. తప్పనిసరియగు ఆ విషయమున నీవిక శోకించుట యుక్తముకాదు.

అవ్యక్తాదీని భూతాని
వ్యక్తమధ్యాని భారత!
అవ్యక్త నిధనాన్యేవ
తత్ర కా పరిదేవనా. **28**



ఓ అర్జునా! ప్రాణికోట్లన్నియు పుట్టుకకు పూర్వము కనబడకయు పుట్టినపిదప (దేహముతో గూడి) కనబడుచును, మరణించినపిదప మరల కనబడకయు నుండుచున్నవి. అట్టివానివిషయమై శోకింపనేల? (మొదట కనబడక మరల కనబడి, తిరిగి అంతరించిపోవు భ్రాంతిరూపములైన ఈ దేహములకొఱకై దుఃఖింపనేల యని భావము. లేక, ఆదియందుఏ అవ్యక్తరూపముకలిగియున్నదో, అట్టి అవ్యక్తరూపమునే తిరిగి అంత్యమున ధరించుచుండ నిక దానికై శోకింపనేల? అనియు చెప్పవచ్చును.)

ఆశ్చర్యవత్పశ్యతి కశ్చిదేన
మాశ్చర్యవద్వదతి తథైవ చాన్యః,
ఆశ్చర్యవచ్చైన మన్యశ్శృణోతి
శ్రుత్వాప్యేనం వేద నచైవ కశ్చిత్.

ఈ ఆత్మను ఒకానొకడు ఆశ్చర్యమైనదానివలె చూచుచున్నాడు. మఱియొకడు ఆశ్చర్యమైనదానివలె (దీనిని చూచి) చెప్పుచున్నాడు. అట్లే వేఱొకడు

ఆశ్చర్యమైనదానినివలె దీనినిగూర్చి వినుచున్నాడు. అట్లు వినియు, చూచియు, చెప్పియుగూడ ఒకడును దీనిని సరిగా తెలిసికొనుట లేదు. (సాక్షాత్తుగ అనుభవింపగల్గువారరుదని భావము.)

దేహీ నిత్యమవధ్యోఽయం
దేహే సర్వస్య భారత!
తస్మాత్సర్వాణి భూతాని
న త్వం శోచితు మర్హసి. **30**

అర్జునా! సమస్తప్రాణికోట్లయొక్కయు దేహము లందు వసించియున్న ఈ ఆత్మ యెన్నడును చంపబడడు. కావున ఏప్రాణినిగూర్చియు నీవు శోకింపదగదు.

స్వధర్మమపి చావేక్ష్య
న వికమ్పితు మర్హసి,
ధర్మ్యాద్ధి యుద్ధాచ్ఛ్రేయోఽన్యత్
క్షత్రియస్య న విద్యతే. **31**



మఱియు ఓఅర్జునా! స్వకీయమగు క్షత్రియ ధర్మమును విచారించుకొనినను యుద్ధమునకు వెనుదీయుట నీకు సరియైనది కాదు. ఏలయనిన క్షత్రియునకు ధర్మయుద్ధముకంటె శ్రేయస్కరమైనది మఱియొకటి లేదుకదా!

యదృచ్ఛయా చోపపన్నం
స్వర్గద్వార మపావృత మ్,
సుఖినః క్షత్రియాః పార్థ!
లభన్తే యుద్ధ మీదృశమ్. **32**

ఓ అర్జునా! అప్రయత్నముగనే లభించునట్టిదియు, తెఱువబడిన స్వర్గద్వారమువంటిదియు(స్వర్గమునుగలుగజేయునదియు) నగు ఇట్టియుద్ధమును ఏ క్షత్రియులు పొందుదురో వారు నిక్కముగ సుఖవంతులే యగుదురు.

అథ చేత్త్వమిమం ధర్మ్యం
సంగ్రామం న కరిష్యసి.

తత స్స్వధర్మం కీర్తించ
హిత్వా పాప మవాప్స్యసి. 33

ఇక నీవు ధర్మయుక్తమగు ఈ యుద్ధమును చేయకుందువేని, దానిచే నీవు స్వధర్మమును నిరసించినవాడవై, కీర్తిని బోగొట్టుకొని, పాపమును బొందగలవు.

అకీర్తిం చాపి భూతాని
కథయిష్యన్తి తేఽవ్యయామ్,
సంభావితస్య చాకీర్తి
ర్మరణాదతిరిచ్యతే. 34

మఱియు లోకులు నీయొక్క అపకీర్తిని చిరకాలమువఱకు చెప్పుకొనుచుందురు. గౌరవముగ బ్రతికినవానికి అపకీర్తి చావుకంటెను అధికమైనది.

భయాద్రణా దుపరతం
మంస్యన్తే త్వాం మహారథాః,



యేషాం చ త్వం బహుమతో
భూత్వా యాస్యసి లాఘవమ్. 35

మఱియు ఇంతవరకు ఏ మహారథులందు నీవు ఘనముగా భావింపబడుచుంటివో, వారెల్లరు నిన్నిపుడు చులకనజేసి భయముచే యుద్ధమునుండి మఱలినవానినిగ నిన్ను దలంతురు.

అవాచ్యవాదాంశ్చ బహూన్
వదిష్యన్తి తవాహితాః,
నిన్దన్తస్తవ సామర్థ్యం
తతో దుఃఖతరం ను కిమ్. 36

(ఇంతియేకాక అత్తఱి) శత్రువులు నీయొక్క సామర్థ్యమును దూషించుచు పెక్కు దుర్భాషణములను గూడ పలుకగలరు. దానినిమించిన దుఃఖమేమి కలదు?

హతో వా ప్రాప్స్యసే స్వర్గం
జిత్వా వా భోక్ష్యసే మహీమ్,

తస్మాదుత్తిష్ఠ కౌన్తేయ!
యుద్ధాయ కృతనిశ్చయః. 37

అర్జునా! ఒకవేళ నీవీ ధర్మయుద్ధమందు శత్రువులచే చంపబడినచో స్వర్గమును బొందెదవు. అట్లుగాక నీవే జయించినచో భూలోక రాజ్యము ననుభవించెదవు. ఈప్రకారముగ రెండువిధముల మేలే. కావున లెమ్ము, యుద్ధమునకు సంసిద్ధుడవు కమ్ము.

సుఖదుఃఖే సమే కృత్వా
లాభాలాభౌ జయాజయౌ,
తతో యుద్ధాయ యుజ్యస్వ
నైవం పాపమవాప్స్యసి. 38

సుఖదుఃఖములయందును, లాభనష్టములందును, జయాపజయములందును సమబుద్ధిగలిగియుద్ధమునకు సంసిద్ధుడవగుము. ఇట్లు చేసితివేని నీవు పాపమును పొందకుందువు.



ఏషా తేఽభిహితా సాంఖ్యే
బుద్ధిర్యోగే త్విమాం శృణు,
బుద్ధ్యా యుక్తో యయా పార్థ!
కర్మబన్ధం ప్రహాస్యసి. 39

ఓ అర్జునా! ఇంతవఱకు సాంఖ్యశాస్త్రమున జెప్పబడిన ఆత్మతత్త్వనిశ్చయమును దెలిపియుంటిని. ఇక యోగశాస్త్రమందలి కర్మయోగసంబంధమైన వివేకమును నీకుఁ దెలుపబోవుచున్నాను. అద్దాని నెఱింగినచో నీవు కర్మబంధమునుండి లెస్సగ విముక్తుడవు కాగలవు. కాబట్టి శ్రద్ధతో నాలకింపుము.

నేహాభిక్రమనాశోఽస్తి
ప్రత్యవాయో న విద్యతే,
స్వల్పమప్యస్య ధర్మస్య
త్రాయతే మహతో భయాత్. 40

ఈ కర్మయోగము ప్రారంభింపబడినది నిష్ఫలమెన్నటికిని కానేరదు. పూర్తియగుటకు ముందుగా

ఏకారణముచేనైన మధ్యలో నిలిచిపోయినను దోషములేదు. ఈకర్మయోగానుష్ఠానమనుధర్మము ఒకింతైనను గొప్పదైన (జనన, మరణ ప్రవాహ రూపమైన) సంసార భయమునుండి రక్షించుచున్నది.

వ్యవసాయాత్మికాబుద్ధి
రేకేహ కురునన్దన!
బహుశాఖా హ్యనన్తాశ్చ
బుద్ధయోఽవ్యవసాయినామ్. 41

అర్జునా! ఈకర్మయోగానుష్ఠానమున నిశ్చయముతో గూడిన బుద్ధి ఒక్కటియే. నిశ్చయములేని వారలయొక్క బుద్ధులు పలువిధములుగను, అనంతములుగను నున్నవి.

యామిమాం పుష్పితాం వాచం
ప్రవదన్త్యవిపశ్చితః,
వేదవాదరతాః పార్థ!
నాన్యదస్తీతి వాదినః. 42



కామాత్మానః స్వర్గపరా
జన్మకర్మఫలప్రదామ్,
క్రియావిశేషబహులాం
భోగైశ్వర్యగతిం ప్రతి. 43

భోగైశ్వర్య ప్రసక్తానాం
తయాఽపహృతచేతసామ్,
వ్యవసాయాత్మికా బుద్ధి
స్సమాధౌ న విధీయతే. 44

ఓ అర్జునా! వేదమునందు ఫలమును దెలుపు భాగములందిష్టము కలవారును, అందు చెప్పబడిన స్వర్గాదిఫలితములకంటె అధికమైనది వేరొకటి యెద్దియు లేదని వాదించువారును, విషయవాంఛలతో నిండిన చిత్తముకలవారును, స్వర్గాభిలాషులు నగు అల్పజ్ఞులు, జన్మము, కర్మము, తత్ఫలము నొసంగునదియు, భోగైశ్వర్య సంపాదనకై వివిధ కార్యకలాపములతో గూడినదియు, ఫలశూన్యమైన

దియనగు ఏవాక్యమును చెప్పుచున్నారో, అద్దానిచే నపహరింపబడిన చిత్తముకలవారును (ఆ వాక్యమును నమ్మి దృశ్యవ్యామోహమందు పడువారును) భోగైశ్వర్యప్రియులునగు జనులకు దైవధ్యానమందు (సమాధినిష్ఠయందు) నిశ్చయమైన, (ఏకాగ్రమైన) బుద్ధి కలుగనే కలుగదు.

త్రైగుణ్యవిషయా వేదా
నిస్త్రైగుణ్యో భవార్జున
నిర్ద్వన్ద్వో నిత్యసత్త్వస్థో
నిర్యోగక్షేమ ఆత్మవాన్. 45

ఓ అర్జునా! వేదములు (అందలి పూర్వభాగమగు కర్మకాండము) త్రిగుణాత్మకములగు (సంసార) విషయములను తెలుపునవిగా నున్నవి. నీవు త్రిగుణములను వదలినవాడవును, ద్వంద్వములు లేనివాడవును, నిరంతరము శుద్ధసత్త్వము నాశ్రయించినవాడవును, యోగక్షేమముల దృష్టిలేనివాడవును, ఆత్మజ్ఞానివియు కమ్ము!



యావానర్థ ఉదపానే
సర్వతస్సంప్లుతోదకే
తావాన్సర్వేషు వేదేషు
బ్రాహ్మణస్య విజానతః. 46

స్నానపానాదుల కుపయుక్తమగు స్వల్పజలము గల బావి మొదలగువానియం దెంత ప్రయోజనము కలదో, అంత ప్రయోజనము అంతటను నీటితో నిండియున్న మహత్తర జలప్రవాహమునం దిమిడియున్న చందమున వేదములందు చెప్పబడిన సమస్త కర్మములందును ఎంత ప్రయోజనము కలదో అంత ప్రయోజనము పరమార్థతత్త్వము నెఱింగిన బ్రహ్మనిష్ఠునకు బ్రహ్మానందమున నిమిడియున్నది.

కర్మణ్యేవాధికారస్తే
మా ఫలేషు కదాచన
మా కర్మఫలహేతుర్భూ
ర్మాతే సఙ్గోఽస్త్వకర్మణి. 47

అర్జునా! నీకు కర్మనుచేయుటయందే అధికారము కలదు. కర్మఫలముల నాశించుటయందెన్నడును నీకధికారము లేదు. కర్మఫలములకు నీవు కారణభూతుడవు కాకుము. మఱియు కర్మలుమానుటయందును నీకాసక్తి కలుగకుండుగాక!

యోగస్థః కురు కర్మాణి
సఙ్గం త్యక్త్వా ధనంజయ!
సిద్ధ్యసిద్ధ్యోః సమో భూత్వా
సమత్వం యోగ ఉచ్యతే. **48**

ఓ అర్జునా! నీవు యోగనిష్ఠయందుండి, సంగమును త్యజించి, కార్యము ఫలించినను, ఫలించక పోయినను సమానముగ నున్నవాడవై కర్మలను జేయుము. అట్టిసమత్వబుద్ధియే యోగమనబడును.

దూరేణ హ్యవరం కర్మ
బుద్ధియోగా ద్ధనంజయ



బుద్ధౌ శరణ మన్విచ్ఛ
కృపణాః ఫలహేతవః. **49**

ఓ అర్జునా! (పైన దెల్పిన) సమత్వబుద్ధితో గూడిన నిష్కామకర్మము కంటె ఫలాపేక్షతో గూడిన కామ్యకర్మము చాలతక్కువైనదిగదా! కావున సమత్వరూపమైన అట్టి నిష్కామ కర్మానుష్ఠానబుద్ధినే నీవాశ్రయింపుము. ఫలమును గోరువారు అల్పులు (దీనులు).

బుద్ధియుక్తో జహాతీహ
ఉభే సుకృతదుష్కృతే
తస్మాద్యోగాయ యుజ్యస్వ
యోగః కర్మసు కౌశలమ్. **50**

సమత్వబుద్ధి కలవాడు పుణ్యపాపముల రెండిటిని ఈ జన్మయందే తొలగించుకొనుచున్నాడు. కావున ఇట్టి సమత్వబుద్ధియుక్తమగు నిష్కామకర్మయోగముకొఱకు యత్నింపుము. కర్మలయందలి నేర్పరితనమే యోగమనబడును.

కర్మజం బుద్ధియుక్తా హి
ఫలం త్యక్త్వా మనీషిణః
జన్మబన్ధవినిర్ముక్తాః
పదం గచ్ఛన్త్యనామయమ్. **51**

సమత్వబుద్ధితో గూడిన వివేకవంతులు కర్మముల నాచరించుచున్నను వానిఫలమును త్యజించివైచి జనన మరణరూపమగుబంధమునుండి విడుదలను బొందిన వారై దుఃఖరహితమగు మోక్షపదవిని బొందు చున్నారు.

యదా తే మోహకలిలం
బుద్ధిర్వ్యతితరిష్యతి
తదా గన్తాసి నిర్వేదం
శ్రోతవ్యస్య శ్రుతస్య చ. **52**

అర్జునా! నీబుద్ధి యెపుడు అజ్ఞానమను మాలిన్యమును దాటివేయునో (తొలగించుకొని పరిశుద్ధమగునో) అపుడిక వినవలసినదానినిగూర్చియు వినిన దానిని గూర్చియు, నీవు విరక్తిగలిగి యుందువు.



శ్రుతివిప్రతిపన్నా తే
యదా స్థాస్యతి నిశ్చలా
సమాధావచలా బుద్ధి
స్తదా యోగమవాప్స్యసి. **53**

నానావిధములగు శ్రవణాదులచే కలత జెంది యున్న నీ బుద్ధియెపుడు చలింపనిదై పరమాత్మ ధ్యానమందు స్థిరముగ నిలిచియుండునో, అపుడు నీ వాత్మసాక్షాత్కారమును బొందగలవు.

అర్జున ఉవాచ:—

స్థితప్రజ్ఞస్య కా భాషా
సమాధిస్థస్య కేశవ
స్థితధీః కిం ప్రభాషేత
కిమాసీత వ్రజేత కిమ్. **54**

అర్జును డడిగెను:-

ఓ కృష్ణా! సమాధియందున్న స్థితప్రజ్ఞుడగు జీవ

న్మనస్కుని యొక్క లక్షణమేమి ? అతడెట్లు మాట్లాడును? ఏ రీతిగ నుండును? ఎట్లు సంచరించును?

శ్రీ భగవానువాచ :—

ప్రజహాతి యదా కామాన్
సర్వాన్ పార్థ మనోగతాన్,
ఆత్మన్యేవాత్మనా తుష్టః
స్థితప్రజ్ఞ స్తదోచ్యతే. **55**

శ్రీకృష్ణుడు చెప్పెను:—

ఓ అర్జునా! ఎపుడు మనుజుడు తన మనస్సునందున్నట్టి కోరికలన్నిటిని సంపూర్ణముగ వదలివేయునో, మఱియు ఆత్మయందే ఆత్మచే (నిర్మల చిత్తముతో) నిరంతరము సంతుష్టినిబొందుచుండునో, అప్పు డాతడు స్థితప్రజ్ఞుడని చెప్పబడును.

దుఃఖేష్వనుద్విగ్నమనాః
సుఖేషు విగతస్పృహః,



వీతరాగ భయ క్రోధః
స్థితధీర్మునిరుచ్యతే. **56**

దుఃఖములందు కలతనొందని మనస్సుగలవాడును, సుఖములందు ఆసక్తిలేనివాడును, అనురాగము, భయము, కోపము తొలగినవాడునగు (ఆత్మ) మననశీలుడు స్థితప్రజ్ఞుడని చెప్పబడును.

య స్సర్వత్రానభిస్నేహ
స్తత్తత్ప్రాప్య శుభాశుభమ్,
నాభినన్దతి న ద్వేష్టి
తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా. **57**

ఎవడు సమస్తవిషయములందును(దేహ, బంధు, భోగాదులందు) అభిమానము లేకయుండునో, ఆయా ప్రియాప్రియములు సంభవించినను సంతోషమునుగాని, ద్వేషమునుగాని బొందకుండునో, అట్టివాని జ్ఞానము మిగుల స్థిరమైనది యగును. (అట్టివాడే స్థితప్రజ్ఞుడు.)

యదా సంహరతే చాయం
కూర్మోఽఙ్గానీవ సర్వశః,
ఇన్ద్రియాణీన్ద్రియార్థేభ్య
స్తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా.

తాబేలు తన అవయవములను లోనికి ముడుచుకొనునట్లు, యోగి యెపుడు తన ఇంద్రియములను ఇంద్రియార్థములగు విషయములనుండి సర్వత్ర వెనుకకు మరల్చుచున్నాడో, అపుడాతని జ్ఞానము మిగుల స్థిరమైనది యగును. (అతడు స్థితప్రజ్ఞుడగును.)

విషయా వినివర్తన్తే
నిరాహారస్య దేహినః,
రసవర్జం రసోఽప్యస్య
పరం దృష్ట్వా నివర్తతే. 59

శబ్దాది విషయములను స్వీకరింపనట్టి జీవునకు, ఆ విషయములు తొలగుచున్న వేళాని వానిఁ గూర్చిన వాసన పోవుట లేదు. పరమాత్మను దర్శించినచో ఆ వాసనయు విషయములతోఁబాటు తొలగి పోవుచున్నది.



యతతో హ్యపి కౌన్తేయ!
పురుషస్య విపశ్చితః
ఇన్ద్రియాణి ప్రమాథీని
హరన్తి ప్రసభం మనః. 60

ఓ అర్జునా! ఇంద్రియములు మహాశక్తివంతములైనవి. ఏలయనిన ఆత్మావలోకనముకొఱకు యత్నించుచున్నట్టి విద్వాంసుడగు మనుజునియొక్క మనస్సును గూడ నయ్యవి బలాత్కారముగ (విషయములపైకి) లాగుకొని పోవుచున్నవి.

తాని సర్వాణి సంయమ్య
యుక్త ఆసీత మత్పరః,
వశే హి యస్యేన్ద్రియాణి
తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా. 61

(బలవత్తరములగు) అట్టి యింద్రియములన్నిటిని చక్కగా వశపఱచుకొని సాధకుడు మనఃస్థిరత్వము (సమాధి) గలవాడై నాయందే (ఆత్మయందే) ఆసక్తమైన మనస్సు గల్గియుండవలెను. ఏలయనగా, ఎవని యింద్రియములు స్వాధీనమునందుండునో, అతని జ్ఞానమే సుస్థిరమై వెలయగలదు.

ధ్యాయతో విషయాన్ పుంసః
సజ్గ స్తేషూపజాయతే,
సజ్గాత్సంజాయతే కామః
కామాత్క్రోధోఽభిజాయతే.

క్రోధా ద్భవతి సమ్మోహః
సమ్మోహాత్స్మృతివిభ్రమః,
స్మృతిభ్రంశాద్బుద్ధినాశో
బుద్ధినాశాత్ప్రణశ్యతి. 63



మనుజుడు శబ్దాది విషయములను చింతించుచుండుట వలన ఆ విషయములందాసక్తి జనించుచున్నది. అట్టి యాసక్తిచే దానియందాతనికి కోరిక ఉదయించుచున్నది. ఆ కోరికవలన కోపముపుట్టుచున్నది. కోపమువలన అవివేకము, అవివేకమువలన మఱపు, మఱపువలన బుద్ధినాశము క్రమముగ సంభవించుచున్నవి. బుద్ధినాశముచే తుదకు పూర్తిగ చెడినవాడగుచున్నాడు.

రాగద్వేషవియుక్తైస్తు
విషయా నిన్ద్రియై శ్చరన్,
ఆత్మవశ్యై ర్విధేయాత్మా
ప్రసాద మధిగచ్ఛతి. 64

కాని, స్వాధీనమైన మనస్సుకలవాడు, రాగద్వేష రహితములును, తనకు అధీనములైయున్న వియునగు ఇంద్రియములచే (దేహయాత్రోపయుక్తములగు) అన్నపానాది విషయములను అనుభవించుచున్నవాడైనను మనోనిర్మలత్వమును (మనశ్శాంతిని) పొందుచున్నాడు.

ప్రసాదే సర్వదుఃఖానాం
హాని రస్యోపజాయతే,
ప్రసన్న చేతసో హ్యాశు
బుద్ధిః పర్యవతిష్ఠతి. **65**

మనోనిర్మలత్వము కలుగగా దానివలన మనుజునకు సమస్తదుఃఖములున్ను ఉపశమించిపోవుచున్నవి. నిర్మలమనస్కునకు బుద్ధి శీఘ్రముగ (పరమాత్మయందు) స్థిరత్వమును జెందుచున్నది.

నాస్తి బుద్ధి రయుక్తస్య
న చాయుక్తస్య భావనా
న చాభావయతః శాన్తి
రశాన్తస్య కుతః సుఖమ్. **66**

**ఇంద్రియనిగ్రహము, మనస్సంయమము లేనివానికి వివేకబుద్ధి కలుగదు. ఆత్మచింతనయు సంభవింపనేరదు. ఆత్మచింతనలేనివానికి శాంతిలభించదు; శాంతిలేనివానికిక సుఖమెచట?**



ఇన్ద్రియాణాం హి చరతాం
యన్మనోఽనువిధీయతే,
తదస్య హరతి ప్రజ్ఞాం
వాయుర్నావమివామ్భసి. **67**

విషయములందు ప్రవర్తించుచున్న ఇంద్రియములలో నెద్దానిని మనస్సు అనుసరించిపోవునో, అయ్యది మనుజునియొక్క వివేకమును — జలమందు ఓడను ప్రతికూలవాయువు పెడదారికిలాగుకొని పోవునట్లు హరించివేయుచున్నది.

తస్మాద్యస్య మహాబాహో
నిగృహీతాని సర్వశః
ఇన్ద్రియాణీన్ద్రియార్థేభ్య
స్తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా. **68**

కాబట్టి ఓ అర్జునా! ఎవడు తనయింద్రియములను విషయములపైకి పోనీయక సర్వవిధముల అరికట్టుచున్నాడో, అతని జ్ఞానమే మిగుల స్థిరమైయుండును.

యా నిశా సర్వభూతానాం
తస్యాం జాగర్తి సంయమీ
యస్యాం జాగ్రతి భూతాని
సా నిశా పశ్యతో మునేః. **69**

సమస్తప్రాణులకును (సామాన్యజనులకు) ఏది (పరమార్థతత్త్వము) రాత్రియై (దృష్టికి గోచరము కాక) యున్నదో, దానియందు ఇంద్రియ నిగ్రహపరుడగు యోగి మేలుకొనియుండును. (ఆత్మావలోకనము జేయుచుండును). దేనియందు(ఏ శబ్దాది విషయములందు) ప్రాణులు మేలుకొనియున్నారో (ఆసక్తితో ప్రవర్తించుచున్నారో) అది (విషయజాలము) పరమార్థతత్త్వమునుదర్శించు మునీంద్రునకు రాత్రిగా నుండును (దృష్టిగోచరము కాకయుండును).

ఆపూర్యమాణ మచల ప్రతిష్ఠమ్
సముద్ర మాపః ప్రవిశన్తి యద్వత్,



తద్వత్కామా యం ప్రవిశన్తి సర్వే
స శాన్తి మాప్నోతి న కామకామీ.

జలములచే సంపూర్ణముగ నింపబడినదియు, నిశ్చలమైనదియునగు సముద్రమును నదీజలములు మున్నగునవి యేప్రకారము ప్రవేశించుచున్నవో, ఆ ప్రకారమే భోగ్యవిషయములన్నియు ఏ బ్రహ్మనిష్ఠుని పొంది (ఆతనిని వికృతముచేయలేక) అణగిపోవుచున్నవో, ఆతడే శాంతినిపొందునుగాని విషయాసక్తికలవాడు కాడు.

విహాయ కామాన్ యస్సర్వాన్
పుమాంశ్చరతి నిస్స్పృహః,
నిర్మమో నిరహంకారః
స శాన్తి మధిగచ్ఛతి. **71**

ఎవడు సమస్తములైన కోరికలను, శబ్దాదివిషయములను త్యజించి, వానియందేమాత్రము ఆశలేక, అహంకార మమకార వర్జితుడై ప్రవర్తించునో అట్టివాడే శాంతిని పొందుచున్నాడు.

ఏషా బ్రాహ్మీస్థితిః పార్థ !
నైనాం ప్రాప్య విముహ్యతి
స్థిత్వాఽస్యామన్తకాలేఽపి,
బ్రహ్మనిర్వాణమృచ్ఛతి. **72**

అర్జునా! ఇదియంతయు బ్రహ్మసంబంధమైనస్థితి; ఇట్టి బ్రాహ్మీస్థితినిబొందినవాడు మఱల నెన్నటికిని విమోహమును జెందనేరడు. అంత్యకాలమునందు గూడ ఇట్టి స్థితియందున్నవాడు బ్రహ్మానందరూప మోక్షమును బడయుచున్నాడు.

ఇతి శ్రీమద్భగవద్గీతానూపనిషత్సు
బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే
శ్రీ కృ ష్ణా ర్జు న సం వా దే
సా ఙ్ఖ్య యో గో నా మ
ద్వితీయోఽధ్యాయః.

---

ఓమ్

శ్రీకృష్ణపరబ్రహ్మణే నమః

# శ్రీ భగవద్గీత

## అథ తృతీయోఽధ్యాయః

### కర్మయోగః

అర్జున ఉవాచ :—

జ్యాయసీ చేత్కర్మణస్తే
మతా బుద్ధిర్జనార్దన,
తత్కిం కర్మణి ఘోరే మాం
నియోజయసి కేశవ.

అర్జునుడు చెప్పెను:— ఓ కృష్ణా! జ్ఞానము కర్మముకంటె శ్రేష్ఠమైనదని నీ యభిమతమగుచో, మఱి యీ భయంకరమైన (యుద్ధ) కర్మమునందు నన్నేల ప్రవర్తింప జేయుచున్నావు?

వ్యామిశ్రేణేవ వాక్యేన
బుద్ధిం మోహయసీవ మే
తదేకం వద నిశ్చిత్య
యేన శ్రేయోఽహమాప్నుయామ్.

(ఓ కృష్ణా!) మిశ్రమమైనదానివలెనున్న వాక్యము చేత నా బుద్ధిని కలవర పెట్టువానివలెనున్నావు. కావున నేను దేనిచే శ్రేయమును పొందగలనో అట్టి యొకదానిని (కర్మ, జ్ఞానములలో) నిశ్చయించి నాకు జెప్పుము.

శ్రీ భగవానువాచ:—

లోకేఽస్మిన్ ద్వివిధా నిష్ఠా
పురా ప్రోక్తా మయాఽనఘ,
జ్ఞానయోగేన సాంఖ్యానాం
కర్మయోగేన యోగినామ్. 3



శ్రీ భగవానుడు చెప్పెను

పాపరహితుడవగు ఓ అర్జునా! పూర్వమీలోకము సాంఖ్యులకు (తత్త్వవిచారణాపరులకు) జ్ఞానయోగము యోగులకు కర్మయోగము అను రెండు విధములగు అనుష్ఠానము నాచే జెప్పబడియుండెను.

న కర్మణామనారమ్భా
న్నైష్కర్మ్యం పురుషోఽశ్నుతే,
న చ సన్న్యసనాదేవ
సిద్ధిం సమధిగచ్ఛతి. 4

మనుజుడు కర్మలనాచరింపకపోవుటవలన నిష్క్రియుడగు ఆత్మస్వరూపస్థితిని పొందజాలడు. కర్మత్యాగమాత్రముచే మోక్షస్థితిని ఎవడును పొందనేరడు.

న హి కశ్చిత్క్షణమపి
జాతు తిష్ఠత్యకర్మకృత్,
కార్యతే హ్యవశః కర్మ
సర్వః ప్రకృతిజైర్గుణైః. 5

(ప్రపంచమున) ఎవడును ఒక్క క్షణకాల
మైనను కర్మము చేయక ఉండ నేరడు. ప్రకృతివలన
బుట్టిన గుణములచే ప్రతివాడును బలాత్కారముగ
కర్మములను చేయుచునే యున్నాడు.

కర్మేన్ద్రియాణి సంయమ్య
య ఆస్తే మనసా స్మరన్,
ఇన్ద్రియార్థాన్విమూఢాత్మా
మిథ్యాచార స్స ఉచ్యతే. 6

ఎవడు కర్మేంద్రియ జ్ఞానేంద్రియములను అణచి
పెట్టి మనస్సుచేత ఇంద్రియములయొక్క శబ్దాది
విషయములను చింతించుచుండునో, మూఢచిత్తుడగు
అట్టి మనుజుడు కపటమైన ఆచరణగలవాడని చెప్ప
బడుచున్నాడు.

యస్త్విన్ద్రియాణి మనసా
నియమ్యారభతేఽర్జున,



కర్మేన్ద్రియైః కర్మయోగ
మసక్త స్స విశిష్యతే. 7

ఓ అర్జునా! ఎవడు ఇంద్రియములన్నిటిని
మనస్సుచే నియమించి, వానిచే కర్మయోగమును
సంగములేనివాడై ఆచరించునో ఆతడుత్తముడు.

నియతం కురు కర్మ త్వం
కర్మజ్యాయో హ్యకర్మణః,
శరీరయాత్రాపి చ తే
న ప్రసిద్ధ్యేదకర్మణః. 8

(ఓ అర్జునా!) నీవు (శాస్త్రములచే) నియమిత
మైనకర్మను జేయుము. కర్మచేయకుండుటకంటె చేయు
టయే శ్రేష్ఠము. మరియు కర్మ చేయకపోవుటవలన
నీకు దేహయాత్రకూడా సిద్ధింప నేరదు.

యజ్ఞార్థాత్కర్మణోఽన్యత్ర
లోకోఽయం కర్మబన్ధనః,

తదర్థం కర్మ కౌన్తేయ
ముక్తసఙ్గ స్సమాచర. 9

ఓ అర్జునా! యజ్ఞముకొఱకైన (భగవత్ప్రీతికర మైన లేక లోకహితార్థమైన) కర్మము కంటె ఇతర మగు కర్మముచే జనులు బంధింపబడుదురు. కాబట్టి ఆ యజ్ఞముకొఱకైన కర్మమునే సంగరహితుడవై (ఫలాసక్తి లేక) యాచరింపుము.

సహ యజ్ఞాః ప్రజా స్సృష్ట్వా
పురోవాచ ప్రజాపతిః,
అనేన ప్రసవిష్యధ్వ
మేష వోఽస్త్విష్టకామధుక్. 10

పూర్వము బ్రహ్మదేవుడు యజ్ఞములతోఁగూడ ప్రజలను సృష్టించి 'ఈ యజ్ఞములచే మీరభివృద్ధిని బొందుడు. ఇవి మీ యభీష్టములను నెరవేర్చుగాక!' అని వారితో పలికెను.



దేవా న్భావయతానేన
తే దేవా భావయన్తు వః,
పరస్పరం భావయన్తః
శ్రేయః పర మవాప్స్యథ. 11

ఈ యజ్ఞములచే దేవతలను తృప్తిపఱచుడు. ఆ దేవతలున్ను మిమ్ములను (వర్షాదులచే) తృప్తినొందించుదురుగాక! ఈ ప్రకారముగ పరస్పరము తృప్తి నొందించుకొనుటవలన ఉత్తమ శ్రేయమును బొందగలరు.

ఇష్టాన్ భోగాన్ హి వో దేవా
దాస్యన్తే యజ్ఞభావితాః,
తైర్దత్తానప్రదాయైభ్యో
యో భుఙ్క్తే స్తేన ఏవ సః. 1

మనుజుడు చేయు యజ్ఞములచే సంతోషిం
దేవతలు వారికి ఇష్టములైన భోగముల నిత్తు
అట్లు వారిచే నీయబడిన యాభోగ్యవస్తువులను తి

వారికి సమర్పింపకయే ఎవ డనుభవించునో అతడు దొంగయే యగును.

యజ్ఞశిష్టాశిన స్సన్తో
ముచ్యన్తే సర్వకిల్బిషైః,
భుఞ్జతే తే త్వఘం పాపా
యే పచన్త్యాత్మకారణాత్. 13

యజ్ఞమునందు(భగవదర్పణముచేసి)మిగిలినపదార్థముఁ తిను సజ్జనులు సమస్త పాపములనుండియు విడువబడుచున్నారు. అట్లుకాక ఎవరు తమనిమిత్తమే భుజించుచున్నారో, అట్టివారు పాపమును తినువారే యగుదురు.

అన్నాద్భవన్తి భూతాని
పర్జన్యా దన్నసంభవః,
యజ్ఞాద్భవతి పర్జన్యో
యజ్ఞః కర్మసముద్భవః. 14



కర్మ బ్రహ్మోద్భవం విద్ధి
బ్రహ్మాక్షరసముద్భవమ్,
తస్మాత్సర్వగతం బ్రహ్మ
నిత్యం యజ్ఞే ప్రతిష్ఠితమ్. 15

ప్రాణులు అన్నమువలన కలుగుచున్నవి. అన్నము మేఘమువలన కలుగుచున్నది. మేఘము యజ్ఞమువలన కలుగుచున్నది. యజ్ఞము సత్కర్మ వలన కలుగుచున్నది. సత్కర్మ వేదమువలన కలుగుచున్నది. వేదము అక్షరపరబ్రహ్మమువలన కలుగుచున్నది. కాబట్టి సర్వవ్యాపకమగు బ్రహ్మము నిరంతరము యజ్ఞమునందు ప్రతిష్ఠింపబడినదానినిగ నెఱుఁగుము.

ఏవం ప్రవర్తితం చక్రం
నానువర్తయతీహ యః,
అఘాయు రిన్ద్రియారామో
మోఘం పార్థ స జీవతి. 16

ఓ అర్జునా! ఈ ప్రకారముగ ప్రవర్తింపజేయబడిన ధర్మచక్రమును ఈ ప్రపంచమున ఎవడనుసరించి వర్తింపడో, అతఁడు పాపజీవితమును గడఁపువాఁడును, ఇంద్రియలోలుఁడును అయి వ్యర్థముగ బ్రతుకుచున్నాఁడు.

యస్త్వాత్మరతిరేవ స్యా
దాత్మతృప్తశ్చమానవః,
ఆత్మన్యేవ చ సన్తుష్ట
స్తస్య కార్యం న విద్యతే. **17**

ఎవఁడు కేవలము ఆత్మయందే క్రీడించుచు ఆత్మయందే తృప్తిఁబొందుచు, ఆత్మయందే సంతోషపడుచుండునో, అట్టి ఆత్మజ్ఞానికిఁక చేయఁదగినపని (విధి) యేదియును లేదు.

నైవ తస్య కృతేనార్థో
నాకృతేనేహ కశ్చన,
న చాస్య సర్వభూతేషు
కశ్చిదర్థవ్యపాశ్రయః. **18**

అట్టి ఆత్మజ్ఞానికిఁ ప్రపంచమున కర్మచేయుటచే ప్రయోజనముగాని, చేయకుండుటచే దోషముగాని ఏదియును లేదు. మఱియు నాతనికి సమస్తభూతములయందును ఎట్టి ప్రయోజనము · కొఱకైనను ఆశ్రయింపదగినది యేమియును లేదు.

తస్మాదసక్తస్సతతం
కార్యం కర్మ సమాచర,
అసక్తోహ్యాచరన్ కర్మ
పరమాప్నోతి పూరుషః. **19**

కాబట్టి నీవు సంగము (ఫలాపేక్ష) లేనివాఁడవై, చేయఁదగిన కర్మను ఎల్లప్పుడును చక్కఁగ చేయుచుండుము. అసక్తుఁడై కర్మ నాచరించు మనుజుఁడు క్రమముగ, మోక్షము నొందుచున్నాఁడు.

కర్మణైవ హి సంసిద్ధి
మాస్థితా జనకాదయః,
లోకసంగ్రహ మేవాపి
సంపశ్యన్ కర్తు మర్హసి. **20**

జనకుడు మున్నగువారు నిష్కామకర్మముచేతనే మోక్షమును బొందిరి. జనులను సన్మార్గమున ప్రవర్తింపజేయు నుద్దేశ్యముచేనైనను నీవు కర్మలను చేయుటకే తగియున్నావు.

యద్యదాచరతి శ్రేష్ఠ
స్తత్త దేవేతరో జనః,
స యత్ప్రమాణం కురుతే
లోక స్తదనువర్తతే. **21**

గొప్పవాడేకర్మను చేయునో దానినే తక్కిన వారును చేయుదురు. అతడు దేనిని ప్రమాణముగ గైకొనునో, తక్కినవారును దానినే అనుసరింతురు.



న మే పార్థాస్తి కర్తవ్యం
త్రిషు లోకేషు కించన
నానవాప్త మవాప్తవ్యం
వర్త ఏవ చ కర్మణి. **22**

అర్జునా! నాకీ మూడులోకములందును చేయదగిన కార్యమేదియును లేదు. మఱియు పొందబడనిదియు, పొందదగినదియునగు వస్తువును ఏదియు లేదు. అయినను నేను కర్మమందు ప్రవర్తించుచునే యున్నాను.

యది హ్యహం న వర్తేయం
జాతు కర్మణ్యతన్ద్రితః,
మమ వర్త్మానువర్తన్తే
మనుష్యాః పార్థ సర్వశః. **23**

ఏలయనగా, అర్జునా! నేనెల్లప్పుడును జాగరూకుడనై కర్మమందు ప్రవర్తింపక పోయిన చో,

మనుష్యులు సర్వవిధముల నాయొక్క ఆ మార్గమునే అనుసరించి వర్తించుదురు.

ఉత్సీదేయు రిమే లోకా
న కుర్యాం కర్మ చేదహమ్,
సంకరస్య చ కర్తా స్యా
ముపహన్యామిమాః ప్రజాః. **24**

మరియు నేను కర్మను చేయకుందునేని ఈ ప్రజలు చెడిపోవుదురు. అత్తటి సంఘమునం దేర్పడు సంకరమునకు నేనే కర్తనగుదును. కావున జనులను నేను చెడగొట్టినవాడ నగుదును.

సక్తాః కర్మణ్యవిద్వాంసో
యథా కుర్వన్తి భారత!
కుర్యా ద్విద్వాం స్తథాఽసక్త
శ్చికీర్షుర్లోకసఙ్గ్రహమ్. **25**

ఓ అర్జునా! అజ్ఞానులు కర్మలందు తగుల్కొని ఫలాపేక్షతో నేప్రకారము చేయుచున్నారో,



ఆప్రకారమే జ్ఞానులు వానియందు తగుల్కొనక ఫలాసక్తిరహితులై లోకకల్యాణమునిమిత్తము కార్యముల నాచరించవలెను.

న బుద్ధిభేదం జనయే
దజ్ఞానాం కర్మసఙ్గినామ్,
జోషయేత్సర్వకర్మాణి
విద్వాన్యుక్తః సమాచరన్. **26**

జ్ఞానియగువాడు కర్మఫలాసక్తులగు అజ్ఞానుల యొక్క బుద్ధిని కదలించరాదు. తాను యోగయుక్తుడై నేర్పుతో సమస్త కర్మల నాచరించుచు, తన యాచరణనుజూచి వారును ఆ ప్రకార మనుష్ఠించునట్లు చేయవలెను.

ప్రకృతేః క్రియమాణాని
గుణైః కర్మాణి సర్వశః,
అహంకారవిమూఢాత్మా
కర్తాహ మితి మన్యతే. **27**

ప్రకృతివలన బుట్టిన సత్త్వరజస్తమోగుణముల చేతనే సమస్త కార్యములు జరుగుచుండగా, అహంకారముచే వివేకశూన్యమైన మనస్సుగలవాడు తానే చేయుచున్నానని తలంచుచున్నాడు.

తత్త్వవిత్తు మహాబాహో
గుణకర్మవిభాగయోః,
గుణా గుణేషు వర్తన్త
ఇతి మత్వా న సజ్జతే. **28**

గొప్ప బాహువులుగల ఓ అర్జునా! గుణముల యొక్కయు, కర్మలయొక్కయు విభజనను గూర్చిన యథార్థ మెఱింగిన జ్ఞాని గుణములు(ఇంద్రియాదులు) గుణములందు(శబ్దాదివిషయములందు) ప్రవర్తించుచున్నవని, (ఆత్మస్వరూపుడగు తనకు వాస్తవముగ వానితో ఏసంబంధమున్ను లేదని) తలంచి కర్మలందు సంగము (అభిమానము) లేకుండును.

ప్రకృతేర్గుణసమ్మూఢాః
సజ్జన్తే గుణకర్మసు



తానకృత్స్నవిదో మన్దా
న్కృత్స్నవిన్న విచాలయేత్. **29**

ప్రకృతియొక్క రాజసాది గుణములచే మోహపెట్టబడినవారై దేహేంద్రియాదులయొక్క క్రియలందు ఆసక్తులై వర్తించు కర్మసంగులగు అల్పజ్ఞులను, మందమతులను ఆత్మజ్ఞుడగు జ్ఞాని చలింపజేయగూడదు (కర్మలు మానునట్లు చేయరాదు).

మయి సర్వాణి కర్మాణి
సన్న్యస్యాధ్యాత్మచేతసా,
నిరాశీర్నిర్మమో భూత్వా
యుధ్యస్వ విగతజ్వరః. **30**

సమస్తకర్మములను నాయందు అధ్యాత్మచిత్తముతో సమర్పించి ఆశగాని, మమకారముగాని లేనివాడవై, నిశ్చింతగ యుద్ధమును జేయుము.

యే మే మత మిదం నిత్య
మనుతిష్ఠన్తి మానవాః,

శ్రద్ధావన్తోఽనసూయన్తో
ముచ్యన్తే తేఽపి కర్మభిః. **31**

ఏ మనుజులు శ్రద్ధావంతులై అసూయలేనివారై ఈ నా యభిప్రాయముల నెల్లపుడును ఆచరణయం దుంచుచున్నారో, వారున్ను కర్మబంధమునుండి విడివడుచున్నారు.

యే త్వేతదభ్యసూయన్తో
నానుతిష్ఠన్తి మే మతమ్,
సర్వజ్ఞానవిమూఢాంస్తాన్
విద్ధి నష్టా నచేతసః. **32**

ఎవరు నా యీఅభిప్రాయమును (అధ్యాత్మ మార్గమును, నిష్కామ కర్మయోగపద్ధతిని) ద్వేషించువారై యనుసరింపక యుందురో, అట్టివారిని బుద్ధిహీనులుగను, భ్రాన్తిగా జ్ఞానము లేనివారలుగను, చెడిపోయినవారలుగను యెఱుంగుము.



సదృశం చేష్టతే స్వస్యాః
ప్రకృతేర్జ్ఞానవానపి,
ప్రకృతిం యాన్తి భూతాని
నిగ్రహః కిం కరిష్యతి. **33**

జ్ఞానవంతుడైనను (శాస్త్ర పాండిత్యము లేక లౌకికజ్ఞానము కలవాడైనను) తన ప్రకృతికి (జన్మాంతర సంస్కారముచే కలిగిన స్వభావమునకు) అనుగుణముగనే ప్రవర్తించుచున్నాడు. ప్రాణులు తమ ప్రకృతి ననుసరించియే నడచుచున్నవి. కావున ఇక నిగ్రహమేమి చేయగలదు?

ఇన్ద్రియస్యేన్ద్రియస్యార్థే
రాగద్వేషౌ వ్యవస్థితౌ
తయోర్న వశ మాగచ్ఛే
త్తౌ హ్యస్య పరిపన్థినౌ. **34**

ప్రతి ఇంద్రియమునకును దాని దాని విషయమందు

(శబ్దాదులందు) రాగద్వేషములు (ఇష్టానిష్టములు) ఏర్పడియున్నవి. ఆరాగద్వేషములకువివరునులోబడకూడదు. అవి మనుజునకు ప్రబల శత్రువులుగదా!

శ్రేయాన్ స్వధర్మో విగుణః
పరధర్మాత్స్వనుష్ఠితాత్,
స్వధర్మే నిధనం శ్రేయః
పరధర్మో భయావహః. 35

చక్కగ నాచరింపబడిన ఇతరుల ధర్మముకంటె గుణములేనిదైనను తన ధర్మమే శ్రేష్ఠమైనది. తన ధర్మమందు మరణమైనను శ్రేయస్కరమేయగును. ఇతరుల ధర్మము భయదాయకమైనది.

అర్జున ఉవాచ :—

అథ కేన ప్రయుక్తోఽయం
పాపం చరతి పూరుషః,
అనిచ్ఛన్నపి వార్ష్ణేయ
బలాదివ నియోజితః. 36



అర్జునుడు పల్కెను—

ఓకృష్ణా ! అయితే మనుజుడు పాపముచేయవలెనని కోరనప్పటికిని, దేనిచే ప్రేరేపింపబడి బలాత్కారముగ పాపము చేయుచున్నాడు?

శ్రీ భగవానువాచ:—

కామ ఏష క్రోధ ఏష
రజోగుణ సముద్భవః,
మహాశనో మహాపాప్మా
విద్ధ్యేనమిహ వైరిణమ్. 37

శ్రీ భగవానుడు చెప్పెను:— ఓ అర్జునా! నీవడిగిన ఈ హేతువు రజోగుణమువలన పుట్టిన కామము. ఇదియే క్రోధముగ పరిణమించుచున్నది. ఈ కామము ఎంత అనుభవించినప్పటికినిత్రుప్తి నిపొందనిదియు, మహాపాపములకు కారణభూతమైనదియు అయియున్నది. కావున దీనిని ఈ మోక్షమార్గమున శత్రువుగా నెఱుఁగుము.

ధూమేనావ్రియతే వహ్ని
ర్యథాఽఽదర్శో మలేన చ
యథోల్బే నావృతో గర్భ
స్తథా తేనేద మావృతమ్. 38

పొగచేత అగ్నియు మురికిచేత అద్దమున్ను, మావిచేత గర్భమందలి శిశువున్ను కప్పబడియుండు లాగున ఆ కామము చేత ఈ ఆత్మజ్ఞానమున్ను కప్పబడియున్నది.

ఆవృతం జ్ఞానమేతేన
జ్ఞానినో నిత్యవైరిణా,
కామరూపేణ కౌన్తేయ
దుష్పూరేణానలేన చ. 39

ఓ అర్జునా! నిండింప శక్యముకానిదియును, అగ్నివలె తృప్తిజెందనిదియు, ఆశారూపమైనదియు, జ్ఞానికి నిరంతరశత్రువు నగు ఈ కామముచేత (ఆత్మ) జ్ఞానము కప్పబడియున్నది.



ఇన్ద్రియాణి మనోబుద్ధి
రస్యాధిష్ఠాన ముచ్యతే,
ఏతైర్విమోహయత్యేష
జ్ఞాన మావృత్య దేహినమ్. 40

ఈ కామమునకు ఇంద్రియములు, మనస్సు, బుద్ధి ఆశ్రయములని చెప్పబడుచున్నది. ఆ యింద్రియాదులచేత కామము ఆత్మజ్ఞానమును గప్పివైచి మనుజుని మిగుల మోహపెట్టుచున్నది.

తస్మాత్త్వమిన్ద్రియాణ్యాదౌ
నియమ్య భరతర్షభ,
పాప్మానం ప్రజహి హ్యేనం
జ్ఞానవిజ్ఞాననాశనమ్. 41

భరతవంశశ్రేష్ఠుడవగు ఓ అర్జునా! కాబట్టి నీవు మొట్టమొదట ఇంద్రియములను నిగ్రహించి జ్ఞానవిజ్ఞానములను (శాస్త్రజ్ఞాన అనుభవజ్ఞానము

లను) రెండింటిని నాశనముచేయునదియు, పాపస్వ రూపమైనదియునగు ఈ కామమును తప్పకుండ సంపూర్ణముగ విడిచివేయుము (నశింపజేయుము).

ఇన్ద్రియాణి పరాణ్యాహు
రిన్ద్రియేభ్యః పరం మనః,
మనసస్తు పరా బుద్ధి
ర్యో బుద్ధేః పరతస్తు సః. 42

(దేహాదులకంటె) ఇంద్రియములు గొప్పవి. ఇంద్రియములకంటె మనస్సు గొప్పది. మనస్సు కంటె బుద్ధి గొప్పది. బుద్ధికంటె గొప్పవాడెవడో అతడే ఆత్మ–అని యిట్లు పెద్దలు చెప్పుదురు.

ఏవం బుద్ధేః పరం బుద్ధ్వా
సంస్తభ్యాత్మాన మాత్మనా
జహి శత్రుం మహాబాహో
కామరూపం దురాసదమ్. 43



గొప్పబాహువులుకల ఓ అర్జునా! ఈప్రకారముగ బుద్ధికంటె అతీతమైనదానినిగా ఆత్మ నెఱిగి (వివేకముతోగూడిన) బుద్ధిచేత మనస్సును బాగుగ నరికట్టి, జయించుటకు కష్టసాధ్యమైనట్టి ఈ కామమను శత్రువును నశింపజేయుము.

ఇతి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు
బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే
శ్రీ కృ ష్ణా ర్జు న సం వా దే
క ర్మ యో గో నా మ
తృతీయోఽధ్యాయః.

---

ఓం

శ్రీకృష్ణపరబ్రహ్మణే నమః

# శ్రీ భగవద్గీత

## అథ చతుర్థోఽధ్యాయః

## జ్ఞానయోగః

శ్రీ భగవానువాచ :—

ఇమం వివస్వతే యోగం
ప్రోక్తవా నహ మవ్యయమ్,
వివస్వాన్ మనవే ప్రాహ
మను రిక్ష్వాకవేఽబ్రవీత్. **1**

భగవంతుడగు శ్రీకృష్ణపరమాత్మ యిట్లు పలికెను – ఓ అర్జునా! నాశరహితమగు ఈ నిష్కామ కర్మ యోగమును(తద్ద్వారా పొందబడు జ్ఞాననిష్ఠను) పూర్వము నేను సూర్యునకు జెప్పితిని. సూర్యుడు



వైవస్వతమనువున కుపదేశించెను. మనువు ఇక్ష్వాకువునకు బోధించెను.

ఏవం పరమ్పరాప్రాప్త
మిమం రాజర్షయో విదుః,
స కాలేనేహ మహతా
యోగో నష్టః పరన్తప. **2**

ఓ అర్జునా! ఈ ప్రకారముగ పరంపరగా వచ్చిన ఈ నిష్కామ కర్మయోగమును రాజర్షులు తెలిసికొనిరి. చాలకాలము గడచినందున ఆ యోగ మిపుడీ లోకమున అదృశ్యమైనది. (ప్రచారములో లేకున్నది.)

స ఏవాయం మయా తేఽద్య
యోగః ప్రోక్తః పురాతనః,
భక్తోఽసి మే సఖాచేతి
రహస్యం హ్యేత దుత్తమమ్. **3**

నీవు నాభక్తుడుగను, మిత్రుడుగను నున్నావు.

కావున ఆ పురాతనమైన నిష్కామకర్మయోగమునే యిపుడు తిరిగి నీకు జెప్పితిని. అది మిగుల శ్రేష్ఠమైనదనియు రహస్యమైనదనియు నెఱుఁగుము.

**అర్జున ఉవాచ :—**

అపరం భవతో జన్మ
పరం జన్మ వివస్వతః,
కథ మేత ద్విజానీయాం
త్వమాదౌ ప్రోక్తవానితి. 4

అర్జునుడు చెప్పెను—

ఓ కృష్ణా! నీ జన్మము ఇటీవలిది. సూర్యుని జన్మము బహు పురాతనమైనది. అట్టిచో నీవు సూర్యున కుపదేశించితివను విషయమును నేనెట్లు గ్రహించగలను ?

**శ్రీ భగవానువాచ:—**

బహూని మే వ్యతీతాని
జన్మాని తవ చార్జున,



తా న్యహం వేద సర్వాణి
న త్వం వేత్థ పరన్తప. 5

శ్రీ భగవానుడిట్లు పలికెను—

శత్రువులను తపింపజేయు ఓ అర్జునా! నీకును, నాకును ఇంతవఱకనేక జన్మలు గడచినవి. వాని నన్నిటిని నే నెఱుఁగుదును. నీ వెఱుఁగవు.

అజోఽపి సన్నవ్యయాత్మా
భూతానా మీశ్వరోఽపి సన్,
ప్రకృతిం స్వామధిష్ఠాయ
సంభవామ్యాత్మమాయయా. 6

నేను పుట్టుకలేనివాడను, నాశరహితస్వరూపముకలవాడను. సమస్తప్రాణులకు ఈశ్వరుడను అయియున్నప్పటికిని స్వకీయమగు ప్రకృతిని వశపఱచుకొని నామాయాశక్తిచేత పుట్టుచున్నాను. (అవతరించుచున్నాను).

యదా యదా హి ధర్మస్య
గ్లానిర్భవతి భారత,

అభ్యుత్థాన మధర్మస్య
తదాత్మానం సృజామ్యహమ్. 7

ఓ అర్జునా! ఎప్పుడెప్పుడు ధర్మము క్షీణించి అధర్మము వృద్ధియగుచుండునో అప్పుడప్పుడు నన్ను నేనేసృష్టించుకొనుచుందును (అవతరించుచుందును.)

పరిత్రాణాయ సాధూనాం
వినాశాయ చ దుష్కృతామ్,
ధర్మసంస్థాపనార్థాయ
సంభవామి యుగే యుగే. 8

సాధుసజ్జనుల సంరక్షించుటకొఱకును, దుర్మార్గులను వినాశ మొనర్చుటకొఱకును, ధర్మము నలెస్సగ స్థాపించుటకొఱకును నేను ప్రతియుగమునందును అవతరించుచుందును.

జన్మ కర్మ చ మే దివ్య
మేవం యో వేత్తి తత్త్వతః,



త్యక్త్వా దేహం పునర్జన్మ
నైతి మామేతి సోఽర్జున. 9

అర్జునా! ఎవడీ ప్రకారముగ నాయొక్క దివ్యమైన జన్మమును, కర్మమునుగూర్చి యథార్థముగ తెలిసికొనుచున్నాడో, అట్టివాడు మరణానంతరము మఱల జన్మమునొందక నన్నే పొందుచున్నాడు. (మోక్షమును బడయుచున్నాడు.)

వీతరాగభయక్రోధా
మన్మయా మా ముపాశ్రితాః,
బహవో జ్ఞానతపసా
పూతా మద్భావమాగతాః. 10

అనురాగము, భయము, క్రోధము విడిచినవారును, నాయందే లగ్నమైన చిత్తముకలవారును, నన్నే ఆశ్రయించినవారునగు అనేకులు ఇట్టి జ్ఞానతపస్సుచే పవిత్రులై నాస్వరూపమును (మోక్షమును) బొందియుండిరి.

యే యథా మాం ప్రపద్యన్తే
తాం స్తథైవ భజామ్యహమ్,
మమ వర్త్మానువర్తన్తే
మనుష్యాః పార్థ సర్వశః. **11**

ఓ, అర్జునా! ఎవరే ప్రకారముగ నన్ను సేవింతురో వారి నా ప్రకారముగనే నేననుగ్రహింతును. మనుజులు సర్వవిధముల నా మార్గమునే అనుసరించుచున్నారు.

కాఙ్క్షన్తః కర్మణాం సిద్ధిం
యజన్త ఇహ దేవతాః,
క్షిప్రం హి మానుషే లోకే
సిద్ధిర్భవతి కర్మజా. **12**

కర్మలయొక్క ఫలప్రాప్తిని అపేక్షించు మానవు లీ ప్రపంచమున దేవతల నారాధించుచున్నారు. ఏలయనగా కర్మఫలసిద్ధి ఈ మనుష్యలోకమున శీఘ్రముగ కలుగుచున్నది.



చాతుర్వర్ణ్యం మయా సృష్టం
గుణకర్మ విభాగశః,
తస్య కర్తారమపి మాం
విద్ధ్యకర్తార మవ్యయమ్. **13**

బ్రాహ్మణ క్షత్రియాదులను నాల్గువర్ణములు సత్త్వాదిగుణములయొక్కయు, ఆగుణములచే చేయబడు కర్మలయొక్కయు, విభాగమునను సరించి నాచే సృజింపబడినవి వానికి నేనుకర్తనైనప్పటికిని (ప్రకృతికి అతీతుడనగుటచే) వాస్తవముగ నన్ను అకర్తగను, నాశరహితునిగను (నిర్వికారునిగను) ఎరుంగుము.

న మాం కర్మాణి లిమ్పన్తి
న మే కర్మఫలే స్పృహా,
ఇతి మాం యోఽభిజానాతి
కర్మభిర్న స బధ్యతే. **14**

నన్ను కర్మలంటవు. నాకు కర్మఫలమునందపేక్షయు లేదు. ఈ ప్రకారముగ నన్నుగూర్చి యెవడు తెలిసికొనునో ఆతడు కర్మములచే బంధింపబడడు.

ఏవం జ్ఞాత్వా కృతం కర్మ
పూర్వైరపి ముముక్షుభిః,
కురు కర్మైవ తస్మాత్త్వం
పూర్వైః పూర్వతరం కృతమ్. **15**

(తాను వాస్తవముగ కర్తకాదు. తనకు కర్మఫలమునందపేక్ష యుండరాదు—అని) ఈ ప్రకారముగ (భగవంతునియొక్క కర్మాచరణముద్వారా) తెలిసికొని పూర్వ మెందఱో ముముక్షువులు నిష్కామముగ కర్మల నాచరించియుండిరి. కావున (ఓ అర్జునా!) నీవున్ను పూర్వులచే చేయఁబడిన అట్టి పురాతనమైన నిష్కామ కర్మమునే చేయుము.

కిం కర్మ కిమకర్మేతి
కవయోఽప్యత్ర మోహితాః,
తత్తే కర్మ ప్రవక్ష్యామి
యజ్జ్ఞాత్వా మోక్ష్యసేఽశుభాత్.



కర్మ యెట్టిది ? అకర్మ యెట్టిది ? అను ఈవిషయమును పండితులు కూడ సరిగా తెలుసుకొనజాలకున్నారు. దేని నెఱింగినచో నీవు సంసారబంధమునుండి విముక్తుఁడవు కాగలవో అట్టి కర్మరహస్యమును నీకిపుడు తెలుపుచున్నాను.

కర్మణో హ్యపి బోద్ధవ్యం
బోద్ధవ్యం చ వికర్మణః,
అకర్మణశ్చ బోద్ధవ్యం
గహనా కర్మణో గతిః. **17**

శాస్త్రములచే విధింపబడిన కర్మములయొక్కయు, నిషేధింపబడిన వికర్మలయొక్కయు, ఏమియు చేయక యూరకుండుటయను అకర్మమునయొక్కయు స్వరూపమును బాగుగ తెలిసికొనవలసియున్నది. ఏలయనగా కర్మముయొక్క వాస్తవతత్త్వము చాలా లోతైనది. (ఎఱుఁగుట మిగుల కష్టతరము)

కర్మణ్యకర్మ యః పశ్యే
దకర్మణి చ కర్మ యః,

స బుద్ధిమాన్ మనుష్యేషు
స యుక్తః కృత్స్నకర్మకృత్. 18

ఎవడు కర్మమునందు అకర్మమును, అకర్మమునందు కర్మమును జూచునో, అతడు మనుజులలో వివేకవంతుడును, యోగయుక్తుడును, సకలకర్మల నాచరించినవాడును నగుచున్నాడు.

యస్య సర్వే సమారమ్భాః
కామసంకల్పవర్జితాః,
జ్ఞానాగ్నిదగ్ధకర్మాణం
తమాహుః పణ్డితం బుధాః. 19

ఎవనియొక్క సమస్తకర్మలు కోరిక, సంకల్పము అనునవి లేకయుండునో, జ్ఞానమను అగ్నిచేత దహింపబడిన కర్మలుగల అట్టివానిని పండితుడని విజ్ఞులు పేర్కొందురు.

త్యక్త్వా కర్మఫలాసంగం
నిత్యతృప్తో నిరాశ్రయః,



కర్మణ్యభి ప్రవృత్తోఽపి
నైవ కించిత్కరోతి సః. 20

ఎవడు కర్మఫలమునందాసక్తిని విడనాడి నిరంతరము సంతృప్తిగలవాడై దేనిని ఆశ్రయించక యుండునో, అట్టివాడు కర్మములందు ప్రవర్తించినను ఒకింతైనను చేయనివాడే యగును

నిరాశీర్యతచిత్తాత్మా
త్యక్తసర్వపరిగ్రహః,
శారీరం కేవలం కర్మ
కుర్వన్నాప్నోతి కిల్బిషమ్. 21

ఆశలేనివాడును, ఇంద్రియమనంబులను నిగ్రహించినవాడును, ఏ వస్తువును పరిగ్రహింపనివాడునగు మనుజుడు శరీరమాత్రముచేత (దేహధారణాది) కర్మమును చేసినను పాపము నొందడు.

యదృచ్ఛాలాభ సన్తుష్టో
ద్వన్ద్వాతీతో విమత్సరః.

సమః సిద్ధావసిద్ధౌ చ
కృత్వాపి న నిబధ్యతే. **22**

అప్రయత్నముగ లభించినదానితో సంతుష్టిని బొందువాడును, సుఖదుఃఖాది ద్వంద్వములను దాటినవాడును, మాత్సర్యము లేనివాడును, ఫలముయొక్క ప్రాప్తాప్రాప్తములందు సమబుద్ధిగలవాడు (లేక కార్యము సిద్ధించినను సిద్ధింపకున్నను సమభావముతో నుండువాడు) నగు మనుజుడు కర్మము చేసినను బంధింపబడడు.

గతసఙ్గస్య ముక్తస్య
జ్ఞానావస్థితచేతసః,
యజ్ఞాయాచరతః కర్మ
సమగ్రం ప్రవిలీయతే. **23**

దేనియందును సంగము (ఆసక్తి) లేనివాడును, (రాగద్వేష కామక్రోధాదిరూప సంసారబంధముల నుండి) విముక్తుడును, ఆత్మజ్ఞానమందే మనస్సు నిలుకడకలవాడును, భగవత్ప్రీత్యర్థము (లేక పరప్రాణి



హితార్థము, లేక, ధర్మమునిమిత్తము) కర్మము నాచరించువాడునగు మనుజునియొక్క కర్మయావత్తు విలీనమై పోవుచున్నది. జన్మబంధాదులను గలిగింపక నశించుచున్నది.

బ్రహ్మార్పణం బ్రహ్మహవి
ర్బ్రహ్మాగ్నౌ బ్రహ్మణా హుతమ్,
బ్రహ్మైవ తేన గన్తవ్యం
బ్రహ్మకర్మ సమాధినా. **24**

యజ్ఞమునందలి హోమసాధనములు, హోమద్రవ్యములు, హోమాగ్ని, హోమము చేయువాడు హోమము చేయబడినది – అన్నియును బ్రహ్మస్వరూపములే యనెడి ఏకాగ్రభావముతో ఆ యజ్ఞాది కర్మలను జేయు మనుజుడు బ్రహ్మమునే పొందగలడు.

దైవ మేవాపరే యజ్ఞం
యోగినః పర్యుపాసతే,

బ్రహ్మాగ్నావపరే యజ్ఞం
యజ్ఞేనైవోపజుహ్వతి. **25**

కొందఱు యోగులు దేవతారాధనరూపమైన యజ్ఞమునే అనుష్ఠించుచున్నారు. మఱికొందఱు జీవబ్రహ్మైక్యభావనచే జీవుని పరబ్రహ్మమను అగ్నియందు హోమము చేయుచున్నారు. (ఆహుతి నొనర్చుచున్నారు.)

శ్రోత్రాదీనీన్ద్రియాణ్యన్యే
సంయమాగ్నిషు జుహ్వతి,
శబ్దాదీన్విషయానన్య
ఇన్ద్రియాగ్నిషు జుహ్వతి. **26**

కొందఱు చెవి మొదలగు ఇంద్రియములను నిగ్రహమనెడి అగ్నులందును, మఱికొందఱు శబ్దాది విషయములను ఇంద్రియములనెడి అగ్నులందును హోమము చేయుచున్నారు.



సర్వాణీన్ద్రియకర్మాణి
ప్రాణకర్మాణి చాపరే,
ఆత్మసంయమయోగాగ్నౌ
జుహ్వతి జ్ఞానదీపితే. **27**

మఱికొందఱు ఇంద్రియముల యొక్క వ్యాపారములన్నిటిని ప్రాణముల యొక్క వ్యాపారములన్నిటిని జ్ఞానముచే ప్రకాశింపజేయబడిన 'మనోనిగ్రహ' యోగమను (సమాధియోగమను) అగ్నియందు హోమము చేయుచున్నారు.

ద్రవ్యయజ్ఞాస్తపోయజ్ఞా
యోగయజ్ఞాస్తథాऽపరే,
స్వాధ్యాయజ్ఞానయజ్ఞాశ్చ
యతయః సంశితవ్రతాః. **28**

కొందఱు ద్రవ్యమును దానధర్మాది సద్విషయములందు వినియోగించుటయే యజ్ఞముగ గలవారును, కొందఱు తపస్సే యజ్ఞముగ గలవారును, కొందఱు

(ప్రాణాయామాద్యష్టాంగ) యోగమే యజ్ఞముగ గలవారు నయియున్నారు వారందఱున్న ప్రయత్న శీలురును దృఢవ్రతములు కలవారునయి యొప్పు చున్నారు.

అపానే జుహ్వతి ప్రాణం
ప్రాణేఽపానం తథాఽపరే,
ప్రాణాపానగతీ రుద్ధ్వా
ప్రాణాయామపరాయణాః. 29

ప్రాణాయామతత్పరులగు కొందఱు ప్రాణాపానములయొక్క గతులను (మార్గములను) నిరోధించి అపానవాయువునందు ప్రాణవాయువును, ప్రాణవాయువునందు అపానవాయువును హోమము చేయుచున్నారు. (పూరక, కుంభక, రేచకముల నొనర్చుచున్నారని భావము.)

అపరే నియతాహారాః
ప్రాణాన్ ప్రాణేషు జుహ్వతి,



సర్వేఽప్యేతే యజ్ఞవిదో
యజ్ఞక్షపితకల్మషాః. 30

మఱికొందరు ఆహారవిషయమున కట్టుబాటుగలవారై ప్రాణాది వాయువులను ప్రాణాదివాయువులందే హోమముచేయుచున్నారు. (లేక, ఇంద్రియ వ్యాపారములను వశీకృతేంద్రియములందు వ్రేల్చుచున్నారు.) వీరందఱున్ను యజ్ఞము నెఱిగినవారును యజ్ఞముచే పాపము నశించినవారును అయియున్నారు.

యజ్ఞశిష్టామృతభుజో
యాన్తి బ్రహ్మ సనాతనమ్,
నాయం లోకోఽస్త్యయజ్ఞస్య
కుతోఽన్యః కురుసత్తమ. 31

కురువంశశ్రేష్ఠుడవగు ఓ అర్జునా! (పైన దెల్పిన) యజ్ఞము లాచరింపగా శేషించిన అమృతరూపమైన అన్నమును భుజించువారు శాశ్వత పరబ్రహ్మమును పొందుదురు. అట్టి యజ్ఞ మొకదానినైనను చేయని

వానికి ఇహలోక సుఖము లేదు. అట్టిచో నిక పర లోక సుఖమెక్కడిది?

ఏవం బహువిధా యజ్ఞా
వితతా బ్రహ్మణో ముఖే,
కర్మజాన్ విద్ధి తాన్ సర్వా
నేవం జ్ఞాత్వా విమోక్ష్యసే. 32

ఈ ప్రకారముగ అనేకవిధములైన యజ్ఞములు వేదమునందు సవిస్తరముగ తెలుపబడియున్నవి. అవి యన్నియు కర్మమువలన పుట్టినవానినిగ (కర్మమునకు సంబంధించినవానిని) నీ వెఱుఁగుము. ఇట్లెఱిఁగిన నీవు విముక్తుడవు కాగలవు.

శ్రేయాన్ ద్రవ్యమయాద్యజ్ఞా
జ్ఞానయజ్ఞః పరన్తప,
సర్వం కర్మాఖిలం పార్థ
జ్ఞానే పరిసమాప్యతే. 33



ఓ అర్జునా! ద్రవ్యమువలన సాధింపబడు యజ్ఞముకంటె జ్ఞానయజ్ఞము శ్రేష్ఠమైనది. ఏలయనిన సమస్త కర్మమున్ను నాశము కానిదగుచు (ఫల సహితముగ) జ్ఞానమునందే పర్యవసించుచున్నది (అంతర్భూత మగుచున్నది.)

తద్విద్ధి ప్రణిపాతేన
పరిప్రశ్నేన సేవయా
ఉపదేక్ష్యన్తి తే జ్ఞానం
జ్ఞానిన స్తత్త్వదర్శినః. 34

ఓ అర్జునా! అట్టి జ్ఞానమును నీవు తత్త్వవేత్తలగు జ్ఞానులకు సాష్టాంగనమస్కారము చేసియు, సమయముచూచి వినయముగ ప్రశ్నించియు, సేవ చేసియు, వారివలన నెఱుఁగుము. వారు తప్పక నీకుపదేశింపగలరు.

యజ్జ్ఞాత్వా న పునర్మోహ
మేవం యాస్యసి పాణ్డవ,

యేన భూతాన్యశేషేణ
ద్రక్ష్యస్యాత్మన్యథో మయి. 35

ఓ అర్జునా! దేనిని తెలిసికొనినచో మరలనిట్టి మోహమును నీవు పొందకుందువో మఱియు దేనిచే సమస్తప్రాణులను నీయందును, నాయందునుగూడ చూడగలవో అట్టి జ్ఞానమును తత్త్వవేత్తలవలన తెలిసికొనుము.

అపి చేదసి పాపేభ్యః
సర్వేభ్యః పాపకృత్తమః
సర్వం జ్ఞానప్లవేనైవ
వృజినం సంతరిష్యసి. 36

ఒక వేళ పాపాత్ములందఱికంటెను నీవు మిగుల పాపము చేసినవాడవైతివేని ఆ సమస్తపాపసముద్రమును జ్ఞానమను తెప్పచేతనే లెస్సగ దాటివేయగలవు.

యథైధాంసి సమిద్ధోఽగ్ని
ర్భస్మసాత్కురుతేఽర్జున,



జ్ఞానాగ్నిస్సర్వకర్మాణి
భస్మసాత్కురుతే తథా. 37

అర్జునా! బాగుగ ప్రజ్వలింపజేయబడిన అగ్ని కట్టెలనే ప్రకారము బూడిదగా జేయునో ఆప్రకారమే జ్ఞానమను అగ్ని సమస్తకర్మములను భస్మమొనర్చి వైచుచున్నది.

న హి జ్ఞానేన సదృశం
పవిత్రమిహ విద్యతే,
తత్స్వయం యోగసంసిద్ధః
కాలేనాత్మని విన్దతి. 38

ఈ ప్రపంచమున జ్ఞానముతో సమానముగ పవిత్రమైనది ఏదియును లేదు. అట్టి జ్ఞానమును (కర్మ) యోగస్థితిని బొందినవాడు కాలక్రమమున తనయందే స్వయముగ పొందుచున్నాడు.

శ్రద్ధావాన్ లభతే జ్ఞానం
తత్పరః సంయతేన్ద్రియః,

జ్ఞానం లబ్ధ్వా పరాం శాన్తి
మచిరేణాధిగచ్ఛతి. **39**

(గురు, శాస్త్ర వాక్యములందు) శ్రద్ధగలవాడును, (ఆధ్యాత్మిక సాధనలందు) తదేకనిష్ఠతో గూడినవాడును, ఇంద్రియములను లెస్సగ జయించినవాడు నగు మనుజుడు జ్ఞానమును పొందుచున్నాడు. అట్లు జ్ఞానమును బొందినవాడై యతడు పరమశాంతిని శీఘ్రముగ బడయుగల్గుచున్నాడు.

అజ్ఞశ్చాశ్రద్దధానశ్చ
సంశయాత్మా వినశ్యతి,
నాయం లోకోఽస్తి న పరో
న సుఖం సంశయాత్మనః. **40**

జ్ఞానము లేనివాడు, శ్రద్ధారహితుడు, సంశయచిత్తుడు వినాశమునే పొందును. సంశయచిత్తునకు ఇహలోకముగాని, పరలోకముగాని, సౌఖ్యముగాని లేవు.



యోగసన్న్యస్త కర్మాణం
జ్ఞాన సంఛిన్న సంశయమ్,
ఆత్మవన్తం న కర్మాణి
నిబధ్నన్తి ధనంజయ. **41**

ఓ అర్జునా! నిష్కామకర్మయోగముచే కర్మఫలములను త్యజించినవాడును, (లేక ఈశ్వరార్పణ మొనర్చినవాడును), జ్ఞానముచే సంశయములు నివర్తించినవాడునగు ఆత్మనిష్ఠుని (బ్రహ్మజ్ఞానిని) కర్మములు బంధింపనేరవు.

తస్మాదజ్ఞాన సమ్భూతం
హృత్స్థం జ్ఞానాసినాత్మనః,
ఛిత్త్వైనం సంశయం యోగ
మాతిష్ఠోత్తిష్ఠ భారత. **42**

ఓ అర్జునా! కాబట్టి నీయొక్క హృదయమున నున్నదియు, అజ్ఞానమువలన బుట్టినదియునగు ఈ సంశయమును జ్ఞానమను ఖడ్గముచే ఛేదించివైచి నిష్కామకర్మయోగము నాచరింపుము. లెమ్ము.

ఇతి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు
బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే
శ్రీకృష్ణార్జునసంవాదే
జ్ఞానయోగో నామ
చతుర్థోఽధ్యాయః.

---

ఓం

శ్రీకృష్ణపరబ్రహ్మణే నమః

# శ్రీ భగవద్గీత

## అథ పఞ్చమోఽధ్యాయః
## కర్మసన్న్యాసయోగః

**అర్జున ఉవాచ :—**

సన్న్యాసం కర్మణాం కృష్ణ
పునర్యోగం చ శంససి,
యచ్ఛ్రేయ ఏతయోరేకం
తన్మే బ్రూహి సునిశ్చితమ్. 1

ర్జునుడు చెప్పెను—

ఓ కృష్ణమూర్తీ! నీవొకప్పుడు కర్మలయొక్క గమును (కర్మత్యాగపూర్వకమగు జ్ఞానమును) తియొకప్పుడు కర్మయోగమును ప్రశంసించు

చున్నావు. కావున ఈ రెండిటిలో నేది శ్రేష్ఠమైనదో బాగుగనిశ్చయించి ఆ ఒక్కదానిని నాకు జెప్పుము.

శ్రీ భగవానువాచ :—

సన్న్యాసః కర్మయోగశ్చ
నిశ్శ్రేయసకరావుభౌ,
తయోస్తు కర్మసన్న్యాసా
త్కర్మయోగో విశిష్యతే. 2

శ్రీ భగవానుడు పలికెను—

కర్మత్యాగము (కర్మత్యాగపూర్వకమగు జ్ఞానయోగము), కర్మయోగము అను రెండును మోక్షమును గలుగజేయును. అయితే ఆ రెండిటిలోను (ప్రారంభమున) కర్మత్యాగముకంటె కర్మయోగమే శ్రేష్ఠమైనది.

జ్ఞేయస్స నిత్యసన్న్యాసీ
యో న ద్వేష్టి న కాఙ్క్షతి,



నిర్ద్వన్ద్వో హి మహాబాహో
సుఖం బన్ధాత్ప్రముచ్యతే. 3

గొప్పబాహువులుకల ఓ అర్జునా! ఎవడు (ఏ కర్మయోగి) దేనినిగూడ ద్వేషింపడో, దేనినిగూడ కోరడో అట్టివాడు ఎల్లప్పుడును సన్న్యాసి(త్యాగి) యే యని తెలియదగినది. ఏలయనగా (రాగద్వేషాది) ద్వంద్వములు లేనివాడు సులభముగ సంసారబంధమునుండి విముక్తుడు కాగలడు.

సాంఖ్యయోగౌ పృథగ్బాలాః
ప్రవదన్తి న పణ్డితాః,
ఏకమప్యాస్థితః సమ్య
గుభయోర్విన్దతే ఫలమ్. 4

(కర్మసన్న్యాసపూర్వకమగు) జ్ఞానయోగము, కర్మయోగము వేఱు వేఱని (వేఱు వేఱు ఫలములు కలవని) అవివేకులు పలుకుదురే కాని వివేకవంతులు కాదు. ఆ రెండిటిలో ఏ ఒక్కదానినైనను బాగుగ

అనుష్ఠించినచో రెండిటియొక్క ఫలమును (మోక్షమును) మనుజుడు పొందుచున్నాడు.

యత్సాంఖ్యైః ప్రాప్యతే స్థానం
తద్యోగైరపి గమ్యతే,
ఏకం సాంఖ్యం చ యోగం చ
యః పశ్యతి స పశ్యతి. 5

జ్ఞానయోగులచే ఏస్థానము (మోక్షము) పొందబడుచున్నదో, అది కర్మయోగులచేతను పొందబడుచున్నది. జ్ఞానయోగమును, కర్మయోగమును ఒక్కటిగ (ఒకేఫలముగలుగజేయునదిగ) చూచువాడే నిజముగచూచువాడగును (తెలిసినవాడగును)

సన్న్యాసస్తు మహాబాహో
దుఃఖమాప్తుమయోగతః,
యోగయుక్తో మునిర్బ్రహ్మ
న చిరేణాధిగచ్ఛతి. 6



గొప్ప బాహువులుగల ఓ అర్జునా! (కర్మసన్న్యాసరూపమగు) జ్ఞానయోగమైతే కర్మయోగము లేకుండ పొందుటకు కష్టతరమైనది. కర్మయోగముతో గూడిన (దైవ) మననశీలుడు శీఘ్రముగ (లక్ష్యమగు) బ్రహ్మమును బొందుచున్నాడు.

యోగయుక్తో విశుద్ధాత్మా
విజితాత్మా జితేన్ద్రియః,
సర్వభూతాత్మభూతాత్మా
కుర్వన్నపి న లిప్యతే. 7

(నిష్కామ) కర్మయోగమునాచరించువాడును, పరిశుద్ధమైన హృదయము గలవాడును, లెస్సగ జయింపబడిన మనస్సుగలవాడును, ఇంద్రియములను జయించినవాడును, సమస్త ప్రాణులయందుండు ఆత్మయు తనఆత్మయు నొకటేయని తెలిసికొనినవాడు నగు మనుజుడు కర్మలను జేసినను వానిచే నంటబడడు.

నైవ కించిత్కరోమీతి
యుక్తో మన్యేత తత్త్వవిత్,

పశ్యన్ శృణ్వన్ స్పృశన్ జిఘ్ర
న్నశ్నన్ గచ్ఛన్ స్వపన్ శ్వసన్.
ప్రలపన్ విసృజన్ గృహ్ణ
న్నున్మిషన్నిమిషన్నపి
ఇన్ద్రియాణీన్ద్రియార్థేషు
వర్తన్త ఇతి ధారయన్. 9

పరమార్థతత్త్వము నెఱింగిన యోగయుక్తుడు (ఆత్మయందు నెలకొనిన చిత్తముగలవాడు) చూచుచున్నను, వినుచున్నను, తాకుచున్నను, వాసన చూచుచున్నను, తినుచున్నను, నడచుచున్నను, నిదురించుచున్నను, ఊపిరివిడుచుచున్నను, మాట్లాడుచున్నను, విడుచుచున్నను, గ్రహించుచున్నను, కండ్లను తెఱచుచున్నను, మూయుచున్నను ఇంద్రియములు (వానివాని) విషయములందు ప్రవర్తించుచున్నవని నిశ్చయించినవాడై 'నేనొకింతైనను ఏమియు చేయుటలేదు' అనియే తలంచును. (ఆయా కార్యములందు కర్తృత్వబుద్ధి లేకుండును.)



బ్రహ్మణ్యాధాయ కర్మాణి
సఙ్గం త్యక్త్వా కరోతి యః,
లిప్యతే న స పాపేన
పద్మపత్ర మివామ్భసా. 10

ఎవడు తాను చేయు కర్మములను పరమాత్మ కర్పించి సంగమును (ఆసక్తిని) విడచి చేయుచున్నాడో అట్టివాడు తామరాకు నీటిచే అంటబడనట్లు పాపముచే నంటబడకుండును.

కాయేన మనసా బుద్ధ్యా
కేవలై రిన్ద్రియైరపి,
యోగినః కర్మ కుర్వన్తి
సఙ్గం త్యక్త్వాఽఽత్మశుద్ధయే. 11

(నిష్కామకర్మ) యోగులు చిత్తశుద్ధికొఱకై ఫలాసక్తిని విడిచి శరీరముచేతను, మనస్సుచేతను, బుద్ధిచేతను, అభిమానము లేని వట్టి ఇంద్రియములచేతను, కర్మలను జేయుచున్నారు.

యుక్తః కర్మఫలం త్యక్త్వా
శాన్తిమాప్నోతి నైష్ఠికీమ్,
అయుక్తః కామకారేణ
ఫలే సక్తో నిబధ్యతే. **12**

యోగయుక్తుడు (నిష్కామకర్మయోగి) కర్మల యొక్క ఫలమును విడిచిపెట్టి (చిత్తశుద్ధివలన) ఆత్మనిష్ఠాసంబంధమైన శాశ్వతమగు శాంతిని బొందుచున్నాడు. యోగయుక్తుడుకానివాడు(ఫలాపేక్షతో కర్మలను జేయువాడు) ఆశచే ప్రేరితుడై కర్మఫలమందాసక్తి గల్గి బద్ధుడగుచున్నాడు.

సర్వకర్మాణి మనసా
సన్న్యస్యాస్తే సుఖం వశీ,
నవద్వారే పురే దేహీ
నైవ కుర్వన్న కారయన్. **13**

ఇంద్రియనిగ్రహముగల దేహధారి మనస్సుచే సమస్తకర్మములను (కర్మఫలములను) పరిత్యజించి



ఏమియుచేయనివాడై, చేయింపనివాడై, తొమ్మిది ద్వారములుగల పట్టణమగు శరీరమందు హాయిగా ఉండుచున్నాడు,

న కర్తృత్వం న కర్మాణి
లోకస్య సృజతి ప్రభుః,
న కర్మఫలసంయోగం
స్వభావస్తు ప్రవర్తతే. **14**

భగవంతుడు (ఆత్మ) జీవులకు కర్తృత్వమును గాని, కర్మములనుగాని, కర్మఫలములతోటి సంబంధముగాని కలుగజేయడు. మఱేమనిన, ప్రకృతియే (ప్రకృతిసంబంధమువలన గలిగిన జన్మాంతరసంస్కారమే)ఆయా కర్తృత్వాదులను గలుగజేయుచున్నది.

నాదత్తే కస్యచిత్పాపం
న చైవ సుకృతం విభుః,
అజ్ఞానేనావృతం జ్ఞానం
తేన ముహ్యన్తి జన్తవః. **15**

పరమాత్మ యెవని యొక్కయు పాపమునుగాని, పుణ్యమునుగాని స్వీకరింపడు. అజ్ఞానముచేత జ్ఞానము కప్పబడియున్నది. అందుచేత జీవులు భ్రమనొందుచున్నారు.

జ్ఞానేన తు తదజ్ఞానం
యేషాం నాశితమాత్మనః,
తేషామాదిత్యవజ్జ్ఞానం
ప్రకాశయతి తత్పరమ్. 16

ఆత్మజ్ఞానముచే ఎవరి యొక్క అజ్ఞానము నశింపజేయబడినదో, అట్టివారి జ్ఞానము సూర్యునివలె ఆ పరబ్రహ్మస్వరూపమును ప్రకాశింపజేయుచున్నది. (స్వస్వరూపానుభవమును గలుగజేయుచున్నది.)

తద్బుద్ధయ స్తదాత్మాన
స్తన్నిష్ఠాస్తత్పరాయణాః,
గచ్ఛన్త్యపునరావృత్తిం
జ్ఞాననిర్ధూతకల్మషాః. 17



ఆ పరమాత్మయందే బుద్ధిగలవారును, ఆ పరమాత్మయందే మనస్సును నెలకొల్పినవారును, ఆ పరమాత్మయందే నిష్ఠగలవారును, ఆ పరమాత్మనే పరమగతిగ నెంచువారును, జ్ఞానముచే నెగురగొట్టబడిన పాపముగలవారై పునరావృత్తిరహితమగు (పునర్జన్మవర్జితమగు) శాశ్వత మోక్షపదవిని బొందుచున్నారు.

విద్యావినయసంపన్నే
బ్రాహ్మణే గవి హస్తిని,
శుని చైవ శ్వపాకే చ
పణ్డితాః సమదర్శినః. 18

విద్య, వినయము గలిగియున్న బ్రాహ్మణుని యందును, గోవునందును, ఏనుగునందును, కుక్కయందును, కుక్కమాంసమువండుకొని తిను చండాలునియందును సమదృష్టికలవారే (వారిని సమముగ జూచువారే) జ్ఞానులు (ఆత్మానుభవముగలవారు) అని చెప్పబడుదురు.

ఇహైవ తైర్జితః సర్గో
యేషాం సామ్యే స్థితం మనః,
నిర్దోషం హి సమం బ్రహ్మ
తస్మాద్బ్రహ్మణి తే స్థితాః. 19

ఎవనియొక్క మనస్సు సమభావమందు (నిశ్చల సమస్థితియందు, లేక సర్వప్రాణులందును ఆత్మను సమముగ జూచుటలో) స్థిరముగ నున్నదో, అట్టి వారీజన్మమునందే జననమరణరూప సంసారమును జయించినవారగుదురు. ఏలయనిన, బ్రహ్మము దోష రహితమైనది, సమమైనది కావున (సమత్వమందు స్థితిగల)వారు బ్రహ్మమునందున్న వారేయగుదురు.

న ప్రహృష్యేత్ప్రియం ప్రాప్య
నోద్విజేత్ప్రాప్య చాప్రియమ్,
స్థిరబుద్ధి రసమ్మూఢో
బ్రహ్మవిద్బ్రహ్మణి స్థితః. 20

స్థిరమగు బుద్ధిగలవాడును, మోహరహితుడును



బ్రహ్మమందు నిలకడకలవాడునగు బ్రహ్మజ్ఞాని ఇష్టమైనదానిని పొందినపుడు సంతోషముగాని అనిష్టమైన దానిని పొందినపుడు దుఃఖమును గాని పొందకుండును.

బాహ్యస్పర్శేష్వసక్తాత్మా
విన్దత్యాత్మని యత్సుఖమ్,
స బ్రహ్మయోగయుక్తాత్మా
సుఖ మక్షయ మశ్నుతే. 21

బాహ్యములగు శబ్దాది విషయములందు ఆసక్తి లేనివాడు ఆత్మయందెట్టి(నిరతిశయ)సుఖముకలదో అట్టి సుఖమునే పొందుచున్నాడు. అతడు బ్రహ్మనిష్ఠయను సమాధితో గూడుకొనినవాడై (బ్రహ్మానుసంధానపరుడై) అక్షయమగు సుఖమును బడయుచున్నాడు.

యే హి సంస్పర్శజా భోగా
దుఃఖయోనయ ఏవ తే,
ఆద్యన్తవన్తః కౌన్తేయ
న తేషు రమతే బుధః. 22

ఓ అర్జునా! (ఇంద్రియ) విషయసంయోగము వలన గలుగు భోగములు దుఃఖహేతువులును,అల్ప కాలముండునవియు నయియున్నవి. కావున విజ్ఞుడగు వాడు వానియందు క్రీడింపడు, (ఆసక్తిగొనడు).

శక్నోతీహైవ యస్సోఢుం
ప్రాక్ఛరీరవిమోక్షణాత్,
కామక్రోధోద్భవం వేగం
స యుక్తః స సుఖీ నరః. 23

ఎవడీశరీరమును విడుచుటకు పూర్వమే యిచ్చో టనే (ఈజన్మయందే) కామక్రోధముల వేగమును అరికట్ట గలుగుచున్నాడో, అతడే యోగియు (చిత్తోపరతిగలవాడును), సుఖవంతుడునగును.

యోఽన్తఃసుఖోఽన్తరారామ
స్తథాన్తర్జ్యోతిరేవ యః,
స యోగీ బ్రహ్మనిర్వాణం
బ్రహ్మభూతోఽధిగచ్ఛతి. 24



ఎవడు లోన ఆత్మయందే సుఖించుచు ఆత్మ యందే క్రీడించుచు,ఆత్మయందే ప్రకాశముకలవాడై యుండునో, అట్టి యోగి బ్రహ్మస్వరూపుడై, బ్రహ్మసాక్షాత్కారమును (మోక్షమును) బొందును:

లభన్తే బ్రహ్మనిర్వాణ
మృషయః క్షీణకల్మషాః,
ఛిన్నద్వైధా యతాత్మానః
సర్వభూతహితే రతాః. 25

పాపరహితులును, సంశయ వర్జితులును, ఇంద్రియ మనంబులను స్వాధీనపఱచుకొనినవారును సమస్తప్రాణులయొక్క క్షేమమందాసక్తిగలవారు నగు ఋషులు (అతీంద్రియజ్ఞానులు) బ్రహ్మసాక్షాత్కారమును (మోక్షమును) బొందుచున్నారు.

కామక్రోధవియుక్తానాం
యతీనాం యతచేతసామ్,

అభితో బ్రహ్మనిర్వాణం
వర్తతే విదితాత్మనామ్. 26

కామక్రోధాదులు లేనివారును, మనోనిగ్రహము కలవారును, ఆత్మతత్త్వము నెఱిఁగినవారునగు యత్నశీలురకు బ్రహ్మసాయుజ్యము (మోక్షము, బ్రహ్మానందము) అంతటను (శరీరమున్నపుడును, లేనపుడును సర్వత్ర) వెలయుచునే యున్నది.

స్పర్శాన్ కృత్వా బహిర్బాహ్యాం
శ్చక్షుశ్చైవాన్తరే భ్రువోః,
ప్రాణాపానౌ సమౌ కృత్వా
నాసాభ్యన్తరచారిణౌ. 27

యతేన్ద్రియమనో బుద్ధి
ర్మునిర్మోక్షపరాయణః,



విగతేచ్ఛాభయక్రోధో
యస్సదా ముక్త ఏవ సః. 28

ఎవడు వెలుపలనున్న శబ్ద స్పర్శాది విషయములను వెలుపలికే నెట్టివైచి (లోనప్రవేశింపనీయక) చూపును భ్రూమధ్యమున నిలిపి, నాసికాపుటములందు సంచరించు ప్రాణాపానవాయువులను సమముగ జేసి ఇంద్రియమనోబుద్ధులను నిగ్రహించి ఇచ్ఛాభయక్రోధములు లేనివాడై మోక్షాసక్తుడై, (ఆత్మ)మననశీలుడై యుండునో అట్టివాడెల్లప్పుడును ముక్తుడే యగును.

భోక్తారం యజ్ఞతపసాం
సర్వలోకమహేశ్వరమ్,
సుహృదం సర్వభూతానాం
జ్ఞాత్వా మాం శాన్తిమృచ్ఛతి. 29

యజ్ఞములయొక్కయు తపస్సుయొక్కయు భోక్త (ఫలములనుభవించువాడు) గను, సమస్త లోకములయొక్క ఈశ్వరుడు (ప్రభువు శాసకుడు) గను, సమస్తప్రాణులయొక్క హితకారిగను నన్నెఱిఁగి మనుజుడు శాంతిని బొందుచున్నాడు.

ఇతి శ్రీమద్భగవద్గీతానూపనిషత్సు
బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే
శ్రీకృష్ణార్జునసంవాదే
కర్మసన్న్యాసయోగోనామ
పఞ్చమోఽధ్యాయః

ఓం

శ్రీకృష్ణపరబ్రహ్మణే నమః

# శ్రీ భగవద్గీత

## అథ షష్ఠోఽధ్యాయః

### ఆత్మసంయమయోగః

శ్రీ భగవానువాచ:—

అనాశ్రితః కర్మఫలం
కార్యం కర్మ కరోతి యః,
స సన్న్యాసీ చ యోగీ చ
న నిరగ్నిర్న చాక్రియః. 1

శ్రీ భగవంతుడు చెప్పెను—

ఎవడు చేయవలసిన కర్మములను ఫలాపేక్షలేకుండ చేయునో, అతడే సన్న్యాసియు, యోగియు నగును. అంతియేకాని అగ్నిహోత్రమును వదలినవాడుకాని, కర్మలనువిడిచినవాడుకాని సన్న్యాసియు యోగియు ఎన్నటికిని కానేరడు.

యం సన్న్యాసమితి ప్రాహు
ర్యోగం తం విద్ధి పాణ్డవ,
న హ్యసన్న్యస్తసంకల్పో
యోగీ భవతి కశ్చన. **2**

ఓ అర్జునా! దేనిని సన్న్యాసమని చెప్పుదురో, దానినే యోగమని యెఱుఁగుము. ఏలయనగా, (కామాది) సంకల్పమును వదలనివాడు (సంకల్ప రహితుడు కానివాడు) ఎవడును యోగికానేరడు.

ఆరురుక్షోర్మునేర్యోగం
కర్మకారణముచ్యతే,
యోగారూఢస్య తస్యైవ
శమః కారణముచ్యతే. **3**

యోగమును (జ్ఞానయోగమును, లేక ధ్యాన యోగమును) ఎక్కదలఁచిన(పొందగోరిన) మునికి (మననశీలునకు) కర్మసాధనమనియు, దానిని బాగుగ



ఎక్కినట్టిమునికి ఉపరతి కర్మనివృత్తి) సాధనమనియు చెప్పబడినది.

యదా హి నేన్ద్రియార్థేషు
న కర్మస్వనుషజ్జతే,
సర్వసంకల్పసన్న్యాసీ
యోగారూఢస్తదోచ్యతే. **4**

ఎవడు శబ్దాదివిషయములందును, కర్మలందును, ఆసక్తినుంచడో సమస్తసంకల్పములను విడిచి పెట్టునో, అపుడు మనుజుడు యోగారూఢుడని చెప్పబడును.

ఉద్ధరేదాత్మనాఽఽత్మానం
నాత్మాన మవసాదయేత్,
ఆత్మైవ హ్యాత్మనో బన్ధు
రాత్మైవ రిపు రాత్మనః. **5**

తన్నుతానే యుద్ధరించుకొనవలయును. తన్ను

అధోగతిని బొందించుకొనగూడదు. (ఇంద్రియమనము బులను జయించినచో) తనకు తానే బంధువున్ను. (జయించనిచో) తనకు తానే శత్రువున్ను అగును.

బన్ధు రాత్మాఽఽత్మన స్తస్య
యేనాత్మైవాత్మనా జితః,
అనాత్మనస్తు శత్రుత్వే
వర్తేతాత్మైవ శత్రువత్. 6

ఎవడు (వివేక వైరాగ్యాదులచే) తన మనస్సును తాను జయించుకొనునో, అట్టిజయింపబడిన మనస్సు తనకు బంధువువలెనుండును. (ఉపకారము చేయును) జయించనిచో, అదియే శత్రువువలెనుండును. (అపకారము చేయును).

జితాత్మనః ప్రశాన్తస్య
పరమాత్మా సమాహితః,



శీతోష్ణసుఖదుఃఖేషు
తథా మానావమానయోః. 7

మనస్సును జయించినవాడును, పరమశాంతితో గూడినవాడునగు మనుజుడు శీతోష్ణ, సుఖదుఃఖాదులందును, అట్లే మానావమానములందును పరమాత్మానుభవము చెక్కు చెదరకయే యుండును. (లేక అట్టి వానికి శీతోష్ణాదులందును మనస్సు లెస్సగ ఆత్మానుభవమందే యుండును).

జ్ఞానవిజ్ఞానతృప్తాత్మా
కూటస్థో విజితేన్ద్రియః,
యుక్త ఇత్యుచ్యతే యోగీ
సమలోష్టాశ్మకాంచనః. 8

శాస్త్రజ్ఞాన, అనుభవజ్ఞానములచే తృప్తినొందిన మనస్సుగలవాడును, నిర్వికారుడును, ఇంద్రియము లను లెస్సగ జయించినవాడును, మట్టిగడ్డ, రాయి, బంగారము, అను మూడిటిని సమముగ జూచువాడు నగు యోగి యోగారూఢుడని (ఆత్మానుభవయుక్తుడని) చెప్పబడును.

సుహృన్మిత్రార్యుదాసీన
మధ్యస్థద్వేష్యబన్ధుషు,
సాధుష్వపి చ పాపేషు
సమబుద్ధిర్విశిష్యతే. 9

ప్రత్యుపకారమును గోరకయే మేలొనర్చువారి యందు, ప్రతిఫలముగోరి మేలుచేయువారియందు, శత్రువులందు, తటస్థులందు, మధ్యవర్తులందు, ద్వేషింపబడదగినవారియందు,(విరోధులందు)బంధువులందు, సజ్జనులందు, పాపులందు సమభావము గల్గియుండువాడే శ్రేష్ఠుడు.

యోగీ యుఞ్జీత సతత
మాత్మానం రహసి స్థితః,
ఏకాకీ యతచిత్తాత్మా
నిరాశీరపరిగ్రహః. 10

(ధ్యానయోగము నభ్యసించు యోగి ఏకాంత ప్రదేశమున ఒంటరిగ నున్నవాడై మనస్సును,



దేహేంద్రియములను స్వాధీనమొనర్చుకొని, ఆశ లేనివాడై, ఒరులనుండి ఏమియు స్వీకరింపక ఎల్లప్పుడును మనస్సును ఆత్మయందే నెలకొల్పుచుండవలెను. (లయమొనర్చుచుండవలెను.)

శుచౌ దేశే ప్రతిష్ఠాప్య
స్థిరమాసన మాత్మనః,
నాత్యుచ్ఛ్రితం నాతినీచం
చేలాజినకుశోత్తరమ్. 11

తత్రైకాగ్రం మనః కృత్వా
యతచిత్తేన్ద్రియక్రియః,
ఉపవిశ్యాసనే యుఞ్జ్యా
ద్యోగమాత్మ విశుద్ధయే. 12

పరిశుద్ధమైన చోటునందు మిక్కిలి ఎత్తుగా నుండనిదియు, మిక్కిలి పొట్టిగా నుండనిదియు, క్రింద దర్భాసనము, దానిపై చర్మము (జింకచర్మము, లేక పులిచర్మము), దానిపైన వస్త్రముగలదియు, కదలక

యుండునదియునగు ఆసనము (పీఠము)ను వేసికొని దానిపై గూర్చుండి, మనస్సును, ఏకాగ్రపఱచి ఇంద్రియమనోవ్యాపారములను అరికట్టి (స్వాధీన పఱచుకొని) అంతఃకరణశుద్ధికొఱకు (పరమాత్మ) ధ్యానము నభ్యసింప వలయును.

సమం కాయశిరోగ్రీవం
ధారయన్నచలం స్థిరః,
సంప్రేక్ష్య నాసికాగ్రం స్వం
దిశశ్చానవలోకయన్. **13**

ప్రశాన్తాత్మా విగతభీ
ర్బ్రహ్మచారి వ్రతే స్థితః,
మనస్సంయమ్య మచ్చిత్తో
యుక్త ఆసీత మత్పరః. **14**

(ధ్యానముచేయువాడు) శరీరము, శిరస్సు, కంఠము, సమముగ (తిన్నగ) నిలిపి కదలక, స్థిరముగ నున్నవాడై దిక్కులను జూడక, నాసికాగ్రమును



వీక్షించుచు, ప్రశాంతహృదయుడై, నిర్భయచేతస్కుడై బ్రహ్మచర్యవ్రతనిష్ఠ గలిగి, మనస్సును బాగుగ నిగ్రహించి, నాయందు చిత్తముగలవాడై, నన్నే పరమగతిగ నమ్మి, సమాధి (ధ్యాన) యుక్తుడై యుండవలెను.

యుఞ్జన్నేవం సదాఽఽత్మానం
యోగీ నియతమానసః.
శాన్తిం నిర్వాణపరమాం
మత్సంస్థామధిగచ్ఛతి. **15**

మనోనిగ్రహముగల యోగి ఈప్రకారముగ ఎల్లప్పుడును మనస్సును ఆత్మధ్యానమందు నిలిపి, నాయందున్నట్టిదియు (నా స్వరూపమైనదియు), సర్వోత్కృష్ట మోక్షరూపమైనదియు, (పరమానంద రూపమైనదియు) నగు శాంతిని బొందుచున్నాడు.

నాత్యశ్నతస్తు యోగోఽస్తి
న చైకాన్త మనశ్నతః,

న చాతిస్వప్నశీలస్య
జాగ్రతో నైవ చార్జున. **16**

అర్జునా! ఈధ్యానయోగము అధికముగభుజించు వానికిని, బొత్తిగా భుజింపనివానికిని, అట్లే అధికముగ నిద్రించువానికిని,(బొత్తిగానిద్రించక) ఎల్లపుడు మేలుకొని యుండువానికిని కలుగనే కలుగగు.

యుక్తాహార విహారస్య
యుక్తచేష్టస్య కర్మసు,
యుక్తస్వప్నావబోధస్య
యోగో భవతి దుఃఖహా. **17**

మితమైన ఆహారము, విహారముగలవాడును, కర్మలందు మితమైన ప్రవర్తనగలవాడును,మితమైన నిద్ర, జాగరణము గలవాడునగు మనుజునకు యోగము (జనన మరణాది సంసార)దుఃఖములను పోగొట్టునదిగ అగుచున్నది.



యదా వినియతం చిత్త
మాత్మన్యేవావతిష్ఠతే,
నిస్పృహస్సర్వకామేభ్యో
యుక్త ఇత్యుచ్యతే తదా. **18**

ఎపుడు మనస్సు బాగుగనిగ్రహింపబడినదియై ఆత్మయందే స్థిరముగ నిలుచునో, మఱియు ఎపుడు యోగి సమస్తములైనకోరికలనుండినివృత్తుడగునో, అపుడే యాతడు యోగసిద్ధిని బొందినవాడని (సమాధియుక్తుడని) చెప్పబడును.

యథా దీపో నివాతస్థో
నేఙ్గతే సోపమాస్మృతా,
యోగినో యతచిత్తస్య
యుఞ్జతో యోగమాత్మనః. **19**

గాలిలేనిచోటనున్న దీప మేప్రకారము కదలక నిశ్చలముగనుండునో, ఆ ప్రకారమే ఆత్మధ్యానమును శీలించుచున్న యోగియొక్క స్వాధీనపడిన

చిత్తమున్ను నిశ్చలముగనుండును. కనుకనే యోగి యొక్క నిశ్చలమనస్సునకు అట్టి గాలిలేనిచోటగల దీపము దృష్టాంతముగ చెప్పబడినది.

యత్రోపరమతే చిత్తం
నిరుద్ధం యోగసేవయా,
యత్ర చైవాత్మనాఽఽత్మానం
పశ్యన్నాత్మని తుష్యతి. **20**

సుఖమాత్యన్తికం యత్త
ద్బుద్ధిగ్రాహ్యమతీన్ద్రియమ్,
వేత్తి యత్ర న చైవాయం
స్థితశ్చలతి తత్త్వతః. **21**

యం లబ్ధ్వా చాపరం లాభం
మన్యతే నాధికం తతః,



యస్మిన్ స్థితో న దుఃఖేన
గురుణాపి విచాల్యతే. **22**

తం విద్యాద్దుఃఖసంయోగ
వియోగం యోగసంజ్ఞితమ్,
స నిశ్చయేన యోక్తవ్యో
యోగోఽనిర్విణ్ణచేతసా. **23**

యోగాభ్యాసముచేత నిగ్రహింపబడిన మనస్సు ఎచట పరమశాంతిని బొందుచుండునో, ఎచట (పరిశుద్ధమైన) మనస్సుచే ఆత్మను సందర్శించుచు (అనుభవించుచు) యోగి తనయందే ఆనందమును బడయుచుండునో, ఎచటనున్నవాడై యోగి (ఇంద్రియములకు) గోచరము కానిదియు, (నిర్మల) బుద్ధిచే గ్రహింపబడదగినదియు అంతము లేనిదియునగు సుఖమును అనుభవించుచుండునో, మఱియు స్వానుభవమునుండి ఏమాత్రము చలింపకుండునో, దేనిని పొందిన పిదప ఇతరమగు ఏలాభమును అంతకంటె గొప్పదానినిగ తలంపకుండునో, దేనియందున్న

వాడై మహత్తరదుఃఖముచేగూడ చలింపకుండునో, దుఃఖసంబంధము లేశమైనను లేని అట్టి స్థితి నే యోగము (ఆత్మైక్యము, ఆత్మసాక్షాత్కారము) అని యెఱుంగవలయును. అట్టి ఆత్మసాక్షాత్కార రూప యోగము దుఃఖముచే కలతనొందని ధీర మనస్సుచే పట్టుదలతో సాధింపదగియున్నది.

సంకల్ప ప్రభవాన్ కామాం
స్త్యక్త్వా సర్వానశేషతః,
మనసైవేన్ద్రియగ్రామం
వినియమ్య సమన్తతః. 24

శనైః శనై రుపరమే
ద్బుద్ధ్యా ధృతిగృహీతయా,
ఆత్మసంస్థం మనః కృత్వా
న కించిదపి చిన్తయేత్. 25

సంకల్పమువలన గలిగెడు కోరికలన్నిటిని సంపూర్తిగా విడిచిపెట్టి, మనస్సుచే ఇంద్రియములను



నలుప్రక్కలనుండి బాగుగ నిగ్రహించి ధైర్యముతో గూడిన బుద్ధిచే మెల్లమెల్లగ బాహ్య ప్రపంచము నుండి ఆ మనస్సును మరలించి అంతరంగమున విశ్రాంతి నొందవలెను. (ఉపరతిని బడయవలెను.) మఱియు మనస్సును ఆత్మయందు స్థాపించి ఆత్మేతరమగు దేనినిగూడ చింతింపక యుండవలయును.

యతో యతో నిశ్చరతి
మనశ్చఞ్చల మస్థిరమ్,
తతస్తతో నియమ్యైత
దాత్మన్యేవ వశం నయేత్. 26

చపలస్వభావము గలదియు, నిలుకడలేనిదియు నగు మనస్సు ఎచ టెచట (ఏయేవిషయములయందు) సంచరించునో అచటచటనుండి దానిని మరలించి ఆత్మయం దే స్థాపితముచేయవలెను. ఆత్మకధీనముగ నొనర్పవలెను.

ప్రశాన్తమనసం హ్యేనం
యోగినం సుఖ ముత్తమమ్,

ఉపైతి శాన్తరజసం
బ్రహ్మభూత మకల్మషమ్. **27**

ప్రశాంతచిత్తుడును, (కామక్రోధాది) రజోగుణ వికారములు లేనివాడును, బ్రహ్మరూపమును పొందినవాడును, దోషరహితుడునగు ఈ ధ్యానయోగిని సర్వోత్తమమగుసుఖము (ఆత్మానందము) పొందుచున్నది కదా! (అట్లు పొందుట శాస్త్రప్రసిద్ధమని భావము.)

యుఞ్జన్నేవం సదాఽఽత్మానం
యోగీ విగతకల్మషః,
సుఖేన బ్రహ్మసంస్పర్శ
మత్యన్తం సుఖ మశ్నుతే. **28**

ఈ ప్రకారముగ మనస్సు నెల్లప్పుడును ఆత్మయందే నిలుపుచు దోషరహితుడగు యోగి బ్రహ్మానుభవ రూపమైన పరమ సుఖమును సులభముగ పొందుచున్నాడు.



సర్వభూతస్థ మాత్మానం
సర్వభూతాని చాత్మని,
ఈక్షతే యోగయుక్తాత్మా
సర్వత్ర సమదర్శనః. **29**

యోగముతో గూడుకొనిన మనస్సుగలవాడు (ఆత్మైక్యము పొందిన యోగి) సమస్త చరాచర ప్రాణికోట్ల యందును సమదృష్టిగలవాడై తన్ను సర్వభూతములందున్నవానిగను, సర్వభూతములు తనయందున్నవిగను చూచుచున్నాడు.

యో మాం పశ్యతి సర్వత్ర
సర్వం చ మయి పశ్యతి,
తస్యాహం న ప్రణశ్యామి
స చ మే న ప్రణశ్యతి. **30**

ఎవడు సమస్త భూతములందును నన్ను చూచుచున్నాడో మఱియు నాయందు సమస్త భూతము

లను గాంచుచున్నాడో అట్టివానికి నేను కనబడక పోను. నా కతడు కనబడకపోడు.

సర్వభూతస్థితం యో మాం
భజత్యేకత్వమాస్థితః,
సర్వథా వర్తమానోఽపి
స యోగీ మయి వర్తతే. 31

ఎవడు సమస్తభూతములందున్న నన్ను అభేద బుద్ధి(సర్వత్ర ఒకే పరమాత్మయను భావము)గలిగి సేవించుచున్నాడో, అట్టియోగి ఏ విధముగ ప్రవర్తించుచున్నవాడైనను (సమాధి నిష్ఠయందున్నను లేక వ్యవహారము సల్పుచున్నను) నా యందే (ఆత్మయందే) ఉండువాడగుచున్నాడు.

ఆత్మౌపమ్యేన సర్వత్ర
సమం పశ్యతి యోఽర్జున,
సుఖం వా యది వా దుఃఖం
స యోగీ పరమో మతః. 32.



ఓ అర్జునా! సమస్తప్రాణులయందును సుఖమును గాని, దుఃఖమును గాని తనతోడ పోల్చుకొనుచు (తనఆత్మవంటివే తక్కిన ఆత్మలనెడి భావముతో) తనవలె సమానముగ ఎవడు చూచునో, అట్టియోగి శ్రేష్ఠుడని తలంపబడుచున్నాడు.

అర్జున ఉవాచ :—

యోఽయం యోగస్త్వయా ప్రోక్త
స్సామ్యేన మధుసూదన
ఏతస్యాహం న పశ్యామి
చఞ్చలత్వాత్స్థితిం స్థిరామ్. 33

అర్జునుడు చెప్పెను —

ఓ కృష్ణా! మనోనిశ్చలత్వముచే సిద్ధింపదగిన ఏ యోగమును నీవుపదేశించితివో దానియొక్క స్థిరమైన నిలుకడను మనస్సుయొక్క చపలత్వమువలన నేను తెలిసికొనజాలకున్నాను.

చఞ్చలం హి మనః కృష్ణ
ప్రమాథి బలవద్దృఢమ్,

తస్యాహం నిగ్రహం మన్యే
వాయోరివ సుదుష్కరమ్. 34

కృష్ణా! మనస్సు చంచలమైనదియు, విక్షోభమును గలుగ జేయునదియు, బలవంతమైనదియు, దృఢమైనదియునుగదా! కావున అద్దానిని నిగ్రహించుట; గాలిని అణచి పెట్టుటవలె మిగుల కష్టసాధ్యమైనదని నేను తలంచుచున్నాను.

శ్రీభగవానువాచ :—

అసంశయం మహాబాహో
మనో దుర్నిగ్రహం చలమ్,
అభ్యాసేన తు కౌన్తేయ
వైరాగ్యేణ చ గృహ్యతే. 35

శ్రీ భగవానుడు చెప్పెను —

గొప్ప బాహువులుగలట్టి అర్జునా! మనస్సును నిగ్రహించుట కష్టమే. మఱియు మనస్సు చంచలమైనదే. ఇట ఏలాంటి సంశయము లేదు. అయినను అభ్యాసము చేతను వైరాగ్యము చేతను అది నిగ్రహింపబడగలదు.



అసంయతాత్మనా యోగో
దుష్ప్రాప ఇతి మే మతిః,
వశ్యాత్మనా తు యతతా
శక్యోఽవాప్తుముపాయతః. 36

నిగ్రహింపబడని మనస్సుగలవానిచేత యోగము (బ్రహ్మైక్యము) పొందశక్యముకానిది అని నా అభిప్రాయము. స్వాధీనమైన మనస్సుగల్గి ప్రయత్నించువానిచేతనో, ఉపాయముచే నది పొంద శక్యమైయున్నది.

అర్జున ఉవాచ:—

అయతిః శ్రద్ధయోపేతో
యోగాచ్చలితమానసః,
అప్రాప్య యోగసంసిద్ధిం
కాం గతిం కృష్ణ గచ్ఛతి. 37

అర్జునుడడిగెను —

కృష్ణా! శ్రద్ధతో గూడియున్నవాడును, కాని నిగ్రహశక్తి లేనివాడగుటచే యోగమునుండి జారిన మనస్సుగలవాడునగు సాధకుడు యోగసిద్ధిం(ఆత్మ సాక్షాత్కారమును) బొందజాలక ఏగతిని బొందుచున్నాడు?

కచ్చిన్నోభయవిభ్రష్ట
శ్ఛిన్నాభ్ర మివ నశ్యతి,
అప్రతిష్ఠో మహాబాహో
విమూఢో బ్రహ్మణః పథి. 38

గొప్ప బాహువులుగల ఓ కృష్ణా! బ్రహ్మమార్గమున (యోగమున) స్థిరత్వము లేనివాడగు మూఢుడు ఇహ పరములు రెండిటికిని చెడినవాడై చెదరిన మేఘమువలె నశించిపోడా ఏమి?

ఏతన్మే సంశయం కృష్ణ
ఛేత్తు మర్హస్య శేషతః,



త్వదన్యః సంశయస్యాస్య
ఛేత్తా న హ్యుపపద్యతే. 39

కృష్ణా! ఈ సంశయమును పూర్తిగా తొలగించుటకు నీవే తగుదువు. (సమర్థుడవు). నీవుతప్ప ఇతరులెవరును దీనిని తొలగింప జాలరు.

శ్రీ భగవానువాచ:—

పార్థ నైవేహ నాముత్ర
వినాశస్తస్య విద్యతే,
న హి కల్యాణకృత్కశ్చి
ద్దుర్గతిం తాత గచ్ఛతి. 40

శ్రీ భగవానుడు పలికెను —

ఓ అర్జునా! అట్టి యోగభ్రష్టునకు ఈ లోకమందుగాని, పరలోకమందుగాని వినాశము కలుగనే కలుగదు. నాయనా! మంచికార్యములు చేయువాడెవడును దుర్గతిని పొందడుగదా!

ప్రాప్య పుణ్యకృతాం లోకా
నుషిత్వా శాశ్వతీః సమాః,
శుచీనాం శ్రీమతాం గేహే
యోగభ్రష్టోఽభిజాయతే. **41**

యోగభ్రష్టుడు (మరణానంతరము) పుణ్యాత్ముల లోకములను పొంది, అట అనేకవత్సరములు నివసించి, తదుపరి పరిశుద్ధులైనట్టి (సదాచారవంతులైన) శ్రీమంతులయొక్క గృహమందు పుట్టుచున్నాడు.

అథవా యోగినామేవ
కులే భవతి ధీమతామ్,
ఏతద్ధి దుర్లభతరం
లోకే జన్మ యదీదృశమ్. **42**

లేక, (ఉత్తమతరగతి యోగియైనచో) జ్ఞానవంతులగు యోగులయొక్క వంశమందే జన్మించుచున్నాడు. ఈ ప్రకారమగు జన్మము లోకమున మహాదుర్లభమైనది.



తత్ర తం బుద్ధిసంయోగం
లభతే పౌర్వదైహికమ్,
యతతే చ తతో భూయ
స్సంసిద్ధౌ కురునన్దన. **43**

ఓ అర్జునా! అట్లాతడు యోగులవంశమున జన్మించి పూర్వదేహ సంబంధమైన (యోగవిషయిక) బుద్ధితోటి సంపర్కమును పొందుచున్నాడు. అట్టి (యోగ) సంస్కారమువలన నాతడు సంపూర్ణ యోగసిద్ధి (మోక్షము) కొఱకై మరల తీవ్రతర ప్రయత్నమును సల్పుచున్నాడు.

పూర్వాభ్యాసేన తేనైవ
హ్రియతే హ్యవశోఽపి సః,
జిజ్ఞాసురపి యోగస్య
శబ్దబ్రహ్మాతివర్తతే. **44**

అతడు (యోగభ్రష్టుడు) యోగాభ్యాసమునకు తానుగా (మొదట) నిశ్చయింపకున్నను పూర్వ జన్మమునందలి అభ్యాసబలముచే యోగము వైపునకే ఈడ్వబడుచున్నాడు. యోగము నెఱుఁగ దలంపు గలవాడైనంత మాత్రముచేతనే (యోగాభ్యాసము చేయ నిచ్ఛగించి నంతమాత్రముచేతనే) వేదము లందు జెప్పబడిన కర్మానుష్ఠానఫలమును మనుజుడు దాటివేయుచున్నాడు.

ప్రయత్నాద్యతమానస్తు
యోగీ సంశుద్ధకిల్బిషః,
అనేక జన్మ సంసిద్ధ
స్తతో యాతి పరాం గతిమ్.45

పట్టుదలతో ప్రయత్నించునట్టి యోగి పాప రహితుడై, అనేక జన్మలందు చేయబడిన అభ్యాస ముచే యోగసిద్ధిని బొందినవాడై, ఆపిదప సర్వో త్తమమగు (మోక్ష) గతిని బడయుచున్నాడు.



తపస్విభ్యోఽధికో యోగీ
జ్ఞానిభ్యోఽపి మతోఽధికః,
కర్మిభ్యశ్చాధికో యోగీ
తస్మాద్యోగీ భవార్జున. 46

ఓ అర్జునా! యోగియగువాడు (కృచ్ఛ్రచాంద్రా యణాది) తపస్సులు చేయువారికంటెను, శాస్త్ర జ్ఞానము గలవారికంటెను, (అగ్నిహోత్రాది) కర్మలు చేయువారికంటెనుగూడ శ్రేష్ఠుడని తలంప బడుచున్నాడు. కాబట్టి నీవు యోగివి కమ్ము.

యోగినామపి సర్వేషాం
మద్గతేనాన్తరాత్మనా,
శ్రద్ధావాన్ భజతే యో మాం
స మే యుక్తతమో మతః. 47

యోగులందఱిలోను ఎవడు నాయందు మనస్సు నిలిపి శ్రద్ధతో నన్ను ధ్యానించుచున్నాడో అట్టివాడు సర్వశ్రేష్ఠుడని నాయభిప్రాయము.

ఇతి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు
బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే
శ్రీ కృష్ణార్జునసంవాదే
ఆత్మసంయమ యోగో నామ
షష్ఠోఽధ్యాయః

---

ఓమ్
శ్రీకృష్ణపరబ్రహ్మణే నమః

# శ్రీ భగవద్గీత

## అథ సప్తమోఽధ్యాయః

## విజ్ఞానయోగః

శ్రీ భగవానువాచ :–

మయ్యాసక్తమనాః పార్థ
యోగం యుఞ్జన్మదాశ్రయః,
అసంశయం సమగ్రం మాం
యథా జ్ఞాస్యసి తచ్ఛృణు. 1

శ్రీభగవానుడు చెప్పెను:– ఓ అర్జునా! నాయందాసక్తిగల మనస్సుగలిగి, నన్నాశ్రయించి యోగము నాచరించుచు నిస్సందేహముగ సంపూర్ణముగ నన్నెట్లు తెలిసికొనగలవో దానిని (ఆపద్ధతిని) చెప్పెదను వినుము.

జ్ఞానం తేఽహం సవిజ్ఞాన
మిదం వక్ష్యామ్య శేషతః,
యజ్జ్ఞాత్వా నేహ భూయోఽన్య
జ్జ్ఞాతవ్య మవశిష్యతే. 2

దేనిని తెలిసికొనినచో మరల ఈ ప్రపంచమున తెలిసికొనదగినది మఱియొకటి మిగిలి యుండదో అట్టి అనుభవ సహితమగు జ్ఞానమును సంపూర్ణముగ నీకు చెప్పెదను.

మనుష్యాణాం సహస్రేషు
కశ్చిద్యతతి సిద్ధయే,
యతతామపి సిద్ధానాం
కశ్చిన్మాం వేత్తి తత్త్వతః. 3

అనేక వేలమంది మనుజులలో ఏ ఒకానొకడో మోక్షసిద్ధికై యత్నించుచున్నాడు. అట్లుయత్నించువారైన అనేకమందిలో ఏ ఒకానొకడు మాత్రమే నన్ను వాస్తవముగ తెలిసికొనగల్గుచున్నాడు.



భూమిరాపోఽనలో వాయుః
ఖం మనోబుద్ధి రేవ చ,
అహంకార ఇతీయం మే
భిన్నా ప్రకృతిరష్టధా. 4

భూమి, జలము, అగ్ని, వాయువు, ఆకాశము, మనస్సు, బుద్ధి, అహంకారము-అని యీ ప్రకారముగ ఎనిమిది విధములుగ నా యీ ప్రకృతి (మాయ) విభజింపబడినది.

అపరేయమితస్త్వన్యాం
పకృతిం విద్ధి మే పరామ్,
జీవభూతాం మహాబాహో
య యేదం ధార్యతే జగత్. 5

గొప్పబాహువులుగల ఓ అర్జునా! ఈ (అపరా) ప్రకృతి చాల అల్పమైనది. దీనికంటె వేఱైనదియు, ఈ జగత్తునంతను ధరించునదియు జీవరూపమైనదియు నగు మఱియొక ప్రకృతిని (పరాప్రకృతిని) శ్రేష్ఠమైన దానినిగా నెఱుంగుము.

ఏతద్యోనీని భూతాని
సర్వాణీత్యుపధారయ,
అహం కృత్స్నస్య జగతః
ప్రభవః ప్రలయ స్తథా. 6

(జడ, చేతనము లగు) సమస్తభూతములున్ను ఈ రెండు విధములగు (పరాపర) ప్రకృతుల వలననే కలుగునవియని తెలిసికొనుము ఈ రెండు (ప్రకృతుల ద్వారా) నేనే ఈ సమస్తప్రపంచముయొక్క ఉత్పత్తికి, వినాశమునకు కారణభూతుడనై యున్నాను.

మత్తః పరతరం నాన్య
త్కించిదస్తి ధనంజయ,
మయి సర్వమిదం ప్రోతం
సూత్రే మణిగణా ఇవ. 7

ఓ అర్జునా! నాకంటె వేఱుగ మరియొకటి ఏదియు లేనే లేదు. దారమందు మణులవలె నాయందే సమస్త ప్రపంచము కూర్చబడినది.



రసోఽహమప్సు కౌన్తేయ
ప్రభాస్మి శశిసూర్యయోః,
ప్రణవః సర్వవేదేషు
శబ్దః ఖే పౌరుషం నృషు. 8

అర్జునా! నేను జలమందు రుచియు, చంద్రసూర్యులందు కాంతియు, సమస్త వేదములందు ఓంకారమును ఆకాశమందు శబ్దమును మనుజులందు పరాక్రమమును అయియున్నాను.

పుణ్యో గన్ధః పృథివ్యాం చ
తేజశ్చాస్మి విభావసౌ,
జీవనం సర్వభూతేషు
తపశ్చాస్మి తపస్విషు. 9

(మఱియు నేను) భూమియందు సుగంధమును, అగ్నియందు ప్రకాశమును, సమస్త ప్రాణులయందు ప్రాణమును (లేక ఆయువును). తాపసులయందు తపస్సును అయియున్నాను.

బీజం మాం సర్వభూతానాం
విద్ధి పార్థ సనాతనమ్,
బుద్ధిర్బుద్ధిమతామస్మి
తేజస్తేజస్వినామహమ్. **10**

ఓ అర్జునా! నన్ను సమస్త ప్రాణులయొక్క శాశ్వతమైన బీజముగ నెఱుఁగుము. మఱియు బుద్ధిమంతులయొక్క బుద్ధియు, ధీరులయొక్క తేజస్సును నేనే అయియున్నాను.

బలం బలవతాం చాహం
కామరాగవివర్జితమ్,
ధర్మావిరుద్ధో భూతేషు
కామోఽస్మి భరతర్షభ. **11**

భరతకుల శ్రేష్ఠుడవగు ఓ అర్జునా! నేను బలవంతులయొక్క ఆశ, అనురాగములేని బలమును ప్రాణులయందు ధర్మమునకు వ్యతిరేకముకాని కోరికయు అయియున్నాను.



యే చైవ సాత్త్వికా భావా
రాజసాస్తామసాశ్చ యే,
మత్త ఏవేతి తాన్విద్ధి
న త్వహం తేషు తే మయి. **12**

సత్త్వరజస్తమోగుణములచే గలిగిన పదార్థములు (లేక స్వభావములు) ఎవ్వి కలవో అవినావలననే కలిగినవని నీవెఱుఁగుము. అయితే నేను వానియందు లేను. అవి నాయందున్నవి. (నేను వానికి వశుడను గాను. అవి నాకు వశవర్తులైయున్నవని భావము).

త్రిభిర్గుణమయైర్భావై
రేభిః సర్వమిదం జగత్,
మోహితం నాభిజానాతి
మామేభ్యః పరమవ్యయమ్. **13**

ఈ చెప్పబడిన మూడువిధములగు సత్త్వరజస్తమోగుణములయొక్క వికారములగు స్వభావములచేత ఈ ప్రపంచమంతయు మోహమును (అవివేక

మును) బొందింపబడినదై ఆ గుణములకంటె వేఱై (అతీతుడనై) నాశరహితుడనైనట్టి నన్ను తెలిసికొనజాలకున్నది.

దైవీ హ్యేషా గుణమయీ
మమ మాయా దురత్యయా,
మామేవ యే ప్రపద్యన్తే
మాయామేతాం తరన్తి తే. 14

ఏలయనగా, దైవసంబంధమైనదియు (అలౌకిక సామర్థ్యము కలదియు) త్రిగుణాత్మకమైనదియునగు ఈ నాయొక్క మాయ (ప్రకృతి) దాటుటకు కష్టసాధ్యమైనది. (అయినను) ఎవరు నన్నే శరణుబొందుచున్నారో వారీ మాయను దాటివేయగలరు.

న మాం దుష్కృతినో మూఢాః
ప్రపద్యన్తే నరాధమాః,
మాయయాఽపహృతజ్ఞానా
ఆసురం భావమాశ్రితాః. 15



పాపము చేయువారును, మూఢులును, మాయచే అపహరింపబడిన జ్ఞానముగలవారును, రాక్షస స్వభావమును (అసురగుణములను) ఆశ్రయించువారు నగు మనుజాధములు నన్ను బొందుటలేదు. (ఆశ్రయించుటలేదు).

చతుర్విధా భజన్తే మాం
జనాస్సుకృతినోఽర్జున,
ఆర్తో జిజ్ఞాసు రర్థార్థీ
జ్ఞానీ చ భరతర్షభ. 16

భరతవంశశ్రేష్ఠుడవగు ఓ అర్జునా! ఆపత్తునందున్నవాడు, (భగవంతుని) తెలిసికొనగోరువాడు, ధనము(సంపత్తు) నభిలషించువాడు, (ఆత్మ) జ్ఞానము కలవాడు అను నీ నాలుగు విధములైన పుణ్యాత్ములగు జనులు నన్ను సేవించుచున్నారు. (భజించుచున్నారు)

తేషాం జ్ఞానీ నిత్యయుక్త
ఏకభక్తిర్విశిష్యతే,

ప్రియో హి జ్ఞానినోఽత్యర్థ
మహం స చ మమ ప్రియః. **17**

వారి (నలుగురి)లో నిత్యము పరమాత్మతో గూడియుండువాడును, ఒక్క పరమాత్మయందే భక్తి గలవాడు నగు జ్ఞాని శ్రేష్ఠుడగుచున్నాడు. అట్టి జ్ఞానికి నేనుమిక్కిలి ఇష్టమైనవాడను; అతడున్ను నాకు మిగుల ఇష్టుడే.

ఉదారాః సర్వ ఏవైతే
జ్ఞానీ త్వాత్మైవ మే మతమ్,
ఆస్థితః స హి యుక్తాత్మా
మామేవానుత్తమాం గతిమ్. **18**

వీరందఱున్ను (పైన దెలిపిన నలుగురుభక్తులు) మంచివారే. కాని అందు జ్ఞానియో సాక్షాత్ నేనే యని నా అభిప్రాయము. ఏలయనగా అతడు నా యందే చిత్తమును స్థిరముగ నెలకొల్పి నన్నే సర్వోత్తమమైన ప్రాప్యస్థానముగ నిశ్చయించి ఆశ్రయించు కొనియున్నాడు.



బహూనాం జన్మనామన్తే
జ్ఞానవాన్మాం ప్రపద్యతే,
వాసుదేవస్సర్వమితి
స మహాత్మా సుదుర్లభః. **19**

అనేక జన్మలయొక్క అంతమున మనుజుడు జ్ఞానవంతుడై సమస్తము వాసుదేవుడే (భగవంతుడే యను సద్బుద్ధి గల్గి నన్ను పొందుచున్నాడు. అట్టి మహాత్ముడు లోకములో చాల అరుదు.

కామైస్తైస్తైర్హృతజ్ఞానాః
ప్రపద్యన్తేఽన్యదేవతాః,
తం తం నియమమాస్థాయ
ప్రకృత్యా నియతాస్స్వయా.

(కొందఱు) తమయొక్క ప్రకృతి (జన్మాంతర సంస్కారము)చే ప్రేరేపింపబడినవారై విషయాదు లందలి కోరికలచే వివేకమును గోల్పోయి, దేవతా

రాధనా సంబంధమైన ఆయా నియమముల నవలంబించి ఇతర దేవతలను భజించుచున్నారు.

యో యో యాం యాం తనుం భక్తః
శ్రద్ధయాఽర్చితు మిచ్ఛతి,
తస్య తస్యాచలాం శ్రద్ధాం
తామేవ విదధా మ్యహమ్. 21

ఏ యే భక్తుడు ఏ యే (దేవతా) రూపమును శ్రద్ధతో పూజింప దలంచుచున్నాడో దాని దానికి తగినశ్రద్ధనే వానివానికి నేనుస్థిరముగ గలుగజేయుచున్నాను.

స తయా శ్రద్ధయా యుక్త
స్తస్యారాధన మీహతే,
లభతే చ తతః కామాన్
మయైవ విహితాన్ హి తాన్.



అతడు (పైన తెలుపబడిన కామ్యభక్తుడు) అట్టి శ్రద్ధతో గూడుకొనినవాడై ఆ యా దేవతలయొక్క ఆరాధనను గావించుచున్నాడు. మఱియు నాచే విధింపబడిన ఆయా ఇష్టఫలములను ఆయా దేవతల ద్వారా పొందుచున్నాడు.

అన్తవత్తు ఫలం తేషాం
తద్భవత్యల్ప మేధసామ్,
దేవాన్ దేవయజో యాన్తి
మద్భక్తా యాన్తి మామపి. 23

అల్పబుద్ధి కలిగిన వారియొక్క ఆ ఫలము నాశవంతమైయున్నది. (ఏలయనగా) దేవతలను పూజించువారు దేవతలనే పొందుచున్నారు.. నాభక్తులు(నన్ను పూజించువారు) నన్నే పొందుచున్నారు.

అవ్యక్తం వ్యక్తి మాపన్నం
మన్యన్తే మామబుద్ధయః,

పరం భావ మజానన్తో
మమావ్యయ మనుత్తమమ్. 24

నాశరహితమైనట్టియు, సర్వోత్తమమైనట్టియు, నాకన్న వేఱొక పరమై యిలసిల్లునట్టియు నాస్వరూపమును తెలియని అవివేకులు అవ్యక్తరూపుడగు (ప్రపంచాతీతుడనగు) నన్ను పాంచభౌతిక దేహమును పొందిన వానినిగా తలంచుచున్నారు.

నాహం ప్రకాశః సర్వస్య
యోగమాయా సమావృతః,
మూఢోఽయం నాభిజానాతి
లోకో మా మజమవ్యయమ్. 25

యోగమాయచే బాగుగా కప్పబడియుండుటచే నేను అందఱికిని కనుపించువాడనుగాను అవివేకులగు ఈ జనులు నన్ను పుట్టుకలేనివానిగను, నాశరహితునిగను ఎఱుఁగరు.

వేదాహం సమతీతాని
వర్తమానాని చార్జున,



భవిష్యాణి చ భూతాని
మాం తు వేద న కశ్చన. 26

ఓ అర్జునా! నేను భూతభవిష్యద్వర్తమానకాలములందలి ప్రాణులందఱిని ఎఱుఁగుదును. నన్ను మాత్ర మెవడును ఎఱుఁగడు.

ఇచ్ఛాద్వేషసముత్థేన
ద్వన్ద్వమోహేన భారత,
సర్వభూతాని సమ్మోహం
సర్గే యాన్తి పరన్తప. 27

శత్రువులను తపింపజేయు ఓ అర్జునా! సమస్త ప్రాణులును పుట్టుకతోడనే రాగద్వేషజనితములగు సుఖదుఃఖాది ద్వంద్వరూపమైన వ్యామోహము వలన మిక్కిలి అజ్ఞానమును బొందుచున్నవి.

యేషాం త్వన్తగతం పాపం
జనానాం పుణ్యకర్మణామ్,

తే ద్వన్ద్వమోహనిర్ముక్తా
భజన్తే మాం దృఢవ్రతాః. 28

పుణ్యకార్య తత్పరులగు ఏ జనులయొక్క పాపము నశించిపోయినదో, అట్టివారు (సుఖదుఃఖాది) ద్వంద్వరూపమగు అజ్ఞానమునుండి విడువబడినవారై దృఢవ్రతులై నన్ను సేవించుచున్నారు.

జరామరణ మోక్షాయ
మామాశ్రిత్య యతన్తి యే,
తే బ్రహ్మ తద్విదుః కృత్స్న
మధ్యాత్మం కర్మ చాఖిలమ్. 29

ఎవరు వార్ధక్యమును, మరణమును (సంసార దుఃఖమును) పోగొట్టుకొనుటకొఱకు నన్నాశ్రయించి ప్రయత్నము చేయుచున్నారో, వారు సమస్త ప్రత్యగాత్మ స్వరూపమున్ను, సకల కర్మమున్ను ఆ బ్రహ్మమే యని తెలిసికొందురు.



సాధిభూతాధిదైవం మాం
సాధియజ్ఞం చ యే విదుః,
ప్రయాణకాలేఽపి చ మాం
తే విదుర్యుక్తచేతసః. 30

అధిభూత, అధిదైవ, అధియజ్ఞములతోగూడి యున్న నన్నెవరు తెలిసికొందురో వారు దేహ వియోగ కాలమందును (దైవమందు) నిలుకడగల మనస్సుకలవారై (మనోనిగ్రహముకలవారై) నన్నెఱుగగలరు.

ఇతి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు
బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే
శ్రీకృష్ణార్జున సంవాదే
విజ్ఞానయోగో నామ
సప్తమోఽధ్యాయః

---

ఓమ్

శ్రీకృష్ణపరబ్రహ్మణే నమః

# శ్రీ భగవద్గీత

## అథ అష్టమోఽధ్యాయః

### అక్షరపరబ్రహ్మయోగః

**అర్జున ఉవాచ :—**

కిం తద్బ్రహ్మ కిమధ్యాత్మం
కిం కర్మ పురుషోత్తమ,
అధిభూతం చ కిం ప్రోక్త
మధిదైవం కిముచ్యతే. 1

అధియజ్ఞః కథం కోఽత్ర
దేహేఽస్మిన్మధుసూదన,
ప్రయాణకాలే చ కథం
జ్ఞేయోఽసి నియతాత్మభిః. 2



అర్జును డడిగెను—

పురుషశ్రేష్ఠుడవగు ఓ కృష్ణా! ఆ బ్రహ్మమేది? అధ్యాత్మ మెయ్యది? కర్మమనగా నేమి? అధిభూత మని యేది చెప్పబడినది? అధిదైవమని దేనిని చెప్పు దురు? ఈ దేహమందు అధియజ్ఞుడెవడు? అతనిని తెలిసికొనుట ఎట్లు? ప్రాణప్రయాణ సమయమందు నియమితచిత్తులచే నీవెట్లు తెలిసికొనబడ గలవు?

**శ్రీ భగవానువాచ :—**

అక్షరం బ్రహ్మ పరమం
స్వభావోఽధ్యాత్మ ముచ్యతే,
భూతభావోద్భవకరో
విసర్గః కర్మ సంజ్ఞితః. 3

శ్రీ భగవానుడు చెప్పుచున్నాడు—ఓ అర్జునా! సర్వోత్తమమైన (నిరతిశయమైన) నాశరహితమైనదే బ్రహ్మమనబడును. ప్రత్యగాత్మభావము అధ్యాత్మ మని చెప్పబడును. ప్రాణికోట్లకు ఉత్పత్తిని గలుగ జేయు (యజ్ఞాది రూపమగు) త్యాగపూర్వకమైన క్రియ కర్మమను పేరు కలిగియున్నది.

అధిభూతం క్షరో భావః
పురుషశ్చాధిదైవతమ్,
అధియజ్ఞోఽహమేవాత్ర
దేహే దేహభృతాం వర. 4

దేహధారులలో శ్రేష్ఠుడవగు ఓ అర్జునా! నశించు పదార్థము అధిభూతమనబడును. విరాట్పురుషుడు లేక హిరణ్యగర్భుడే అధిదైవతమనబడును. ఈ దేహమందు నేనే (పరమాత్మయే) అధియజ్ఞుడనబడును.

అన్తకాలే చ మామేవ
స్మరన్ముక్త్వా కలేబరమ్,
యః ప్రయాతి స మద్భావం
యాతి నాస్త్యత్ర సంశయః. 5

ఎవడు మరణకాలమందుగూడ నన్నే స్మరించుచు శరీరము విడిచిపోవుచున్నాడో, అతడు నాస్వరూపమును పొందుచున్నాడు. ఇట సంశయమేమియును లేదు.



యం యం వాఽపి స్మరన్ భావం
త్యజత్యన్తే కలేబరమ్,
తం తమేవైతి కౌన్తేయ
సదా తద్భావభావితః. 6

అర్జునా! ఎవడు మరణకాలమున ఏయే భావమును (లేక రూపమును) చింతించుచు దేహమును వీడునో వాడట్టి భావముయొక్క స్మరణచే గలిగిన సంస్కారము గలిగియుండుట వలన ఆయా రూపమునే పొందుచున్నాడు.

తస్మాత్సర్వేషు కాలేషు
మామనుస్మర యుధ్య చ,
మయ్యర్పితమనోబుద్ధి
ర్మామేవైష్యస్యసంశయః. 7

కాబట్టి ఎల్లకాలములందును నన్నుస్మరించుచు (నీస్వధర్మమగు) యుద్ధమును గూడ చేయుము. ఈ ప్రకారముగ నాయందు సమర్పింపబడిన మనో

బుద్ధులు గలవాడవైనచో నీవు నన్నే పొంద గలవు. ఇట సంశయము లేదు.

అభ్యాసయోగయుక్తేన
చేతసా నాన్యగామినా,
పరమం పురుషం దివ్యం
యాతి పార్థానుచిన్తయన్. 8

ఓ అర్జునా! అభ్యాసమను యోగముతో గూడినదియు, ఇతర విషయములపైకి పోనిదియునగు మనస్సుచేత, అప్రాకృతుడైన (లేక, స్వయంప్రకాశస్వరూపుడైన) సర్వోత్తముడగు పరమపురుషుని మరల మరల స్మరించుచు మనుజుడు అతనినే పొందుచున్నాడు.

కవిం పురాణ మనుశాసితార
మణోరణీయాంస మనుస్మరేద్యః,
సర్వస్య ధాతార మచిన్త్య రూప
మాదిత్యవర్ణం తమసః పరస్తాత్ .9



ప్రయాణకాలే మనసాఽచలేన
భక్త్యా యుక్తో యోగబలేన చైవ,
భ్రువోర్మధ్యే ప్రాణ మావేశ్య సమ్యక్
స తం పరం పురుషముపైతి దివ్యమ్

ఎవడు భక్తితో గూడుకొనినవాడై, అంత్యకాలమునందు యోగబలముచే (ధ్యానాభ్యాససంస్కారబలముచే) ప్రాణవాయువును భ్రూమధ్యమున (కనుబొమ్మల నడుమ) బాగుగ నిలిపి, ఆపిదప సర్వజ్ఞుడును, పురాణపురుషుడును, జగన్నియామకుడును, అణువుకంటెను మిగుల సూక్ష్మమైనవాడును, సకల ప్రపంచమునకు ఆధారభూతుడును(సంరక్షకుడును), చింతింపనలవికానిస్వరూపముగలవాడును, సూర్యుని కాంతివంటి కాంతిగలవాడును (స్వయంప్రకాశస్వరూపుడును), అజ్ఞానాంధకారమునకు ఆవలనుండువాడునగు పరమాత్మను నిశ్చలమనస్సుచే ఎడతెగక చింతించునో, ఆతడు దివ్యస్వరూపుడైన సర్వోత్తముడగు ఆ పరమాత్మనే పొందుచున్నాడు.

యదక్షరం వేదవిదో వదన్తి
విశన్తి యద్యతయో వీతరాగాః,
యదిచ్ఛన్తో బ్రహ్మచర్యం చరన్తి
తత్తేపదం సంగ్రహేణ ప్రవక్ష్యే. 11

వేదవేత్తలు, దేనిని నాశరహితమైన దానినిగ చెప్పుచున్నారో, రాగరహితులగు (కోరికలు నశించిన) యత్నశీలురు(జితేంద్రియులు) ఎద్దానియందు ప్రవేశించుచున్నారో, దేనిని అభిలషించుచు జనులు బ్రహ్మచర్యము ననుష్ఠించుచున్నారో, అట్టి (పరమాత్మ) పదమును గూర్చి నీకు సంక్షేపముగ జెప్పెదను.

సర్వద్వారాణి సంయమ్య
మనో హృది నిరుధ్య చ,
మూర్ధ్న్యాధాయాత్మనః ప్రాణ
మాస్థితో యోగధారణామ్. 12



ఓమిత్యేకాక్షరం బ్రహ్మ
వ్యాహరన్మామనుస్మరన్,
యః ప్రయాతి త్యజన్దేహం
స యాతి పరమాం గతిమ్. 13

ఎవడు ఇంద్రియద్వారములన్నిటిని బాగుగ అరికట్టి మనస్సును హృదయమందు (ఆత్మయందు) లెస్సగా స్థాపించి, శిరస్సునందు (బ్రహ్మరంధ్రమందు) ప్రాణవాయువును ఉంచి; ఆత్మను గూర్చిన ఏకాగ్రచింతనము (యోగధారణ) గలవాడై పరబ్రహ్మమునకు వాచకమైన 'ఓమ్' అను ఒక అక్షరమును ఉచ్చరించుచు నన్ను ఎడతెగక చింతించుచు శరీరమును వదలునో అతడు సర్వోత్తమ స్థానమును (మోక్షమును) బొందుచున్నాడు.

అనన్యచేతాః సతతం
యో మాం స్మరతి నిత్యశః,
తస్యాహం సులభః పార్థ
నిత్యయుక్తస్య యోగినః. 14

ఓ అర్జునా! ఎవడు అనన్యచిత్తుడై నన్నుగూర్చి ప్రతిదినము నిరంతరము స్మరించుచుండునో, అట్టి నిరంతర ధ్యానపరునకు నేను సులభముగ పొందబడు వాడనై యున్నాను.

మామువేత్య పునర్జన్మ
దుఃఖాలయమశాశ్వతమ్,
నాప్నువన్తి మహాత్మాన
స్సంసిద్ధిం పరమాం గతాః. 15

సర్వోత్తమమైన మోక్షమును పొందిన మహాత్ములు నన్ను పొందినవారై మరల దుఃఖనిలయమై, అనిత్యమైనట్టి - జన్మను ఎన్నటికిని పొందనేరరు.

ఆబ్రహ్మభువనాల్లోకాః
పునరావర్తినోఽర్జున
మామువేత్య తు కౌన్తేయ
పునర్జన్మ న విద్యతే. 16



ఓ అర్జునా! బ్రహ్మలోకము వఱకుగల లోకము లన్నియు తిరిగి వచ్చెడి స్వభావముకలవి (అనగా వానిని పొందినవారు మరలజన్మమెత్తవలసియేవచ్చుదురు.) నన్ను పొందినవారికో మరల జన్మమే లేదు.

సహస్రయుగపర్యన్త
మహర్యద్బ్రహ్మణో విదుః,
రాత్రిం యుగసహస్రాన్తాం
తేఽహోరాత్రవిదో జనాః. 17

ఏ జనులు బ్రహ్మదేవునియొక్క పగటిని వేయి యుగముల పరిమితిగల దానిగను, అట్లే రాత్రిని వేయియుగముల పరిమితిగలదానిగను ఎఱుంగుదురో అట్టి వారు రాత్రింబగళ్ళయొక్క తత్త్వమును బాగుగ నెఱింగినవారగుదురు.

అవ్యక్తాద్వ్యక్తయః సర్వాః
ప్రభవన్త్యహరాగమే,

రాత్ర్యాగమే ప్రలీయన్తే
తత్రైవావ్యక్తసంజ్ఞకే. **18**

బ్రహ్మదేవునిపగలు ప్రారంభమగునపుడు అవ్యక్తము(ప్రకృతి)నుండి సమస్తచరాచరవస్తువులు పుట్టుచున్నవి. మరల రాత్రి ప్రారంభమగునపుడు ఆ అవ్యక్తమునందే లీనమగుచున్నవి.

భూతగ్రామస్స ఏవాయం
భూత్వాభూత్వా ప్రలీయతే,
రాత్ర్యాగమేఽవశః పార్థ
ప్రభవత్యహరాగమే. **19**

ఓ అర్జునా! ఆ యీ(పూర్వకల్పమందలి)ప్రాణిసమూహమే కర్మపరాధీనమై పుట్టిపుట్టి (బ్రహ్మదేవుని)రాత్రియొక్క ప్రారంభమున(మరల) విలయమొందుచున్నది. తిరిగి(బ్రహ్మదేవుని)పగటియొక్క ప్రారంభమున పుట్టుచున్నది.



పరస్తస్మాత్తు భావోఽన్యో
ఽవ్యక్తోఽవ్యక్తాత్సనాతనః,
యస్స సర్వేషు భూతేషు
నశ్యత్సు న వినశ్యతి. **20**

ఏ పరమాత్మవస్తువు ఆ అవ్యక్తము(ప్రకృతి) కంటె వేఱైనదియు, ఉత్తమమైనదియు, ఇంద్రియములకు వ్యక్తముకానిదియు, పురాతనమైనదియు నగునో, అయ్యది సమస్త ప్రాణికోట్లు నశించినను నశించకయే యుండును.

అవ్యక్తోఽక్షర ఇత్యుక్త
స్తమాహుః పరమాం గతిమ్,
యం ప్రాప్య న నివర్తన్తే
తద్ధామ పరమం మమ. **21**

ఏ పరమాత్మ(ఇంద్రియములకు)అగోచరుడనియు, నాశరహితుడనియు చెప్పబడెనో, ఆతనినే సర్వోత్తమమైన ప్రాప్యస్థానముగా (వేదవేత్తలు) చెప్పు

చున్నారు. దేనిని పొందినచో, మరల (వెనుకకు తిరిగి ఈ సంసారమున) జన్మింపరో, అదియే నాయొక్క శ్రేష్ఠమైన స్థానము (స్వరూపము) అయియున్నది.

పురుషః స పరః పార్థ
భక్త్యా లభ్యస్త్వనన్యయా,
యస్యాన్తః స్థాని భూతాని
యేన సర్వమిదం తతమ్. **22**

ఓ అర్జునా! ఎవనియందీ ప్రాణికోట్లన్నియు నివసించుచున్నవో, ఎవనిచే ఈ సమస్త జగత్తును వ్యాపింపబడియున్నదో, అట్టి పరమ పురుషుడు (పరమాత్మ) అనన్యమగు (అచంచలమగు) భక్తిచేతనే పొందబడగలడు.

యత్ర కాలే త్వనావృత్తి
మావృత్తిం చైవ యోగినః,
ప్రయాతా యాన్తి తం కాలం
వక్ష్యామి భరతర్షభ. **23**



భరతకుల శ్రేష్ఠుడవగు ఓ అర్జునా! ఏ కాలమందు (లేక ఏ మార్గమందు శరీరమును విడిచి) వెడలిన యోగులు మరల తిరిగి రారో (జన్మమునొందరో) ఏ కాలమందు వెడలిన యోగులు మరల తిరిగి వచ్చుదురో (జన్మించుదురో), ఆయా కాల విశేషములను చెప్పుచున్నాను. (వినుము)-

అగ్నిర్జ్యోతిరహశ్శుక్ల
షణ్మాసా ఉత్తరాయణమ్,
తత్ర ప్రయాతా గచ్ఛన్తి
బ్రహ్మ బ్రహ్మవిదో జనాః. **24**

అగ్ని, ప్రకాశము, పగలు, శుక్లపక్షము, ఆఱు నెలలుగ ఉత్తరాయణము ఏ మార్గమందుగలవో, ఆ మార్గమందు వెడలిన బ్రహ్మవేత్తలగు జనులు బ్రహ్మమునే పొందుచున్నారు.

ధూమో రాత్రిస్తథా కృష్ణ
షణ్మాసా దక్షిణాయనమ్,

తత్ర చాన్ద్రమసం జ్యోతి
ర్యోగీ ప్రాప్య నివర్తతే. 25

పొగ, రాత్రి, కృష్ణపక్షము, ఆఱునెలలుగ దక్షిణాయనము ఏమార్గమునగలవో, ఆమార్గమున (వెడలిన) సకామకర్మయోగి చంద్రసంబంధమైన ప్రకాశమునుబొంది మఱల వెనుకకువచ్చుచున్నాడు (తిరిగి జన్మించుచున్నాడు).

శుక్లకృష్ణే గతీహ్యేతే
జగతః శాశ్వతే మతే,
ఏకయా యాత్యనావృత్తి
మన్యయాఽఽవర్తతే పునః. 26

ఈశుక్లకృష్ణ మార్గములు రెండును జగత్తునందు శాశ్వతములుగనుండునవిగ తలంపబడుచున్నవి. అందు మొదటిదానిచే జన్మరాహిత్యమును, రెండవదానిచే మరల జన్మమును యోగి పొందుచున్నాడు.



నైతే సృతీ పార్థ జాన
న్యోగీ ముహ్యతి కశ్చన,
తస్మాత్సర్వేషు కాలేషు
యోగయుక్తో భవార్జున. 27

ఓ అర్జునా ! ఈ రెండుమార్గములను ఎఱుగునట్టి యోగి యెవడును ఇక మోహమును బొందడు కాబట్టి నీ వెల్లకాలమందును (దైవ) యోగయుక్తుడవు కమ్ము.

వేదేషు యజ్ఞేషు తపఃసు చైవ
దానేషు యత్పుణ్యఫలం ప్రదిష్టమ్
అత్యేతి తత్సర్వమిదం విదిత్వా
యోగీ పరం స్థానముపైతి చాద్యమ్

యోగియైనవాడు దీనిని (ఈఅధ్యాయమున చెప్పబడిన అక్షర పరబ్రహ్మతత్త్వము మున్నగు వానిని) ఎఱిగి వేదములందును, యజ్ఞములందును, దానములందును, తపస్సులందును, ఏ పుణ్యఫలము

చెప్పబడి యున్నదో, దానినంతను అతిక్రమించు చున్నాడు. (దానిని మించిన పుణ్యఫలమును బొందు చున్నాడు.) మఱియు అనాదియగు సర్వోత్తమ (బ్రహ్మ) స్థానమును బొందు చున్నాడు.

ఇతి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు
బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే
శ్రీకృష్ణార్జున సంవాదే
అక్షర పరబ్రహ్మయోగో నామ
అష్టమోఽధ్యాయః.

---

ఓమ్

శ్రీకృష్ణపరబ్రహ్మణే నమః

# శ్రీ భగవద్గీత

## అథ నవమోఽధ్యాయః

### రాజవిద్యారాజగుహ్యయోగః

శ్రీ భగవానువాచ:—

ఇదం తు తే గుహ్యతమం
ప్రవక్ష్యామ్యనసూయవే,
జ్ఞానం విజ్ఞానసహితం
యజ్జ్ఞాత్వా మోక్ష్యసేఽశుభాత్. 1

శ్రీ భగవంతుడు చెప్పెను:— ఓ అర్జునా! దేనిని తెలిసికొనినచో అశుభరూపమగు ఈసంసార బంధమునుండి నీవు విడివడుదువో, అట్టి అతిరహస్య మైన, అనుభవజ్ఞానసహితమైన ఈ బ్రహ్మజ్ఞాన మును అసూయలేనివాడవగు నీకు లెస్సగా చెప్పు చున్నాను (వినుము).

రాజవిద్యా రాజగుహ్యం
పవిత్రమిదముత్తమమ్,
ప్రత్యక్షావగమం ధర్మ్యం
సుసుఖం కర్తుమవ్యయమ్. 2

ఈ బ్రహ్మజ్ఞానము విద్యలలోకెల్ల శ్రేష్ఠమైన దియు, రహస్యములలోకెల్ల అతిరహస్యమైనదియు పరోక్షోత్కృష్టమైనదియు పవిత్రమైనదియు, ప్రత్యక్షముగ తెలియదగినదియు, ధర్మయుక్తమైనదియు, అనుష్ఠించుటకు మిగుల సులభమైనదియు, నాశరహితమైనదియు, అయియున్నది.

అశ్రద్దధానాః పురుషా
ధర్మస్యాస్య పరన్తప,
అప్రాప్య మాం నివర్తన్తే
మృత్యుసంసారవర్త్మని. 3

ఓ అర్జునా! ఈ(ఆత్మజ్ఞానమును) ధర్మమునందు



శ్రద్ధలేనట్టి మనుజులు నన్ను పొందనివారై మృత్యురూపమైన సంసారమార్గమునం దేమఱలుచున్నారు. (తిరుగుచున్నారు. లేక నిక్కముగ వర్తించుచున్నారు.

మయా తతమిదం సర్వం
జగదవ్యక్తమూర్తినా,
మత్స్థాని సర్వభూతాని
న చాహం తేష్వవస్థితః. 4

ఈసమస్తప్రపంచము అవ్యక్తరూపుడనగు నాచే వ్యాపింపబడి యున్నది. సమస్త ప్రాణికోట్లు నాయందున్నవి. నేను వానియందుండుటలేదు (నాకవి ఆధారములు కావు.)

న చ మత్స్థాని భూతాని
పశ్య మే యోగమైశ్వరమ్,
భూతభృన్న చ భూతస్థో
మమాత్మా భూతభావనః. 5

ప్రాణికోట్లు నాయందుండునని యుకావు. ఈశ్వర సంబంధమగు నా యీ యోగమహిమను జూడుము. నా యాత్మ (స్వరూపము) ప్రాణికోట్ల నుత్పన్న మొనర్చునదియు, భరించునదియునైనను ఆ ప్రాణుల యందుండుట లేదు. (వాని నాధారముగ జేసికొని యుండునది కాదు.)

యథాఽఽకాశస్థితో నిత్యం
వాయుస్సర్వత్రగో మహాన్,
తథా సర్వాణి భూతాని
మత్స్థానీత్యుపధారయ. 6

ఏ ప్రకారముగ అంతటను సంచరించునదియు, గొప్పదియునగు వాయువు ఎల్లప్పుడును ఆకాశమునం దున్నదో, ఆ ప్రకారమే సమస్త ప్రాణికోట్లును నా యందున్నవని తెలిసికొనుము.

సర్వభూతాని కౌన్తేయ
ప్రకృతిం యాన్తి మామికామ్,



కల్పక్షయే పునస్తాని
కల్పాదౌ విసృజామ్యహామ్. 7

అర్జునా! సమస్త ప్రాణికోట్లు ప్రళయకాలమున నా ప్రకృతిని (మాయను) జేరి అందు అణగి యుండును. తిరిగి సృష్టికాలమున వానిని నేను సృజించుచుండును.

ప్రకృతిం స్వామవష్టభ్య
విసృజామి పునః పునః,
భూతగ్రామమిమం కృత్స్న
మవశం ప్రకృతేర్వశాత్. 8

ప్రకృతికి (మాయకు, లేక స్వకీయ కర్మకు) అధీనమైయుండుట వలన అస్వతంత్రమైనట్టి ఈ సమస్త ప్రాణిసముదాయమును నేను స్వకీయ ప్రకృతిని అవలంబించి మఱల మఱల సృష్టించుచున్నాను.

న చ మాం తాని కర్మాణి
నిబధ్నన్తి ధనంజయ,

ఉదాసీనవదాసీన
మసక్తం తేషు కర్మసు. **9**

ఓ అర్జునా! (ఆప్రకారము జీవులను సృష్టించిన వాడనైనను) ఆ సృష్ట్యాది కర్మలయందు తగులు కొననివాడనై సాక్షీభూతుడుగ నుండునట్టి నన్ను ఆ కర్మలెవ్వియు బంధింపనేరవు.

మయాఽధ్యక్షేణ ప్రకృతిః
సూయతే సచరాచరమ్,
హేతునానేన కౌన్తేయ
జగద్విపరివర్తతే. **10**

ఓ అర్జునా! అధ్యక్షుడనై (సాక్షిమాత్రుడనై) యున్న నాచేత ప్రకృతి చరాచర ప్రపంచమునంతను సృజించుచున్నది. ఈ కారణముచేతనే జగత్తు పరివర్తించుచున్నది.

అవజానన్తి మాం మూఢా
మానుషీం తనుమాశ్రితమ్,



పరం భావమజానన్తో
మమ భూతమహేశ్వరమ్. **11**

నాయొక్క పరతత్త్వమును ఎఱుగని అవివేకులు సర్వభూత మహేశ్వరుడను (లోకసంరక్షణార్థము) మనుష్య దేహమును (ఆశ్రయించినవాడను నగు) నన్ను అవమానించుచున్నారు. (అలక్ష్యము చేయుచున్నారు.)

మోఘాశా మోఘకర్మాణో
మోఘజ్ఞానా విచేతసః,
రాక్షసీమాసురీం చైవ
ప్రకృతిం మోహినీం శ్రితాః. **12**

(అట్టివారు) వ్యర్థములైన ఆశలు గలవారును, వ్యర్థములైన కర్మలు గలవారును, వ్యర్థమైన జ్ఞానము గలవారును బుద్ధిహీనులును (అగుచు) రాక్షస సంబంధమైనదియు, అసుర సంబంధమైనదియు నగు స్వభావమునే ఆశ్రయించుచున్నారు.

మహాత్మానస్తు మాం పార్థ
దైవీం ప్రకృతిమాశ్రితాః,
భజన్త్యనన్యమనసో
జ్ఞాత్వా భూతాదిమవ్యయమ్. 13

ఓ అర్జునా! మహాత్ములైతే దైవీప్రకృతిని (దేవ సంబంధమైన స్వభావమును) ఆశ్రయించినవారలై నన్ను సమస్త ప్రాణులకును ఆదికారణునిగను, నాశరహితునిగను ఎఱిఁగి వేఱొకదానియందు మనస్సునుంచని వారలై నన్నే సేవించుచున్నారు.

సతతం కీర్తయన్తో మాం
యతన్తశ్చ దృఢవ్రతాః,
నమస్యన్తశ్చ మాం భక్త్యా
నిత్యయుక్తా ఉపాసతే. 14

వారు(పైనదెల్పిన దైవీప్రకృతిగలవారు)ఎల్లప్పుడు నన్నుగూర్చి కీర్తించుచు, దృఢవ్రతనిష్ఠులై ప్రయ



త్నించుచు, భక్తితో నమస్కరించుచు, సదా నాయందుచిత్తముంచినవారలై నన్ను సేవించుచున్నారు.

జ్ఞానయజ్ఞేన చాప్యన్యే
యజన్తో మాముపాసతే,
ఏకత్వేన పృథక్త్వేన
బహుధా విశ్వతో ముఖమ్. 15

మఱికొందఱు జ్ఞానయజ్ఞముచే పూజించుచున్నవారై (తానే బ్రహ్మమను) అద్వైత భావముతోను ఇంక కొందఱు(బ్రహ్మము వివిధ దేవతాదిరూపమున నున్నది. ఆ దేవతలలో నేనొకనిని సేవించుచున్నాను) ద్వైతభావముతోను ఇట్లనేకవిధములుగ (లేక వివిధరూపముల) నన్ను ఉపాసించుచున్నారు.

అహం క్రతురహం యజ్ఞః
స్వధాహమహమౌషధమ్,
మన్త్రోఽహమహమేవాజ్య
మహమగ్నిరహం హుతమ్. 16

(అగ్నిష్టోమాదిరూప) క్రతువు నేనే, యజ్ఞము నేనే, పితృదేవతలకిచ్చు అన్నము నేనే, ఔషధము నేనే, మంత్రము నేనే. హవిస్సు నేనే. అగ్ని నేనే, హోమకర్మమున్ను నేనే.

పితాఽహమస్య జగతో
మాతా ధాతా పితామహః,
వేద్యం పవిత్ర మోంకార
ఋక్సామయజురేవచ. **17**

ఈ జగత్తునకు నేనే తండ్రిని, తల్లిని, సంరక్షకుడను (లేక, కర్మఫలప్రదాతను) తాతను, మఱియు తెలిసికొనదగిన వస్తువును, పావనపదార్థమును, ఓంకారమును ఋగ్వేద, యజుర్వేద, సామవేదములును నేనే అయియున్నాను.

గతిర్భర్తా ప్రభుస్సాక్షీ
నివాసశ్శరణం సుహృత్,



ప్రభవః ప్రలయః స్థానం
నిధానం బీజమవ్యయమ్. **18**

పరమలక్ష్యమును, భరించువాడను, ప్రభువును, సాక్షియు, ప్రాణులనివాసమును, శరణమొందదగినవాడును, హితమొనర్చువాడును, సృష్టి స్థితి లయకర్తయు, నిక్షేపమును, నాశరహితమైన బీజమును (మూలకారణమును) నేనే అయియున్నాను.

తపామ్యహమహం వర్షం
నిగృహ్ణామ్యుత్సృజామి చ,
అమృతం చైవ మృత్యుశ్చ
సదసచ్చాహమర్జున. **19**

ఓ అర్జునా! నేను (సూర్యకిరణములచే) తపింపజేయుచున్నాను. మఱియు వర్షమును కురిపించుచున్నాను. వర్షమును నిలుపుదలచేయుచున్నాను. మరణరాహిత్యమున్ను (మోక్షమున్ను) మరణమున్ను నేనే. అట్లేసద్వస్తువున్ను, అసద్వస్తువున్ను నేనే(అయియున్నాను.)

త్రైవిద్యా మాం సోమపాః
పూతపాపా
యజ్ఞైరిష్ట్వా స్వర్గతిం ప్రార్థయన్తే
తే పుణ్యమాసాద్య సురేన్ద్రలోక
మశ్నన్తి దివ్యాన్దివి దేవభోగాన్.

మూడు వేదముల నధ్యయనము చేసినవారును, కర్మకాండనుసకామభావముతో నాచరించువారును, సోమపానము గావించినవారును, పాపకల్మషము తొలగినవారునగు మనుజులు యజ్ఞములచే నన్ను పూజించి స్వర్గముకొఱకై ప్రార్థించుచున్నారు. వారు (మరణానంతరము) పుణ్యఫలమగు దేవేంద్రలోకమును బొంది, అట్టి స్వర్గమందు దివ్యములగు దేవభోగముల ననుభవించుచున్నారు.

తే తం భుక్త్వా స్వర్గలోకం విశాలం
క్షీణే పుణ్యే మర్త్యలోకం విశన్తి



ఏవం త్రయీధర్మమనుప్రపన్నా
గతాగతం కామకామా లభన్తే. 21

వారు (అట్టి స్వర్గాభిలాషులు) విశాలమగుస్వర్గలోకము ననుభవించి పుణ్యము క్షయింప తిరిగి మనుష్యలోకమున జన్మించుచున్నారు. ఈప్రకారముగ (సకామముగ) వేదోక్త కర్మమును అనుష్ఠించునట్టి ఆ భోగాభిలాషులు రాకడపోకడలను (జననమరణములను) పొందుచున్నారు.

అనన్యాశ్చిన్తయన్తో మాం
యే జనాః పర్యుపాసతే,
తేషాం నిత్యాభియుక్తానాం
యోగక్షేమం వహామ్యహమ్.

ఎవరు ఇతరభావములు లేనివారై నన్నుగూర్చి చింతించుచు ఎడతెగక ధ్యానించుచున్నారో, ఎల్లప్పుడు నాయందే నిష్ఠగలిగియుండునట్టి వారియొక్క యోగక్షేమములను నేను వహించుచున్నాను.

యేఽప్యన్యదేవతాభక్తా
యజన్తే శ్రద్ధయాన్వితాః,
తేఽపి మామేవ కౌన్తేయ
యజన్త్యవిధిపూర్వకమ్. **23**

ఓ అర్జునా! ఎవరు ఇతర దేవతలయెడల భక్తిగల వారై శ్రద్ధతోకూడి వారి నారాధించుచున్నారో, వారున్ను నన్నే అవిధి పూర్వకముగ (క్రమము తప్పి) ఆరాధించుచున్నవారగుదురు.

అహం హి సర్వయజ్ఞానాం
భోక్తా చ ప్రభురేవ చ,
న తు మామభిజానన్తి
తత్త్వేనాతశ్చ్యవన్తి తే. **24**

ఏలయనగా సమస్తయజ్ఞములకుభోక్తను, ప్రభువు (యజమానుడు)ను నేనేఅయియున్నాను. అట్టినన్ను వారు యథార్థముగ తెలిసికొనుటలేదు. ఇందువలన జారిపోవుచున్నారు. (పునర్జన్మను బొందుచున్నారు).



యాన్తి దేవవ్రతా దేవాన్
పితౄన్ యాన్తి పితృవ్రతాః,
భూతాని యాన్తి భూతేజ్యా
యాన్తి మద్యాజినోఽపి మామ్. **25**

దేవతల నారాధించువారు దేవతలను, పితృదేవతల నారాధించువారు పితృదేవతలను, భూతముల నారాధించువారు భూతములను, నన్నారాధించువారు నన్ను పొందుచున్నారు.

పత్రం పుష్పం ఫలం తోయం
యో మే భక్త్యా ప్రయచ్ఛతి,
తదహం భక్త్యుపహృత
మశ్నామి ప్రయతాత్మనః. **26**

ఎవడు నాకు భక్తితో ఆకునుగాని, పువ్వునుగాని, పండునుగాని, జలమునుగాని సమర్పించుచున్నాడో, అట్టి పరిశుద్ధాంతఃకరణునియొక్క (లేక, పరమార్థ యత్నశీలునియొక్క) భక్తిపూర్వకముగ

నాసంగబడిన ఆ పత్రపుష్పాదులను నేను ప్రీతితో ఆరగించుచున్నాను (అనుభవించుచున్నాను).

యత్కరోషి యదశ్నాసి
యజ్జుహోషి దదాసి యత్,
యత్తపస్యసి కౌన్తేయ
తత్కురుష్వ మదర్పణమ్. 27

ఓ అర్జునా ! నీవేదిచేసినను, తినినను, హోమ మొనర్చినను, దానముచేసినను, తపస్సు చేసినను, దానిని నాకర్పింపుము.

శుభాశుభఫలై రేవం
మోక్ష్యసే కర్మబన్ధనైః
సన్న్యాసయోగయుక్తాత్మా
విముక్తో మాముపైష్యసి. 28

ఈప్రకారముగ 'కర్మసమర్పణ' యోగములో గూడినవాడవై పుణ్యపాపములు ఫలములుగాగల



కర్మ బంధములనుండి నీవు విడువబడగలవు. అట్లు విడువబడిన వాడవై నన్ను పొందగలవు.

సమోఽహం సర్వభూతేషు
న మే ద్వేష్యోఽస్తి న ప్రియః,
యే భజన్తి తు మాం భక్త్యా
మయి తే తేషు చాప్యహమ్. 29

నేను సమస్తప్రాణులందును సమముగా నుండు వాడను. నాకొకడు ద్వేషింపదగినవాడుగాని, మఱియొకడు ఇష్టుడుగాని ఎవడును లేడు. ఎవరు నన్ను భక్తితో సేవించుదురో వారు నాయందును, నేను వారియందును ఉందును.

అపి చేత్సుదురాచారో
భజతే మామనన్యభాక్,
సాధురేవ స మన్తవ్య
సమ్యగ్వ్యవసితో హి సః. 30

మిక్కిలి దురాచారముగలవాడైనప్పటికిని అనన్య భక్తికలవాడై (ఇతరమగు దేనియందు భక్తినుంచక) నన్ను భజించునేని, అతడు సత్పురుషుడనియే (శ్రేష్ఠుడనియే) తలంపబడదగినవాడు. ఏలయనగా అతడు స్థిరమైన (ఉత్తమ) మనోనిశ్చయము గలవాడు.

క్షిప్రం భవతి ధర్మాత్మా
శశ్వచ్ఛాన్తిం నిగచ్ఛతి,
కౌన్తేయ ప్రతిజానీహి
న మే భక్తః ప్రణశ్యతి. 31

అతడు (నన్నాశ్రయించిన పాపాత్ముడు) శీఘ్రముగ ధర్మబుద్ధి గలవాడగుచున్నాడు. మఱియు శాశ్వతమైన శాంతిని పొందుచున్నాడు. ఓ అర్జునా 'నా భక్తుడు చెడడు' అని ప్రతిజ్ఞ చేయుము !

మాం హి పార్థ వ్యపాశ్రిత్య
యేఽపి స్యుః పాపయోనయః,



స్త్రియో వైశ్యా స్తథా శూద్రా
స్తేఽపి యాన్తి పరాంగతిమ్. 32

ఓ అర్జునా! ఎవరు పాపజన్మము (నీచజన్మము) గలవారైయుందురో, వారును, స్త్రీలును, వైశ్యులును, అట్లే శూద్రులును నన్నాశ్రయించి సర్వోత్తమ పదవిని (మోక్షమును) నిశ్చయముగ పొందుచున్నారు.

కిం పునర్బ్రాహ్మణాః పుణ్యా
భక్తా రాజర్షయ స్తథా,
అనిత్యమసుఖం లోక
మిమం ప్రాప్య భజస్వ మామ్. 33

ఇక పుణ్యాత్ములగు బ్రాహ్మణుల విషయమును, భక్తులగు రాజర్షుల విషయమునను మఱల చెప్పనేల ? (భగవదాశ్రయముచే వారున్ను తప్పక ముక్తినొందుదురని భావము). కావున అశాశ్వతమైనట్టి ఈలోకమును పొందియున్న నీవు నన్ను భజింపుము.

మన్మనా భవ మద్భక్తో
మద్యాజీ మాం నమస్కురు,
మా మేవైష్యసి యుక్త్వైవ
మాత్మానం మత్పరాయణః. 34

నాయందే మనస్సుగలవాడవును, నాభక్తుడవును, నన్నే పూజించువాడవును అగుము. నన్నే నమస్కరింపుము. ఈప్రకారముగ చిత్తమును నాయందే నిలిపి నన్నే పరమగతిగ నెన్నుకొనిన వాడవై తుదకు నన్నే పొందగలవు.

ఇతి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు
బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే
శ్రీకృష్ణార్జున సంవాదే
రాజవిద్యా రాజగుహ్యయోగో నామ
నవమోఽధ్యాయః.

---

ఓం

శ్రీకృష్ణపరబ్రహ్మణే నమః

# శ్రీ భగవద్గీత

## అథ దశమోఽధ్యాయః

### విభూతి యోగః

శ్రీ భగవానువాచ:—

భూయ ఏవ మహాబాహో
శ్రుణు మే పరమం వచః.
యత్తేఽహం ప్రీయమాణాయ
వక్ష్యామి హితకామ్యయా., 1

శ్రీ భగవానుడు చెప్పెను—

గొప్ప బాహువులుకల ఓఅర్జునా! (నామాటలు విని) సంతసించుచున్న నీకు హితమును గలుగజేయు నుద్దేశ్యముతో మరల ఏశ్రేష్ఠమగువాక్యమును నేను చెప్పబోవుచున్నానో, దానిని వినుము.

న మే విదుః సురగణాః
ప్రభవం న మహర్షయః,
అహమాదిర్హి దేవానాం
మహర్షీణాం చ సర్వశః. **2**

నాయొక్క ఉత్పత్తిని (అవతార రహస్యమును, లేక, ప్రభావమును) దేవగణము లెఱుఁగవు. మహర్షులున్ను ఎఱుఁగరు. (ఏలయనిన) నేను ఆ దేవతలకును, మహర్షులకును సర్వవిధముల మొదటివాడను (కారణ భూతుఁడను) గదా.

యో మామజమనాదిం చ
వేత్తి లోకమహేశ్వరమ్,
అసమ్మూఢస్స మర్త్యేషు
సర్వపాపైః ప్రముచ్యతే. **3**

ఎవడు నన్ను పుట్టుక లేనివానిగను, అనాదిరూపునిగను, సమస్తలోకములకు నియామకునిగను తెలిసికొనుచున్నాడో, అతడు మనుష్యులలో అజ్ఞానము



లేనివాడై సర్వపాపములనుండి లెస్సగ విడువబడుచున్నాడు.

బుద్ధిర్జ్ఞాన మసమ్మోహః
క్షమా సత్యం దమశ్శమః,
సుఖం దుఃఖం భవోఽభావో
భయం చాభయమేవ చ. **4**

అహింసా సమతా తుష్టి
స్తపో దానం యశోఽయశః,
భవన్తి భావా భూతానాం
మత్త ఏవ పృథగ్విధాః. **5**

బుద్ధి, జ్ఞానము, మోహరాహిత్యము, ఓర్పు, సత్యము, బాహ్యేంద్రియ నిగ్రహము, అంతరింద్రియ నిగ్రహము, సుఖము, దుఃఖము, పుట్టుక, (ఉత్పత్తి) నాశము, భయము, భయము లేకుండుట అహింస, సమత్వము, సంతుష్టి, తపస్సు, దానము కీర్తి, అపకీర్తి ప్రాణులయొక్క ఈ ప్రకారములైన

నానావిధములగు గుణములు నావలననే కలుగుచున్నవి.

మహర్షయస్సప్త పూర్వే
చత్వారో మనవస్తథా,
మద్భావా మానసా జాతా
యేషాం లోక ఇమాః ప్రజాః. 6

లోకమునందీప్రజలు ఎవరియొక్క సంతతియై యున్నారో, అట్టి పూర్వీకులైన సప్తమహర్షులును సనకాదులైన నలుగురు దేవర్షులున్ను, మనువులు పదునలుగురున్ను నాయొక్క భావము (దైవభావము) గలవారై నాయొక్క మనస్సంకల్పమువలననే పుట్టిరి.

ఏతాం విభూతిం యోగం చ
మమ యో వేత్తి తత్త్వతః,
సోఽవికమ్పేన యోగేన
యుజ్యతే నాత్ర సంశయః 7

నాయొక్క ఈ విభూతిని (ఐశ్వర్యమును, విస్తార



మును) యోగమును (అలౌకికశక్తిని), ఎవడు యథార్థముగ తెలిసికొనుచున్నాడో అతడు నిశ్చలమగు యోగముతో కూడుకొనుచున్నాడు. ఇవ్విషయమున సందేహము లేదు.

అహం సర్వస్య ప్రభవో
మత్తః సర్వం ప్రవర్తతే,
ఇతి మత్వా భజన్తే మాం
బుధా భావసమన్వితాః. 8

'నేను సమస్త జగత్తునకును ఉత్పత్తికారణమైన వాడను, నావలననే ఈ సమస్తము నడచుచున్నది' అని వివేకవంతులు తెలిసికొని పరిపూర్ణ భక్తిభావముతో గూడినవారై నన్ను భజించుచున్నారు.

మచ్చిత్తా మద్గతప్రాణా
బోధయన్తః పరస్పరమ్,
కథయన్తశ్చ మాం నిత్యం
తుష్యన్తి చ రమన్తి చ. 9

(వారు) నాయందు మనస్సుగలవారును, నన్ను బొందిన ప్రాణములు (ఇంద్రియములు) కలవారును, (లేక, నాయెడల ప్రాణమునర్పించినవారును)అయి నన్నుగూర్చి పరస్పరము బోధించుకొనుచు ముచ్చటించుకొనుచు ఎల్లప్పుడును సంతృప్తిని,ఆనందమును బొందుచున్నారు.

తేషాం సతతయుక్తానాం
భజతాం ప్రీతిపూర్వకమ్,
దదామి బుద్ధియోగం తం
యేన మాముపయాన్తి తే. **10**

ఎల్లప్పుడు నాయందును మనస్సుగలవారై, ప్రీతితో నన్ను భజించునట్టివారికి— దేనిచే వారు నన్ను బొందగలరో అట్టి జ్ఞానయోగమును (ఆత్మానాత్మ వివేచనా శక్తిని) ప్రసాదించుచున్నాను.

తేషామేవానుకమ్పార్థ
మహమజ్ఞానజం తమః,



నాశయామ్యాత్మభావస్థో
జ్ఞానదీపేన భాస్వతా. **11**

వారలకు (అట్టిభక్తులకు) దయజూపుటకొఱకే నేనే వారి యంతఃకరణమునందు నిలచి ప్రకాశమానమగు జ్ఞానదీపముచేత, అజ్ఞానజన్యమగు అంధకారమును నశింప జేయుచున్నాను.

అర్జున ఉవాచ :—

పరం బ్రహ్మ పరం ధామ
పవిత్రం పరమం భవాన్,
పురుషం శాశ్వతం దివ్య
మాదిదేవమజం విభుమ్. **12**

ఆహుస్త్వాం ఋషయస్సర్వే
దేవర్షిర్నారద స్తథా,

అసితో దేవలో వ్యాస
స్స్వయం చైవ బ్రవీషి మే. 13

అర్జునుడు చెప్పెను- (ఓకృష్ణా)నీవు పరబ్రహ్మమవు, పరంధాముడవు (పరమపదమవు లేక గొప్ప తేజస్స్వరూపుడవు), పరమపావనుడవు. నిన్ను నిత్యునిగను, ప్రకాశస్వరూపునిగను, పరమపురుషునిగను, ఆదిదేవునిగను, జన్మరహితునిగను, సర్వవ్యాపకునిగను, ఋషులందరున్ను దేవర్షియగునారదుడున్ను, అసితుడున్ను, దేవలుడున్ను వేదవ్యాస మహర్షియు చెప్పుచున్నారు. స్వయముగ నీవున్ను ఆ ప్రకారమే (నిన్నుగూర్చి) నాకు చెప్పుచున్నావు.

సర్వమేతదృతం మన్యే
యన్మాం వదసి కేశవ,
న హి తే భగవన్ వ్యక్తిం
విదుర్దేవా న దానవాః. 14

ఓ కృష్ణా ! దేనిని నీవు నాకు చెప్పుచున్నావో అదియంతయు సత్యమని నేను తలంచుచున్నాను. ఓ



భగవంతుడా! నీయొక్క నిజస్వరూపమును దేవతలుగాని, అసురులుగాని, ఎఱుంగజాలరు కదా!

స్వయమేవాత్మనాత్మానం
వేత్థ త్వం పురుషోత్తమ,
భూతభావన భూతేశ
దేవదేవ జగత్పతే. 15

ఓపురుషశ్రేష్ఠుడా, సమస్తప్రాణులను సృష్టించువాడా, సకల జీవులకు నియామకుడగువాడా, దేవతలకును దేవుడైనవాడా, జగన్నాథుడా, నిన్ను నీవే యెఱుంగుదువు (నీ స్వరూపమితరులకు దుర్గ్రాహ్యమని భావము.)

వక్తుమర్హస్యశేషేణ
దివ్యాహ్యాత్మవిభూతయః,
యాభిర్విభూతిభిర్లోకా
నిమాంస్త్వం వ్యాప్య తిష్ఠసి. 16

శాశ్వతవిభూతులచే(మాహాత్మ్యవిస్తారములచే)

నీవీ లోకములన్నిటిని వ్యాపించియున్నావో అట్టి దివ్యములగు నీ విభూతులను సంపూర్ణముగ చెప్పుటకు నీవే తగుదువు.

కథం విద్యామహం యోగిం
స్త్వాం సదా పరిచిన్తయన్,
కేషు కేషు చ భావేషు
చిన్త్యోఽసి భగవన్మయా. 17

యోగీశ్వరా! నేనెల్లప్పుడును ఏ ప్రకారముగ ధ్యానించుచు నిన్ను తెలిసికొనగలను? భగవంతుడా! ఏ యే వస్తువులందు నిన్ను నేను ధ్యానింపవలెను!

విస్తరేణాత్మనో యోగం
విభూతిం చ జనార్దన,
భూయః కథయ తృప్తిర్హి
శృణ్వతో నాస్తి మేఽమృతమ్. 18



ఓ కృష్ణా! నీయొక్క యోగమహిమను, జగల్లీలా విభూతులను (ధ్యానింపదగిన వస్తువులను) సవిస్తరముగ మరల తెలియజేయుము. ఏలయనగా నీయొక్క అమృత వాక్యములను వినుచున్న నాకు సంతృప్తికలుగుటలేదు. (ఇంకను వినవలయునని కుతూహలము గలుగుచున్నది).

శ్రీ భగవానువాచ:—

హన్త తే కథయిష్యామి
దివ్యా హ్యాత్మవిభూతయః,
ప్రాధాన్యతః కురుశ్రేష్ఠ
నాస్త్యన్తో విస్తరస్య మే. 19

శ్రీ భగవంతుడు చెప్పెను—కురువంశశ్రేష్ఠుడవగు ఓ అర్జునా! ఇప్పుడు దివ్యములైన నా యొక్క విభూతులను ప్రాధాన్యత ననుసరించి (ముఖ్యములైన వానిని) నీకు చెప్పెదను. ఏలయనగా—నా యొక్క విభూతి విస్తారమునకు అంతములేదు.

అహమాత్మా గుడాకేశ
సర్వభూతాశయస్థితః,
అహమాదిశ్చ మధ్యం చ
భూతానామన్త ఏవ చ. **20**

ఓ అర్జునా! సమస్త ప్రాణులయొక్క హృదయము నందున్న ప్రత్యగాత్మను నేనే అయియున్నాను. మఱియు ప్రాణులయొక్క ఆదిమధ్యాంతములున్ను (సృష్టిస్థితి లయములున్ను) నేనే అయియున్నాను.

ఆదిత్యానామహం విష్ణు
ర్జ్యోతిషాం రవిరంశుమాన్,
మరీచిర్మరుతామస్మి
నక్షత్రాణామహం శశీ. **21**

నేను ఆదిత్యులలో విష్ణువనువాడను, ప్రకాశింప జేయువానిలో కిరణములుగల సూర్యుడను, మరుత్తులను దేవతలలో మరీచియనువాడను, నక్షత్రములలో చంద్రుడను అయియున్నాను.



వేదానాం సామవేదోఽస్మి
దేవానామస్మి వాసవః,
ఇన్ద్రియాణాం మనశ్చాస్మి
భూతానామస్మి చేతనా. **22**

నేను వేదములలో సామవేదమును, దేవతలలో ఇంద్రుడను, ఇంద్రియములలో మనస్సును, ప్రాణులలో చైతన్యమున్ను (తెలివి) అయియున్నాను.

రుద్రాణాం శంకరశ్చాస్మి
విత్తేశో యక్షరక్షసామ్,
వసూనాం పావకశ్చాస్మి
మేరుశ్శిఖరిణామహమ్. **23**

నేను రుద్రులలో శంకరుడనువాడను, యక్షులలోను, రాక్షసులలోను కుబేరుడను, వసువులలో అగ్నియు, పర్వతములలో మేరువును అయియున్నాను.

పురోధసాం చ ముఖ్యం మాం
విద్ధి పార్థ బృహస్పతిమ్,
సేనానీనామహం స్కన్ద
స్సరసామస్మి సాగరః. **24**

ఓ అర్జునా! పురోహితులలో శ్రేష్ఠుడగు బృహస్పతినిగా నన్నెఱుంగుము! మరియు నేను సేనానాయకులలో కుమారస్వామియు, సరస్సులలో సముద్రమును అయియున్నాను.

మహర్షీణాం భృగురహం
గిరామస్మ్యేకమక్షరమ్,
యజ్ఞానాం జపయజ్ఞోఽస్మి
స్థావరాణాం హిమాలయః. **25**

నేను మహర్షులలో భృగుమహర్షిని, వాక్కులలో ఏకాక్షరమగు ప్రణవమును (ఓంకారమును) యజ్ఞములలో జపయజ్ఞమును, స్థిరపదార్థములలో హిమాలయ పర్వతమును అయియున్నాను.



అశ్వత్థః సర్వవృక్షాణాం
దేవర్షీణాం చ నారదః,
గన్ధర్వాణాం చిత్రరథః
సిద్ధానాం కపిలో మునిః. **26**

నేను చెట్లన్నిటియందును రావిచెట్టును, దేవర్షులలో నారదుడను, గంధర్వులలో చిత్రరథుడను, సిద్ధులలో కపిలమునీంద్రుడను అయియున్నాను.

ఉచ్చైశ్శ్రవసమశ్వానాం
విద్ధి మామమృతోద్భవమ్,
ఐరావతం గజేన్ద్రాణాం
నరాణాం చ నరాధిపమ్. **27**

గుఱ్ఱములలో అమృతముతో బాటు పుట్టిన ఉచ్చైశ్శ్రవసమను గుఱ్ఱమునుగను, గొప్ప యేనుగులలో ఐరావతమను యేనుగునుగను, మనుష్యులలో రాజునుగను నన్ను తెలిసికొనుము.

ఆయుధానామహం వజ్రం
ధేనూనామస్మి కామధుక్,
ప్రజనశ్చాస్మి కందర్పః
సర్పాణామస్మి వాసుకిః. 28

నేను ఆయుధములలో వజ్రాయుధమును, పాడి యావులలో కామధేనువును, ప్రజల(ధర్మబద్ధ మగు) యుత్పత్తికి కారణభూతుడైన [illegible] న్మథుడను, సర్పములలో వాసుకియు అయి[illegible]ను.

అనన్తశ్చాస్మి నాగానాం
వరుణో యాదసామహమ్,
పితౄణామర్యమా చాస్మి
యమస్సంయమతామహమ్. 29

నేను నాగులలో అనంతుడను, జల దేవతలలో వరుణుడను, పితృదేవతలలో అర్యముడను, నియమించువారిలో యముడను అయియున్నాను.



ప్రహ్లాదశ్చాస్మి దైత్యానాం
కాలః కలయతామహమ్,
మృగాణాం చ మృగేన్ద్రోఽహం
వైనతేయశ్చ పక్షిణామ్. 30

నేను అసురులలో ప్రహ్లాదుడను, లెక్క పెట్టు వారిలో కాలమును, మృగములలో మృగరాజగు సింహమును, పక్షులలో గరుత్మంతుడను అయియున్నాను.

పవనః పవతామస్మి
రామశ్శస్త్రభృతామహమ్,
ఝషాణాం మకరశ్చాస్మి
స్రోతసామస్మి జాహ్నవీ. 31

నేను పవిత్ర మొనర్చువానిలో (లేక వేగవంతులలో) వాయువును, ఆయుధమును ధరించినవారిలో శ్రీరామ చంద్రుడను, చేపలలో మొసలిని, నదులలో గంగానదిని అయియున్నాను.

సర్గాణామాదిరన్తశ్చ
మధ్యం చైవాహామర్జున,
అధ్యాత్మ విద్యా విద్యానాం
వాదః ప్రవదతామహామ్. 32

ఓ అర్జునా! సృష్టులయొక్క ఆదిమధ్యాంతములు (ఉత్పత్తి, స్థితి, లయములు) నేనే అయియున్నాను. మఱియు విద్యలలో అధ్యాత్మవిద్యయు, వాదించు వారిలో (రాగద్వేషరహితముగ, తత్త్వనిశ్చయము కొఱకు చేయబడు) వాదమును నేనైయున్నాను.

అక్షరాణామకారోఽస్మి
ద్వన్ద్వః సామాసికస్య చ,
అహ మేవాక్షయః కాలో
ధాతాఽహం విశ్వతోముఖః. 33

నేను అక్షరములలో 'అ' కారమును; సమాసములలో ద్వంద్వసమాసమును అయియున్నాను. మఱియు నాశములేని కాలమును (కాలమునకు



కాలమైనట్టి పరమేశ్వరుడను), సర్వత్రముఖములు గల కర్మఫలప్రదాతయును (లేక, విరాట్స్వరూపుడగు బ్రహ్మదేవుడను) నేనే అయియున్నాను.

మృత్యుస్సర్వ హారశ్చాహ
ముద్భవశ్చ భవిష్యతామ్,
కీర్తిశ్శ్రీర్వాక్చ నారీణాం
స్మృతిర్మేధా ధృతిః క్షమా. 34

సమస్తమును సంహరించునట్టి మృత్యువును, ఇక ముందు ఉత్పత్తికాగల సమస్తముయొక్క పుట్టుకయు నేనే అయియున్నాను. మఱియు స్త్రీలలోగల కీర్తి, సంపద, వాక్కు, స్మృతిజ్ఞానము, ధారణాశక్తిగల బుద్ధిధైర్యము. ఓర్పు, అను ఈఏడుగుణములున్నూ నేనే అయియున్నాను.

బృహత్సామ తథా సామ్నాం
గాయత్రీ ఛందసామహామ్,
మాసానాం మార్గశీర్షోఽహాం
ఋతూనాం కుసుమాకరః. 35

సామవేద గానములలో బృహత్సామమును ఛందస్సులలో గాయత్రియు, మాసములలో మార్గశిరమాసమును, ఋతువులలో వసంతఋతువును నేనైయున్నాను.

ద్యూతం ఛలయతామస్మి
తేజస్తేజస్వినామహమ్,
జయోఽస్మి వ్యవసాయోఽస్మి
సత్త్వం సత్త్వవతామహమ్. 36

వంచక వ్యాపారములలో నేను జూదమును అయియున్నాను. మఱియు నేను తేజోవంతులయొక్క తేజస్సును (ప్రభావము), (జయించువారలయొక్క) జయమును, (ప్రయత్నశీలురయొక్క) ప్రయత్నమును, సాత్త్వికులయొక్క సత్త్వగుణమును అయియున్నాను.

వృష్ణీనాం వాసుదేవోఽస్మి
పాణ్డవానాం ధనంజయః,



మునీనామప్యహం వ్యాసః
కవీనాముశనా కవిః. 37

నేను వృష్ణివంశీయులలో వసుదేవుని పుత్రుడగు వాసుదేవుడను (శ్రీకృష్ణుడను), పాండవులలో అర్జునుడను, మునులలో వేదవ్యాస మునీంద్రుడను, కవులలో శుక్రాచార్యుడను అయియున్నాను.

దణ్డో దమయతామస్మి
నీతిరస్మి జిగీషతామ్,
మౌనం చైవాస్మి గుహ్యానాం
జ్ఞానం జ్ఞానవతామహమ్. 38

నేను దండించువారియొక్క దండనమును (శిక్షయు), జయింప నిచ్చగలవారియొక్క (జయోపాయమగు) నీతియు అయియున్నాను. మఱియు రహస్యములలో మౌనమును, జ్ఞానవంతులలో జ్ఞానమును నేనై యున్నాను.

యచ్చాపి సర్వభూతానాం
బీజం తదహమర్జున
న తదస్తి వినా యత్స్యా
న్మయా భూతం చరాచరమ్. 39

ఓ అర్జునా ! సమస్త ప్రాణికోట్లకు ఏది మూల కారణమై యున్నదో అదియు నేనే అయియున్నాను. (వెయ్యేల) స్థావరజంగమాత్మకమైన వస్తువేదియు నన్ను వినాగా లేనే లేదు (నాకంటె వేఱుగ లేదు).

నాన్తోఽస్తి మమ దివ్యానాం
విభూతీనాం పరన్తప
ఏష తూద్దేశతః ప్రోక్తో
విభూతేర్విస్తరో మయా. 40

ఓ అర్జునా ! నాయొక్క దివ్యములైన విభూతులకు అంతములేదు. అయినను కొన్నిటిని సంక్షేపముగ నేనిపుడు వివరించి చెప్పితిని.



యద్యద్విభూతిమత్సత్త్వం
శ్రీమదూర్జితమేవ వా,
తత్తదేవావగచ్ఛ త్వం
మమ తేజోంఽశ సమ్భవమ్. 41

(ఈప్రపంచమున) ఐశ్వర్యయుక్తమైనదియు కాంతివంతమైనదియు (నిర్మలమైనదియు), ఉత్సాహముతో గూడినదియు (శక్తివంతమైనదియు) నగు వస్తువు (లేక ప్రాణి) ఏది యేది కలదో అదియది నా తేజస్సు యొక్క అంశమువలన కలిగిన దానినిగా నీవెఱుంగుము.

అథవా బహునైతేన
కిం జ్ఞాతేన తవార్జున,
విష్టభ్యాహమిదం కృత్స్న
మేకాంశేన స్థితో జగత్. 42

అర్జునా ! లేక విస్తారమైన ఈ (విభూతి) జ్ఞానముచే నీ కేమి ప్రయోజనము ? నేనీ జగత్తునంతను ఒక్క అంశముచేతనే వ్యాపించియున్నాను (అని తెలిసికొనుము).

ఇతి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు
బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే
శ్రీ కృష్ణార్జున సంవాదే
విభూతియోగో నామ
దశమోఽధ్యాయః.

---

ఓం

శ్రీకృష్ణపరబ్రహ్మణే నమః

# శ్రీ భగవద్గీత

## అథ ఏకాదశోఽధ్యాయః

## విశ్వరూప సందర్శనయోగః

**అర్జున ఉవాచ :—**

మదనుగ్రహాయ పరమం
గుహ్యమధ్యాత్మ సంజ్ఞితమ్,
యత్త్వయోక్తం వచస్తేన
మోహోఽయం విగతో మమ. 1

అర్జునుడు చెప్పెను—శ్రీకృష్ణమూర్తీ ! నన్ననుగ్రహించుటకొఱకై సర్వోత్తమమై రహస్యమైన (అధ్యాత్మమను పేరుగలదైనట్టి) ఏ వాక్యమును (బోధను) నీవు చెప్పితివో, దానిచే నా అజ్ఞానము పూర్తిగ తొలగిపోయినది.

భవాప్యయౌ హి భూతానాం
శ్రుతౌ విస్తరశో మయా,
త్వత్తః కమలపత్రాక్ష
మాహాత్మ్యమపి చావ్యయమ్. 2

ఏలయుసగా కమల నేత్రుడవగు. ఓ కృష్ణా! నీవ లన ప్రాణుల యొక్క ఉత్పత్తి వినాశములగూర్చి, నీయొక్క మాహాత్మ్యమును (మహిమను) గూర్చి సవిస్తరముగ వింటిని.

ఏవమేతద్యథాఽఽత్థ త్వ
మాత్మానం పరమేశ్వర,
ద్రష్టుమిచ్ఛామి తే రూప
మైశ్వరం పురుషోత్తమ. 3

ఓ పరమేశ్వరా! నిన్నుగూర్చి నీవు చెప్పిన దంతయు సరియేయని నేను విశ్వసించుచున్నాను. ఓ పురుషోత్తమా! నీయొక్క ఈశ్వరసంబంధమైన విశ్వరూపమును నే నిపుడు చూడదలంచుచున్నాను



మన్యసే యది తచ్ఛక్యం
మయా ద్రష్టుమితి ప్రభో,
యోగేశ్వర తతో మే త్వం
దర్శయాత్మాన మవ్యయమ్. 4

ప్రభూ! ఆ నీ స్వరూపమును జూచుటకు నాకు సాధ్యమగునని నీవు తలంతువేని, ఓ యోగేశ్వరా! నాశరహితమైన ఆ నీ విశ్వరూపమును ఇక నాకు చూపుము.

శ్రీ భగవానువాచ :—

పశ్య మే పార్థ రూపాణి
శతశోఽథ సహస్రశః,
నానావిధాని దివ్యాని
నానావర్ణాకృతీని చ. 5

శ్రీ భగవానుడు చెప్పెను— ఓ అర్జునా! అనేక విధములుగ నున్నవియు, అలౌకికములైనవియును,

వివిధవర్ణములు ఆకారములుగలవియు, అసంఖ్యాకములుగ నర్తించునవియునగు నాయొక్క రూపములను గాంచుము.

పశ్యాదిత్యాన్ వసూన్ రుద్రా
నశ్వినౌ మరుతస్తథా,
బహూన్యదృష్టపూర్వాణి
పశ్యాశ్చర్యాణి భారత. 6

ఓ అర్జునా! సూర్యులను, వసువులను, రుద్రులను, అశ్వినీదేవతలను, మరుత్తులను చూడుము. అట్లే ఇదివఱకెన్నడును నీవు చూడని పెక్కు ఆశ్చర్యములను గాంచుము.

ఇహైకస్థం జగత్కృత్స్నం
పశ్యాద్య సచరాచరమ్,
మమ దేహే గుడాకేశ
యచ్చాన్యద్ద్రష్టుమిచ్ఛసి. 7

ఓ అర్జునా! ఈసమస్త చరాచర ప్రపంచమును.



ఇంకను దేని దేనినిజూడదలంచుచున్నావో దానిని. ఈ నా శరీరమందు (అవయవములవలె) ఒక్కచోట నున్న దానినిగా ఇపుడు చూడుము.

న తు మాం శక్యసే ద్రష్టు
మనేనైవ స్వచక్షుషా,
దివ్యం దదామి తే చక్షుః
పశ్య మే యోగమైశ్వరమ్. 8

ఈనీ మాంసమయ నేత్రములతో నీవు నావిశ్వరూపమును గాంచజాలవు. కావున దివ్యదృష్టిని (జ్ఞాననేత్రమును) నీకు ప్రసాదించుచున్నాను. దానిచే ఈశ్వరసంబంధమైన నాయోగమహిమను జూడుము

సంజయ ఉవాచ :—

ఏవముక్త్వా తతో రాజన్
మహాయోగేశ్వరో హరిః,
దర్శయామాస పార్థాయ
పరమం రూపమైశ్వరమ్. 9

సంజయుడు చెప్పెను—ఓ ధృతరాష్ట్ర మహారాజా! మహాయోగేశ్వరుడగు శ్రీకృష్ణపరమాత్మ ఈ ప్రకారముగ వచించి తదుపరి సర్వోత్తమమైన ఈశ్వరసంబంధమగు (విశ్వ)రూపమును అర్జునునకు జూపెను.

అనేక వక్త్రనయన
మనేకాద్భుతదర్శనమ్,
అనేక దివ్యాభరణం
దివ్యానేకోద్యతాయుధమ్. **10**

దివ్యమాల్యామ్బరధరం
దివ్యగన్ధానులేపనమ్,
సర్వాశ్చర్యమయం దేవ
మనన్తం విశ్వతోముఖమ్. **11**

(అత్తఱి) పెక్కుముఖములు, నేత్రములుగలదియు, అనేకములగు అద్భుతవిషయములను జూపునదియు, దివ్యములైన పెక్కు ఆభరణములతో గూడినదియు



ఎత్తబడియున్న అనేక దివ్యాయుధములు గలదియు, దివ్యములైన పుష్పమాలికలను, వస్త్రములను ధరించినదియు, దివ్యమగు గంధపుపూతలతో గూడియున్నదియు, అనేక ఆశ్చర్యములతో నిండియున్నదియు, ప్రకాశస్వరూపమైనదియు, అంతములేనిదియు, ఎల్లెడల ముఖములుగలదియు (నగు తన విశ్వరూపమును భగవానుడర్జునునకు జూపెను).

దివి సూర్యసహస్రస్య
భవేద్యుగపదుత్థితా,
యది భాస్సదృశీ సా స్యా
ద్భాసస్తస్య మహాత్మనః **12**

ఆకాశమునందు వేలకొలంది సూర్యులయొక్క కాంతి ఒక్కసారి బయలుదేరినచో ఎంత కాంతి యుండునో అది ఆ మహాత్మునియొక్క కాంతిని బోలియున్నది.

తత్రైకస్థం జగత్కృత్స్నం
ప్రవిభక్త మనేకధా

అపశ్యద్దేవదేవస్య
శరీరే పాణ్డవ స్తదా. **13**

అప్పు డర్జునుడు నానావిధములుగవిభజింపబడి యున్నసమ స్తజగత్తును దేవదేవుడగు శ్రీకృష్ణభగవానునియొక్క శరీరమున (అవయవమువలె) ఒక్క చోటనున్నదానినిగ చూచెను.

తతః స విస్మయావిష్టో
హృష్టరోమా ధనంజయః,
ప్రణమ్య శిరసా దేవం
కృతాఞ్జలిరభాషత. **14**

అటు పిమ్మట ఆ అర్జునుడు ఆశ్చర్యముతో గూడినవాడును, గగుర్పాటుకలవాడునుఅయి విశ్వరూపమును ధరించిన భగవానునకు శిరస్సుచే నమస్కరించి చేతులు జోడించుకొని ఈ ప్రకారముగ పలికెను.



అర్జున ఉవాచ :-

పశ్యామి దేవాంస్తవ దేవ దేహే
సర్వాంస్తథా భూతవిశేషసఙ్ఘాన్,
బ్రహ్మాణమీశం కమలాసనస్థ
మృషీంశ్చ సర్వానురగాంశ్చ
దివ్యాన్. **15**

అర్జునుడు చెప్పెను -

దేవా! నీ శరీరమందే సమస్తదేవతలను, అట్లే చరాచర ప్రాణికోట్ల సమూహములనుకమలాసనుడైన సృష్టికర్తయగు బ్రహ్మదేవుని, సమస్తఋషులను, దివ్యములగుసర్పములను చూచుచున్నాను.

అనేక బాహూదరవక్త్రనేత్రం
పశ్యామి త్వాం సర్వతోఽనన్త
రూపమ్,

నాన్తం న మధ్యం న పునస్తవాదిం
పశ్యామి విశ్వేశ్వర విశ్వరూప. 16

ప్రపంచమునకు అధిపతియైనవాడా! జగద్రూపుడా! నిన్ను సర్వత్ర అనేకహస్తములు, ఉదరములు, ముఖములు, నేత్రములు, గలవానినిగను, అనంతరూపునిగను నేను చూచుచున్నాను. మఱియు నీయొక్క మొదలుగాని, మధ్యముగాని, తుదగాని నేను గాంచజాలకున్నాను.

కిరీటినం గదినం చక్రిణం చ
తేజోరాశిం సర్వతో దీప్తిమన్తమ్,
పశ్యామి త్వాం దుర్నిరీక్ష్యం సమన్తా
ద్దీప్తానలార్కద్యుతిమప్రమేయమ్.

నిన్ను ఎల్లెడలను కిరీటముగలవానినిగను, గదను ధరించినవానినిగను, చక్రమును బూనినవానినిగను, కాంతిపుంజముగను, అంతటను ప్రకాశించువానినిగను, జ్వలించు అగ్ని, సూర్యులవంటి కాంతిగల



వానినిగను, అపరిచ్ఛిన్ననిగను, (పరిమితి లేనివానినిగను) చూచుచున్నాను.

త్వమక్షరం పరమం వేదితవ్యం
త్వమస్య విశ్వస్య పరం నిధానమ్,
త్వమవ్యయశ్శాశ్వతధర్మగోప్తా
సనాతనస్త్వం పురుషో మతో మే. 18

నీవు తెలియదగిన సర్వోత్తమ అక్షరపరబ్రహ్మవు. నీవీ జగత్తున కంతటికి గొప్ప ఆధారభూతుడవు. నీవు నాశరహితుడవు. శాశ్వతములగు ధర్మములను కాపాడువాడవు. నీవు పురాణపురుషుడవు. అని నా అభిప్రాయము.

అనాది మధ్యాన్త మనన్తవీర్య
మనన్తబాహుం శశిసూర్యనేత్రమ్,
పశ్యామి త్వాం దీప్తహుతాశవక్త్రం
స్వతేజసా విశ్వమిదం తపన్తమ్. 19

ఆదిమధ్యాన్తరహితునిగను అపరిమిత సామర్థ్యము గలవానినిగను, అనేకహస్తములుగల వానినిగను, చంద్రసూర్యులు నేత్రములుగ గలవానినిగను ప్రజ్వలించు అగ్నిహోత్రమునివంటి ముఖము గలవానిని గను, స్వకీయ తేజస్సుచే ఈప్రపంచమునంతయు తపింపజేయుచున్న వానినిగను నిన్ను చూచుచున్నాను.

**ద్యావాపృథివ్యోరిదమన్తరం హి**
**వ్యాప్తంత్వయైకేన దిశశ్చసర్వాః**
**దృష్ట్వాద్భుతంరూపముగ్రంతవేదం**
**లోకత్రయం ప్రవ్యథితం మహాత్మన్.**

ఓ మహాత్మా! భూమ్యాకాశములయొక్క ఈ మధ్యప్రదేశమంతయును, దిక్కులన్నియును నీయొక్కని చేతనే వ్యాపింపబడి యున్నవిగదా! మఱియు భయంకరమైనదియు ఆశ్చర్యకరమైనదియు నగు నీ యీ రూపమునుజూచి ముల్లోకములున్ను మిగుల భీతిని బొందియున్నవి.

**అమీ హి త్వాం సురసఙ్ఘా విశన్తి**
**కేచిద్భీతాః ప్రాఞ్జలయో గృణన్తి**



**స్వస్తీత్యుక్త్వా మహర్షి సిద్ధసఙ్ఘాః**
**స్తువన్తి త్వాం స్తుతిభిఃపుష్కలాభిః.**

ఈ దేవతాసమూహములు నీయందు ప్రవేశించుచున్నవి (మఱి) కొందఱు భీతిల్లి చేతులుజోడించుకొని (నిన్ను) స్తుతించుచున్నారు. మహర్షులయొక్కయు సిద్ధులయొక్కయు, సమూహములు '(లోకమునకు) క్షేమమగుగాక !' యని పలికి సంపూర్ణములగు స్తోత్రములచేత నిన్ను పొగడుచున్నారు.

**రుద్రాదిత్యావసవో యే చ సాధ్యా**
**విశ్వేఽశ్వినౌ మరుతశ్చోష్మపాశ్చ**
**గన్ధర్వయక్షాసురసిద్ధసఙ్ఘా**
**వీక్షన్తే త్వాం విస్మితాశ్చైవ సర్వే. 22**

రుద్రులును, సూర్యులును, వసువులును, సాధ్యులును, విశ్వేదేవతలును, అశ్వినీదేవతలును, గంధర్వులయొక్కయు, యక్షులయొక్కయు, అసురులయొక్కయు సిద్ధులయొక్కయు సంఘములును వీరందఱున్ను ఆశ్చర్యచకితులై నిన్ను చూచుచున్నారు.

రూపం మహత్తే బహువక్త్రనేత్రం
మహాబాహో బహుబాహూ
రుపాదమ్,
బహూదరం బహుదంష్ట్రాకరాలం
దృష్ట్వా లోకాః ప్రవ్యథితా
స్తథాఽహమ్. 23

గొప్ప భుజములుగల ఓ కృష్ణా! అనేక ముఖములు, నేత్రములు గలిగినట్టియు, అనేకములగు హస్తములు, తొడలు, పాదములు గలిగినట్టియు, పెక్కు కడుపులు గలిగియున్నట్టియు, అనేకములైన కోరలచే భయంకరమైనట్టియు, నీయొక్క గొప్ప రూపమునుజూచి జనులందఱును మిగుల భయపడుచున్నారు. నేనున్ను అట్లే భయపడుచున్నాను.

నభః స్పృశం దీప్తమనేకవర్ణం
వ్యాత్తాననం దీప్తవిశాలనేత్రమ్



దృష్ట్వాహిత్వాం ప్రవ్యథితాన్తరాత్మా
ధృతిం న విన్దామి శమం చ విష్ణో.

ఓ విష్ణుమూర్తీ! ఆకాశమును తాకుచున్నవాడవును, ప్రకాశించుచున్నవాడవును, పెక్కురంగులుగలవాడవును, తెఱవబడిననోరుగలవాడవును, జ్వలించుచున్న విశాలములైన నేత్రములు గలవాడవును నగు నిన్ను జూచి మిగుల భీతిల్లినమనస్సుగలవాడనై ధైర్యమును శాంతిని నేను పొందజాలకున్నాను.

దంష్ట్రాకరాలాని చ తే ముఖాని
దృష్ట్వైవ కాలానలసన్నిభాని
దిశో న జానే న లభే చ శర్మ
ప్రసీద దేవేశ జగన్నివాస. 25

కోరలచే భయంకరములైనవియు, ప్రళయాగ్నిని బోలినవియునగు నీ ముఖములను జూచి, నేను దిగ్భ్రమ జెందియున్నాను. సుఖమును గూడ బొందకయేయున్నాను. కావున ఓ దేవదేవా! జగదాశ్రయా! ప్రసన్నుడవగుము (నన్ననుగ్రహింపుము).

అమీచ త్వాం ధృతరాష్ట్రస్య పుత్రాః
సర్వే సహైవావనిపాలసఙ్ఘైః,
భీష్మోద్రోణస్సూతపుత్ర స్తథాఽసౌ
సహాస్మదీయైరపి యోధముఖ్యైః.
వక్త్రాణి తే త్వరమాణా విశన్తి
దంష్ట్రాకరాలాని భయానకాని,
కేచిద్విలగ్నా దశనాన్తరేషు
సందృశ్యన్తే చూర్ణితైరుత్తమాఙ్గైః.

ఈ ధృతరాష్ట్రుని కొమారులందరును, భీష్మునును, ద్రోణుడును, కర్ణుడును, వారి సేనయందలి సమస్త రాజసమూహములును, అట్లే మన సేనయందలి సైనికప్రముఖులును, నిన్ను త్వరితముగ జేరుచున్న వారై కోరలచే భయంకరములుగనున్నట్టి నీ నోళ్ల యందు ప్రవేశించుచున్నారు. (వారిలో) కొందఱు



నీ పండ్ల సందులయందు చిక్కుకొనినవారై పొడుముచేయబడిన శిరస్సులతో కనుపించుచున్నారు.

యథా నదీనాం బహవోఽమ్బువేగా
స్సముద్ర మేవాభిముఖా ద్రవన్తి
తథా తవామీ నరలోకవీరా
విశన్తి వక్త్రాణ్యభివిజ్వలన్తి. 28

ఏ ప్రకారము అనేక నదీప్రవాహములు సముద్రాభిముఖములై ప్రవహించుచు అందు ప్రవేశించుచున్నవో, ఆ ప్రకారమే ఈ మనుష్యలోకమందలి వీరులు (రాజులు) తెస్నగ జ్వలించుచున్న నీ నోళ్ళయందు ప్రవేశించుచున్నారు.

యథా ప్రదీప్తం జ్వలనం పతఙ్గా
విశన్తి నాశాయ సమృద్ధవేగాః,
తథైవ నాశాయ విశన్తి లోకా
స్తవాపి వక్త్రాణి సమృద్ధవేగాః 29

ఏప్రకారముగ మిడతలు వినాశముకొఱకు మిక్కిలి వేగముతో గూడినవై బాగుగ మండుచున్న అగ్ని యందు ప్రవేశించుచున్నవో, ఆ ప్రకారమే జను లున్ను మిగుల వేగముతో గూడినవారై నాశము కొఱకు నీ నోళ్ళయందు ప్రవేశించుచున్నారు.

లేలిహ్యసే గ్రసమానస్సమన్తా
ల్లోకాన్ సమగ్రాన్ వదనైర్జ్వలద్భి
తేజోభిరాపూర్య జగత్సమగ్రం
భాసస్తవోగ్రాః ప్రతపన్తి విష్ణో. 30

ఓకృష్ణమూర్తీ! మండుచున్న నీయొక్క నోళ్ళచే జనులందఱిని అంతటను మ్రింగుచున్నవాడవై ఆస్వాదించుచున్నావు. నీ యొక్క భయంకరములైన కాంతులు తమ తేజస్సులచేత జగత్తునంతను వ్యాపించి మిగుల తపింపజేయుచున్నవి.

ఆఖ్యాహి మే కో భవానుగ్రరూపో
న మోఽస్తు తే దేవవర ప్రసీద.



విజ్ఞాతుమిచ్ఛామి భవన్తమాద్యం
న హి ప్రజానామి తవ ప్రవృత్తిమ్.

దేవోత్తమా! భయంకరాకారముగల నీ వెవడవో నాకు చెప్పుము. ఏలయనగా – ప్రవృత్తిని ఎఱుంగకున్నాను. కనుక ఆదిపురుషుడవగు నిన్ను గూర్చి తెలిసికొనగోరుచున్నాను. నీకు నమస్కారము. నన్ననుగ్రహింపుము.

శ్రీ భగవానువాచ :–

కాలోఽస్మి లోకక్షయకృత్ప్రవృద్ధో
లోకాన్ సమాహర్తుమిహ
ప్రవృత్తః,
ఋతేఽపి త్వా న భవిష్యన్తి సర్వే
యేఽవస్థితాః ప్రత్యనీకేషు యోధాః.

శ్రీ భగవంతుడు చెప్పెను – (ఓ అర్జునా!) (నేను) లోకసంహారకుడనై విజృంభించిన కాలుడను అయియున్నాను. ప్రాణులను సంహరించు నిమిత్త

మీా ప్రపంచమున ప్రవర్తించుచున్నాను. ప్రతిపక్ష సైన్యములందుగల వీరులు నీవు లేకపోయినను, యుద్ధము చేయకున్నను జీవించియుండరు (మృతినొందక తప్పరు).

తస్మాత్త్వముత్తిష్ఠ యశో లభస్వ
జిత్వా శత్రూన్ భుఙ్క్ష్వ రాజ్యం సమృద్ధమ్,
మయైవైతే నిహతాః పూర్వమేవ
నిమిత్తమాత్రం భవ సవ్యసాచిన్.

కాబట్టి నీవు లెమ్ము. శత్రువులను జయించి కీర్తిని బడయుము. పరిపూర్ణమగు(నిష్కంటకమైన) రాజ్యమును అనుభవింపుము. వీరందఱును ఇదివఱకే నాచేతనే చంపబడిరి. కావున ఓ అర్జునా! నీవు నిమిత్తమాత్రముగ నుండుము.

ద్రోణం చ భీష్మం చ జయద్రథం చ
కర్ణం తథాఽన్యానపియోధవీరాన్



మయా హతాంస్త్వం జహి మా వ్యథిష్ఠా
యుధ్యస్వ జేతాసి రణే సపత్నాన్.

నాచేత(ఇదివరకే చంపబడిన ద్రోణాచార్యుని, భీష్మాచార్యుని, జయద్రథుని, కర్ణుని అట్లే ఇతర యుద్ధవీరులను గూడ నీవు చంపుము. భయపడకుము. యుద్ధముచేయుము. శత్రువులను గెలువగలవు.

సంజయ ఉవాచ :—

ఏతచ్ఛ్రుత్వా వచనం కేశవస్య
కృతాఞ్జలిర్వేపమానః కిరీటీ,
నమస్కృత్వా భూయ ఏవాహ కృష్ణం
సగద్గదం భీతభీతః ప్రణమ్య. 35

సంజయుడు చెప్పెను — అర్జునుడు శ్రీకృష్ణమూర్తియొక్క ఈ వాక్యములను విని వణకుచున్నవాడై చేతులు జోడించుకొని శ్రీకృష్ణునకు

నమస్కరించి మిగుల భయపడినవాడగుచు వినమ్రుడై గద్గదస్వరముతో నిట్లు పలికెను.

అర్జున ఉవాచ :—

స్థానే హృషీకేశ తవ ప్రకీర్త్యా
జగత్ప్రహృష్యత్యనురజ్యతే చ,
రక్షాంసి భీతాని దిశో ద్రవన్తి
సర్వే నమస్యన్తి చ సిద్ధసఙ్ఘాః. 36

అర్జునుడు చెప్పెను — ఓ కృష్ణా! నీయొక్క నామము నుచ్చరించుటచేతను, మాహాత్మ్యమును లెస్సగా కొనియాడుటచేతను లోకము మిగుల సంతోషించుచున్నది. మిక్కిలి ప్రీతిబొందుచున్నది. (నిన్ను జూచి) రాక్షసులు భయపడినవారై దిగంతములకు పరుగిడుచున్నారు. సిద్ధుల సమూహము లన్నియు నీకు నమస్కరించుచున్నవి. ఇవియన్నియు నీ మహిమకు తగియేయున్నవి.

కస్మాచ్చ తే న నమేరన్మహాత్మన్
గరీయసే బ్రహ్మణోఽప్యాదికర్త్రే



అనన్త దేవేశ జగన్నివాస
త్వమక్షరం సదసత్తత్పరం యత్.

మహాత్మా! అనంతరూపా! దేవదేవా! జగదాశ్రయా! సత్ అసత్తులకు, స్థూలసూక్ష్మజగత్తుల రెండిటికిని పరమైనట్టి అక్షర (నాశరహిత) పరబ్రహ్మవు నీవే అయియున్నావు బ్రహ్మదేవునకు గూడా ఆదికారణుడవును, కనుకనే సర్వోత్కృష్టుడవును అగు నీకు జను లేల నమస్కరింపకుందురు (వారినమస్కారములకు నీవుతగుదువు అనిభావము)

త్వమాదిదేవః పురుషః పురాణ
స్త్వమస్య విశ్వస్య పరం నిధానమ్,
వేత్తాఽసి వేద్యం చ పరం చ ధామ
త్వయా తతం విశ్వ మనన్తరూప.

అనంతరూపుడవగు ఓ కృష్ణా! నీవు ఆదిదేవుడవును, సనాతన పురుషుడవును, ఈ ప్రపంచమునకు శ్రేష్ఠమైనఆధారమున్ను, సమస్తమును తెలిసికొనినవాడవును, తెలియఁదగినవాడవును, సర్వోత్తమ

స్థానమును అయియున్నావు. నీచేతనే ఈ ప్రపంచమంతయును వ్యాపింపబడియున్నది.

వాయుర్యమోఽగ్నిర్వరుణ
శ్శశాఙ్కః
ప్రజాపతిస్త్వం ప్రపితామహశ్చ
నమో నమస్తేఽస్తు సహస్రకృత్వః
పునశ్చ భూయోఽపి నమో నమస్తే.

వాయువును, యముడును, అగ్నియు, వరుణుడును, చంద్రుడును, బ్రహ్మదేవుడును, బ్రహ్మదేవునకు తండ్రియును నీవే అయియున్నావు. నీకనేక వేల నమస్కారములు! మఱల నీకు నమస్కారము!

నమః పురస్తాదథ పృష్ఠతస్తే
నమోఽస్తు తే సర్వత ఏవ సర్వ
అనన్తవీర్యామితవిక్రమస్త్వం
సర్వం సమాప్నోషి తతోఽసి సర్వః.



సర్వరూపుడవగు ఓకృష్ణా! ఎదుటను, వెనుకను నీకు నమస్కారము. మఱియు అన్నివైపులను నీకు నమస్కారమగుగాక! అపరిమితసామర్థ్యము, పరాక్రమము గలవాడవగు నీవు సమస్తమును లెస్సగ వ్యాపించియున్నావు. కనుకనే సర్వస్వరూపుడవై యున్నావు.

సఖేతి మత్వా ప్రసభం యదుక్తం
హే కృష్ణ హే యాదవ హే సఖేతి
అజానతా మహిమానం తవేదం
మయా ప్రమాదాత్ప్రణయేన వాపి.
యచ్చాపహాసార్థమసత్కృతోఽసి
విహారశయ్యాసన భోజనేషు,
ఏకోఽథవాప్యచ్యుత తత్సమక్షం
తత్క్షామయే త్వామహమప్రమేయమ్.

నాశరహితుడవగు ఓ కృష్ణా! నీయొక్క ఈ మహిమను తెలియక పొరపాటున గాని, చనువువలన

గాని, సఖుడవని తలంచి 'ఓ కృష్ణా, ఓయాదవా, ఓ సఖా' అని అలక్ష్యముగ నిన్ను గూర్చి నేనేది చెప్పితినో, మఱియు విహారము సల్పునపుడుగాని పరుండునపుడుగాని, కూర్చుండునపుడుగాని భుజించు నపుడుగాని ఒక్కడవుగా నున్నపుడుగాని లేక ఇతరుల యెదుటగాని పరిహాసములకొఱకు ఏ అవమానమును గావించితినో ఆయపరాధము లన్నిటిని అప్రమేయుడవగు నిన్ను క్షమింప వేడుచున్నాను.

పితాఽసి లోకస్య చరాచరస్య
త్వమస్య పూజ్యశ్చ గురుర్గరీయాన్
న త్వత్సమోఽస్త్యభ్యధికః
కుతోఽన్యో
లోకత్రయేఽప్యప్రతిమప్రభావ. 43

సాటిలేని ప్రభావముగల ఓకృష్ణమూర్తీ! నీవు చరాచరాత్మకమైన ఈ ప్రపంచమున కంతకును తండ్రివి అయియున్నావు. మఱియు నీవు పూజ్యుడవును, సర్వశ్రేష్ఠుడవగు గురుడవును అయి వెలయుచున్నావు. ముల్లోకములందును నీతో సమానమైన



వాడు లేడు. ఇక నిన్ను మించినవాడు మరియొకఁ డెట్లుండగలడు?

తస్మాత్ప్రణమ్య ప్రణిధాయ కాయం
ప్రసాదయే త్వామహమీశమీడ్యం
పితేవ పుత్రస్య సఖేవ సఖ్యుః
ప్రియః ప్రియాయార్హసి దేవ
సోఢుమ్.

అందువలన నేను శరీరమును భూమిపై సాష్టాంగముగ బడవైచి నమస్కరించి ఈశ్వరుడవును, స్తుతింప దగినవాడవునువగు నిన్ను అనుగ్రహింప వేడుచున్నాను. దేవా, కుమారుని (అపరాధమును) తండ్రి వలెను, స్నేహితుని అపరాధమును స్నేహితుడువలెను ప్రియురాలి (అపరాధమును) ప్రియుడు వలెను (నాయొక్క అపరాధమును) నీవు క్షమింపుము.

అదృష్టపూర్వం హృషితోఽస్మి
దృష్ట్వా
భయేన చ ప్రవ్యథితం మనో మే

తదేవ మే దర్శయ దేవ రూపం
ప్రసీద దేవేశ జగన్నివాస. 45

ఇదివఱ కెన్నడును జూడనట్టి ఈ విశ్వరూపమును జూచి ఆనందమును బొందితిని. కాని భయముచే నాయొక్క మనస్సు మిగుల వ్యథనొందుచున్నది. కావున దేవా! ఆ మునుపటి (సౌమ్య) రూపమునే నాకు జూపుము. దేవదేవా! జగదాధారా! అనుగ్రహింపుము!

కిరీటినం గదినం చక్రహస్త
మిచ్ఛామి త్వాం ద్రష్టుమహం తథైవ
తేనైవ రూపేణ చతుర్భుజేన
సహస్రబాహో భవ విశ్వమూర్తే.

(శ్రీకృష్ణమూర్తీ!) నేను నిన్ను మునుపటివలెనే కిరీటము, గద, చక్రము చేతధరించినవానిగ చూడ దలంచుచున్నాను. అనేక హస్తములుగలవాడా! జగద్రూపా! నాలుగు భుజములుగల ఆ పూర్వ రూపమునే మఱల ధరింపుము.



శ్రీ భగవానువాచ:—

మయా ప్రసన్నేన తవార్జునేదం
రూపం పరం దర్శితమాత్మయోగాత్
తేజోమయం విశ్వమనన్తమాద్యం
యన్మే త్వదన్యేన న దృష్టపూర్వమ్

శ్రీ భగవానుడు చెప్పెను—

అర్జునా! ప్రకాశముచే పరిపూర్ణమైనదియు, జగద్రూపమైనదియు, అంతములేనిదియు, మొదటిదియు, నీవుతప్ప ఇతరులచే నిదివఱ కెన్నడును జూడబడనిదియునగు ఏయీ సర్వోత్తమమైన విశ్వరూపముగలదో, అయ్యది ప్రసన్నుడనగు నాచే స్వకీయయోగశక్తి వలన నీకు చూపబడినది.

న వేద యజ్ఞాధ్యయనైర్న దానై
ర్న చ క్రియాభిర్న తపోభిరుగ్రైః

ఏవం రూపశ్శక్య అహం నృలోకే
ద్రష్టుం త్వదన్యేన కురుప్రవీర. 48

కురువంశశ్రేష్ఠుడవగు ఓ అర్జునా! ఈ నావిశ్వరూపమును నీవు తప్ప మఱియొకరెవరును ఈ మనుష్యలోకమున చూచియుండలేదు. (నా యనుగ్రహముచే) నీవు చూడగల్గితివి. మఱియు వేదాధ్యయన యజ్ఞాధ్యయనములచేగాని, దానములచేగాని, (అగ్నిహోత్రాది శ్రౌతస్మార్తాది) క్రియలచేగాని, ఘోరతపస్సులచేగాని (ఇట్టి విశ్వరూపుడనగు) నన్ను చూచుటకు శక్యముగాదు.

మా తే వ్యథామాచ విమూఢభావో
దృష్ట్వా రూపం ఘోరమీ
దృఙ్మమేదమ్
వ్యపేతభీః ప్రీతమనాః పునస్త్వం
తదేవ మే రూపమిదం ప్రపశ్య. 49

ఇటువంటి భయంకరమైన నా (విశ్వ) రూపమును జూచి నీవు భయమునుగాని, చిత్తవికలత్వమునుగాని



పొందకుము. నీవు నిర్భయుడవును ప్రసన్నచిత్తుడవును అయి నా యీ పూర్వరూపమునే మఱల బాగుగ జూడుము.

సంజయ ఉవాచ :-

ఇత్యర్జునం వాసుదేవ స్తథోక్త్వా
స్వకంరూపందర్శయామాస
భూయః
ఆశ్వాసయామాస చ భీత మేనం
భూత్వా పునస్సౌమ్యవపుర్మహాత్మా.

సంజయుడు చెప్పెను - (ఓ ధృతరాష్ట్రమహారాజా!) ఈప్రకారముగ శ్రీకృష్ణుడు అర్జునునకు జెప్పి ఆ ప్రకారమేతన పూర్వరూపమును మఱల జూపెను. మహాత్ముడగు ఆ శ్రీకృష్ణమూర్తి తన సౌమ్యరూపమును వహించి భయపడియున్న అర్జునుని ఓదార్చెను.

అర్జున ఉవాచ :-

దృష్ట్వేదం మానుషం రూపం
తవ సౌమ్యం జనార్దన,

ఇదానీమస్మి సంవృత్త
స్సచేతాః ప్రకృతిం గతః. 51

అర్జునుడు చెప్పెను—

ఓ కృష్ణా! నీయొక్క ప్రశాంతమైన ఈ మనుష్య రూపమును జూచి యిపుడు నామనస్సు కుదుటపడి నది. మఱియు నేను స్వస్థతను బొందితిని.

శ్రీ భగవానువాచ :—

సుదుర్దర్శమిదం రూపం
దృష్టవానసి యన్మమ,
దేవా అప్యస్య రూపస్య
నిత్యం దర్శనకాఙ్క్షిణః. 52

శ్రీ భగవానుడు చెప్పెను—

నాయొక్క ఏ రూపమును నీ విపుడు చూచితివో అది మహా దుర్లభమైనది. దేవతలు కూడ నిత్యము అద్దానిని దర్శనము చేయుగోరుచుందురు.



నాహం వేదైర్న తపసా
న దానేన న చేజ్యయా,
శక్య ఏవం విధో ద్రష్టుం
దృష్టవానసి మాం యథా. 53

నన్ను ఏ రీతిగ నీవు చూచితివో, అటువంటి రూపముగల నేను వేదములచే (వేదాధ్యయనపరులచే)గాని— తపస్సుచేగాని, దానముచేగాని యజ్ఞముచేగాని చూచుటకు శక్యుడనుగాను.

భక్త్యా త్వనన్యయా శక్య
అహమేవంవిధోఽర్జున,
జ్ఞాతుం ద్రష్టుం చ తత్త్వేన
ప్రవేష్టుం చ పరన్తప. 54

శత్రువులనుతపింపజేయువాడా! ఓఅర్జునా! ఈవిధముగు రూపముగల నేను అనన్యభక్తిచేత మాత్రమే యథార్థముగ తెలిసికొనుటకును, చూచుటకును ప్రవేశించుటకును, సాధ్యమైనవాడనగుచున్నాను.

మత్కర్మకృన్మత్పరమో
మద్భక్తస్సఙ్గవర్జితః,
నిర్వైరస్సర్వభూతేషు
యస్స మామేతి పాణ్డవ. 55

అర్జునా ! ఎవడు నాకొఱకే కర్మలఁజేయునో [లేక నా సంబంధమైన (దైవసంబంధమైన) కార్యములనే చేయునో], నన్నే పరమప్రాప్యముగ నమ్మియుండునో నాయందే భక్తిగలిగియుండునో, సమస్తదృశ్యపదార్థములందును సంగమును (ఆసక్తిని, మమత్వమును) విడిచివేయునో, సమస్తప్రాణులయందును ద్వేషము లేకయుండునో అట్టివాడు నన్ను పొందుచున్నాడు.

ఇతి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు
బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే
శ్రీ కృ ష్ణా ర్జు న సం వా దే
విశ్వరూపసందర్శనయోగో నామ
ఏకాదశోఽధ్యాయః.

---

ఓమ్

శ్రీకృష్ణపరబ్రహ్మణే నమః

# శ్రీ భగవద్గీత

## అథ ద్వాదశోఽధ్యాయః

### భక్తియోగః

**అర్జున ఉవాచ :—**

ఏవం సతతయుక్తా యే
భక్తాస్త్వాం పర్యుపాసతే,
యే చాప్యక్షర మవ్యక్తం
తేషాం కే యోగవిత్తమాః. 1

అర్జునుడు చెప్పెను—

ఈ ప్రకారముగ ఎల్లప్పుడును నీయందే మనస్సును నెలకొల్పినవారై ఏ భక్తులు నిన్నుపాసించుచున్నారో, మఱియు ఎవరు ఇంద్రియగోచరముగాని అక్షరపరబ్రహ్మమును ధ్యానించుచున్నారో, ఆయిరు తెగలవారిలో యోగమును బాగుగ నెఱిగినవారెవరు

శ్రీ భగవానువాచ :-

మయ్యావేశ్య మనో యే మాం
నిత్యయుక్తా ఉపాసతే,
శ్రద్ధయా పరయోపేతా
స్తే మే యుక్తతమా మతాః. 2

శ్రీ భగవానుడు చెప్పెను:-

నాయందు మనస్సును నిలిపి నిరంతర దైవ చింతనాపరులై (తదేకనిష్ఠులై) మిక్కిలి శ్రద్ధతో కూడుకొనినవారై ఎవరు నన్నుపాసించుచున్నారో వారే ఉత్తమయోగులని నాయభిప్రాయము.

యే త్వక్షరమనిర్దేశ్య
మవ్యక్తం పర్యుపాసతే,
సర్వత్రగమచిన్త్యం చ
కూటస్థమచలం ధ్రువమ్. 3



సంనియమ్యేన్ద్రియగ్రామం
సర్వత్ర సమబుద్ధయః,
తే ప్రాప్నువన్తి మామేవ
సర్వభూతహితే రతాః. 4

ఎవరు ఇంద్రియము లన్నిటిని బాగుగ నిగ్రహించి (స్వాధీనపఱచుకొని) ఎల్లెడల సమభావము గలవారై సమస్తప్రాణులకును హితమొనర్చుటయం దాసక్తి గలవారై ఇట్టిదని నిర్దేశింప శక్యముకానిదియు, ఇంద్రియములకు గోచరము కానిదియు, చింతింప నలవికానిదియు, నిర్వికారమైనదియు, చలింపనిదియు, నిత్యమైనదియు, అంతటను వ్యాపించియున్నదియు నగు అక్షరబ్రహ్మము నెవరు ధ్యానించుచున్నారో, వారు నన్ను పొందుచున్నారు.

క్లేశోఽధికతర స్తేషా
మవ్యక్తాసక్తచేతసామ్,
అవ్యక్తా హి గతిర్దుఃఖం
దేహవద్భి రవాప్యతే. 5

అవ్యక్త (నిర్గుణ) పరబ్రహ్మమునం దాసక్తిగల మనస్సుగలవారికి(బ్రహ్మమందునిష్ఠను బొందుటలో సగుణోపాసకులకంటె)పరిశ్రమ చాల అధికముగ నుండును. ఏలయనిన నిర్గుణోపాసనా మార్గము దేహాభిమానము గలవారిచేత అతికష్టముగా పొందబడుచున్నది.

యే తు సర్వాణి కర్మాణి
మయి సన్న్యస్య మత్పరాః,
అనన్యేనైవ యోగేన
మాం ధ్యాయన్త ఉపాసతే. 6

తేషామహం సముద్ధర్తా
మృత్యుసంసారసాగరాత్,
భవామి న చిరాత్పార్థ
మయ్యావేశిత చేతసామ్. 7

ఓ అర్జునా! ఎవరు సమస్తకర్మములను నాయందు సమర్పించి, నన్నే పరమగతిగ దలచినవారై అనన్య



చిత్తముతో నన్నే ధ్యానించుచు ఉపాసించుచున్నారో, నాయందు చిత్తమును జేర్చిన అట్టివారిని మృత్యురూపమగు ఈ సంసారసముద్రమునుండి నేను శీఘ్రముగ బాగుగ లేవదీయుచున్నాను.

మయ్యేవ మన ఆధత్స్వ
మయి బుద్ధిం నివేశయ,
నివసిష్యసి మయ్యేవ
అత ఊర్ధ్వం న సంశయః. 8

నాయందే మనస్సును స్థిరముగా నిల్పుము. నాయందే బుద్ధిని ప్రవేశపెట్టుము. పిమ్మట నాయందే నివసింతువు. సందేహము లేదు.

అథ చిత్తం సమాధాతుం
న శక్నోషి మయి స్థిరమ్,
అభ్యాసయోగేన తతో
మామిచ్ఛాప్తుం ధనంజయ. 9

ఓ అర్జునా! ఒకవేళ ఆప్రకారము మనస్సును నాయందు స్థిరముగ నిలుపుటకు నీకు శక్తిలేనిచో అత్తఱి అభ్యాసయోగముచే నన్ను పొందుటకు ప్రయత్నింపుము. (అభ్యాసముచే ఆ స్థితిని ఎట్లైనను సాధింపుమని భావము.)

అభ్యాసేఽప్యసమర్థోఽసి
మత్కర్మపరమో భవ,
మదర్థమపి కర్మాణి
కుర్వన్ సిద్ధిమవాప్స్యసి. **10**

ఒకవేళ అభ్యాసము చేయుటయందును నీవసమర్థుడవైతివేని నాసంబంధమైన కర్మలఁజేయుటయందాసక్తి గలవాడవుకమ్ము. అట్లు నాకొఱకు కర్మలను జేయుచున్నను గూడ నీవు మోక్షస్థితిని బడయగలవు.

అథైతదప్యశక్తోఽసి
కర్తుం మద్యోగమాశ్రితః,



సర్వకర్మఫలత్యాగం
తతః కురు యతాత్మవాన్. **11**

ఇక నన్ను గూర్చిన యోగము నవలంబించినవాడవై దీనినిగూడ నాచరించుటకు శక్తుడవుకానిచో అటుపిమ్మట నియమింపబడిన మనస్సుగలవాడవై సమస్తకర్మములయొక్క ఫలములను త్యజించివేయుము.

శ్రేయో హి జ్ఞానమభ్యాసాత్
జ్ఞానాద్ధ్యానం విశిష్యతే,
ధ్యానాత్కర్మఫలత్యాగ
స్త్యాగాచ్ఛాన్తిరనన్తరమ్. **12**

వివేకముతోఁగూడని అభ్యాసముకంటె (శాస్త్రజన్య) జ్ఞానము శ్రేష్ఠమైనదికదా! (శాస్త్రజన్య) జ్ఞానముకంటె ధ్యానము శ్రేష్ఠమగుచున్నది. ధ్యానము (ధ్యానకాలమందు మాత్రము నిర్విషయముగనుండు మనఃస్థితి) కంటె కర్మఫలమును విడుచుట (ప్రవృత్తియందును విషయ దోషములేకుం-

డుట) శ్రేష్ఠమైయున్నది. అట్టి కర్మఫలత్యాగముచే శీఘ్రముగ (చిత్త) శాంతి లభించుచున్నది.

అద్వేష్టా సర్వభూతానాం
మైత్రః కరుణ ఏవ చ,
నిర్మమో నిరహంకారః
సమదుఃఖసుఖః క్షమీ. **13**

సంతుష్ట స్సతతం యోగీ
యతాత్మా దృఢనిశ్చయః,
మయ్యర్పిత మనోబుద్ధి
ర్యోమద్భక్తస్స మే ప్రియః. **14**

సమస్త ప్రాణులయెడల ద్వేషము లేనివాడును, మైత్రికరుణగలవాడును, అహంకార మమకారములు లేనివాడును, సుఖదుఃఖములందు సమభావముగలవాడును, ఓర్పుగలవాడును, ఎల్లప్పుడు సంతృప్తితో గూడియుండువాడును యోగయుక్తుడును, మనస్సును స్వాధీనపఱచుకొనినవాడును, దృఢమైననిశ్చయము



గలవాడును, నాయందు సమర్పింపబడిన మనోబుద్ధులు గలవాడును, నాయందు భక్తిగలవాడును ఎవడు కలడో, అతడు నాకు ఇష్టుడు.

యస్మాన్నో ద్విజతే లోకో
లోకాన్నో ద్విజతే చ యః,
హర్షామర్ష భయోద్వేగై
ర్ముక్తో యస్స చ మే ప్రియః. **15**

ఎవని వలన ప్రపంచము (జనులు) భయమును బొందదో, లోకమువలన ఎవడు భయమును బొందడో, ఎవడు సంతోషము, క్రోధము, భయము, మనోవ్యాకులత మున్నగునవి లేకుండునో అట్టివాడు నాకు ఇష్టుడు.

అనపేక్ష శ్శుచిర్దక్ష
ఉదాసీనో గతవ్యథః,
సర్వారమ్భ పరిత్యాగీ
యో మద్భక్తస్స మే ప్రియః. **16**

కోరికలు లేనివాడును, బాహ్యాభ్యంతరశుద్ధిగలవాడును, కార్యసమర్థుడు (సమయస్ఫూర్తిగలవాడును), తటస్థుడును, దిగులు (దుఃఖము) లేనివాడును సమస్తకార్యములందును కర్తృత్వమును వదలినవాడును(లేక సమస్తకామ్యకర్మలను, శాస్త్రనిషిద్ధకర్మలను త్యజించినవాడును) నాయందుభక్తి గలవాడును, ఎవడు కలడో అతడునాకు ఇష్టుడు.

యో న హృష్యతి న ద్వేష్టి
న శోచతి న కాఙ్క్షతి,
శుభాశుభ పరిత్యాగీ
భక్తిమాన్ యస్స మే ప్రియః. 17

ఎవడుసంతోషింపడో, ద్వేషింపడో, శోకమును బొందడో, ఎవడు శుభాశుభములను విడిచినవాడో, అట్టి భక్తుడు నాకు ఇష్టుడు.

సమశ్శత్రౌ చ మిత్రేచ
తథా మానావమానయోః,



శీతోష్ణసుఖదుఃఖేషు
సమస్సఙ్గవివర్జితః. 18

తుల్యనిన్దాస్తుతిర్మౌనీ
సన్తుష్టో యేన కేనచిత్,
అనికేతః స్థిరమతి
ర్భక్తిమాన్మే ప్రియో నరః. 19

శత్రువునందును మిత్రునియందును, మానావమానములందును, శీతోష్ణ సుఖదుఃఖములందును సమముగ నుండువాడును, దేనియందును సంగము (ఆసక్తి, మనస్సంబంధము) లేనివాడును, నిందాస్తుతులందు సమముగనుండువాడును, మౌనముతో నుండువాడును (లేక మనన శీలుడును), దేనిచేతనైనను (దొరికినదానితో) తృప్తినిబొందువాడును, నిర్దిష్టమగు నివాసస్థానము లేనివాడును(లేక గృహాదులందాసక్తి లేనివాడును), నిశ్చయమగు బుద్ధి గలవాడును, భక్తితో గూడియుండువాడునగు

యే తు ధర్మ్యామృతమిదం
యథోక్తం పర్యుపాసతే,
శ్రద్దధానా మత్పరమా
భక్తాస్తేఽతీవ మే ప్రియాః. **20**

ఎవరైతే శ్రద్ధావంతులై, నన్నే పరమగతిగ నమ్మి (నాయందాసక్తిగలవారై) ఈ అమృతరూపమగు (మోక్షసాధనమైన) ధర్మమును (ఇప్పుడుచెప్పబడిన ప్రకారము) అనుష్ఠించుదురో అట్టి భక్తులు నాకు మిక్కిలి ఇష్టులు.

ఇతి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు
బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే
శ్రీ కృష్ణార్జున సంవాదే
భక్తియోగో నామ
ద్వాదశోఽధ్యాయః.

---

ఓం

శ్రీకృష్ణపరబ్రహ్మణే నమః

# శ్రీ భగవద్గీత

## అథ త్రయోదశోఽధ్యాయః

### క్షేత్రక్షేత్రజ్ఞవిభాగయోగః

అర్జున ఉవాచ :–

ప్రకృతిం పురుషం చైవ
క్షేత్రం క్షేత్రజ్ఞమేవ చ,
ఏతద్వేదితుమిచ్ఛామి
జ్ఞానం జ్ఞేయం చ కేశవ. **1**

అర్జునుడు చెప్పెను—

ఓ కృష్ణా! ప్రకృతిని, పురుషుని, క్షేత్రమును, క్షేత్రజ్ఞుని, జ్ఞానమును, జ్ఞేయమును – వీనినన్నిటిని గూర్చి నేను తెలిసికొనగోరుచున్నాను.

శ్రీ భగవానువాచ :—

ఇదం శరీరం కౌన్తేయ
క్షేత్ర మిత్యభిధీయతే,
ఏతద్యో వేత్తి తం ప్రాహుః
క్షేత్రజ్ఞ ఇతి తద్విదః. **2**

శ్రీ భగవంతుడు చెప్పెను–కుంతీ పుత్రుడవగు ఓ అర్జునా! ఈశరీరమే క్షేత్రమనబడుచున్నది. దీనిని తెలిసికొనువాడు, క్షేత్రజ్ఞుడని క్షేత్రక్షేత్రజ్ఞుల నెఱిగినవారు చెప్పుదురు.

క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి
సర్వక్షేత్రేషు భారత,
క్షేత్రక్షేత్రజ్ఞయోర్జ్ఞానం
యత్తజ్జ్ఞానం మతం మమ. **3**

అర్జునా! సమస్త క్షేత్రములందును (శరీరములందును) నన్ను క్షేత్రజ్ఞునిగ గూడ నెఱుగుము.



క్షేత్రక్షేత్రజ్ఞులను గూర్చిన జ్ఞానమేదికలదో, అదియే వాస్తవమగు జ్ఞానమని నా యభిప్రాయము.

తత్క్షేత్రం యచ్చ యాదృక్చ
యద్వికారి యతశ్చ యత్,
స చ యో యత్ప్రభావశ్చ
తత్సమాసేన మే శృణు. **4**

ఆ క్షేత్రమేదియో, ఎటువంటిదో, ఎట్టి వికారములుకలదో, దేనినుండి యేరీతిగ నుత్పన్నమైనదో, ఆ క్షేత్రజ్ఞుడును ఎవడో, ఎట్టి ప్రభావముకలవాడో ఆ విషయములన్నింటిని సంక్షేపముగ నావలన వినుము.

ఋషిభిర్బహుధా గీతం
ఛన్దోభిర్వివిధైః పృథక్,
బ్రహ్మసూత్రపదైశ్చైవ
హేతుమద్భిర్వినిశ్చితైః. **5**

(ఆ క్షేత్రక్షేత్రజ్ఞజ్ఞానము) ఋషులచే అనేక ప్రకారములుగా నానావిధములైన వేదములద్వారా

వేఱువేఱుగా ప్రతిపాదింపబడినది. మఱియు హేతువులతో (యుక్తులతో) గూడి బాగుగ నిశ్చయింపబడినట్టి బ్రహ్మసూత్రవాక్యములచేతగూడ నయ్యది చెప్పబడియున్నది.

మహాభూతాన్యహఙ్కారో
బుద్ధిరవ్యక్తమేవ చ
ఇన్ద్రియాణి దశైకం చ
పఞ్చ చేన్ద్రియగోచరాః. 6

ఇచ్ఛా ద్వేషస్సుఖం దుఃఖం
సఙ్ఘాతశ్చేతనా ధృతిః,
ఏతత్క్షేత్రం సమాసేన
సవికారముదాహృతమ్. 7

పంచమహాభూతములు అహంకారము, బుద్ధి, మూలప్రకృతి, పదునొకండు ఇంద్రియములు (దశేంద్రియములు మనస్సు), ఐదు ఇంద్రియవిషయములు (శబ్ద స్పర్శాదులు), కోరిక, ద్వేషము, సుఖము,



దుఃఖము, దేహేంద్రియాదుల సముదాయము, తెలివి (వృత్తిజ్ఞానము), ధైర్యము అను వీని సముదాయమై వికారసహితమైనట్టి క్షేత్రము సంక్షేపముగా చెప్పబడినది.

అమానిత్వమదమ్భిత్వ
మహింసా క్షాన్తిరార్జవమ్,
ఆచార్యోపాసనం శౌచం
స్థైర్యమాత్మవినిగ్రహః. 8

ఇన్ద్రియార్థేషు వైరాగ్య
మనహంకార ఏవ చ
జన్మమృత్యుజరావ్యాధి
దుఃఖదోషానుదర్శనమ్. 9

అసక్తిరనభిష్వఙ్గః
పుత్రదారగృహాదిషు,

నిత్యం చ సమచిత్తత్వ
మిష్టానిష్టోపపత్తిషు. 10

మయి చానన్యయోగేన
భక్తిరవ్యభిచారిణీ,
వివిక్తదేశ సేవిత్వ
మరతిర్జనసంసది. 11

అధ్యాత్మజ్ఞాననిత్యత్వం
తత్త్వజ్ఞానార్థ దర్శనమ్,
ఏతజ్జ్ఞానమితి ప్రోక్త
మజ్ఞానం యదతోఽన్యథా. 12

తన్ను తాను పొగడుకొనకుండుట, డంబము లేకుండుట, (మనోవాక్కాయములచే) పరప్రాణులను బాధింపకుండుట, ఓర్పుగలిగియుండుట, ఋజుత్వము(శుద్ధి)గలిగియుండుట, సన్మార్గమున(మోక్ష



మార్గమున) స్థిరముగా నిలబడుట, మనస్సును బాగుగా నిగ్రహించుట, ఇంద్రియ విషయములగు శబ్దస్పర్శాదులందు విరక్తిగలిగియుండుట, అహంకారము లేకుండుట, పుట్టుక, చావు, ముసలితనము, రోగము—అనువానివలన కలుగు దుఃఖమును, దోషమును మాటిమాటికి స్మరించుట, కొడుకులు(సంతానము), భార్య, ఇల్లు మున్నగువానియందు ఆసక్తి లేకుండుట, మఱియు వానియందు తగులము లేకుండుట (వారికి కలుగు సుఖదుఃఖములు తనకే కలిగినట్లు అభిమానింపకుండుట), ఇష్టానిష్టములు(శుభాశుభములు)సంప్రాప్తించినపుడెల్లపుడును సమబుద్ధి గలిగియుండుట, నాయందు (భగవంతునియందు) అనన్యమైన (నిశ్చల) భక్తిగలిగియుండుట, ఏకాంత ప్రదేశమును (ప్రతిబంధములేనిచోటును) ఆశ్రయించుట, జనసమూహమునందు ప్రీతిలేకుండుట, అధ్యాత్మజ్ఞానము(ఆత్మనిష్ఠ) నిరంతరము గలిగియుండుట, తత్త్వజ్ఞానముయొక్క గొప్పప్రయోజనమును తెలిసికొనుట అను నిదియంతయు జ్ఞానమని చెప్పబడును. దీనికి వ్యతిరేకమైనది అజ్ఞానము (అని తెలియదగినది).

జ్ఞేయం యత్తత్ప్రవక్ష్యామి
యజ్జ్ఞాత్వాఽమృతమశ్నుతే,
అనాదిమత్పరం బ్రహ్మ
న సత్తన్నాసదుచ్యతే. 13

ఏది తెలియదగిన బ్రహ్మస్వరూపమో, దేనిని తెలిసికొని మనుజుడు అమృతస్వరూపమగు మోక్షమును బొందుచున్నాడో అదానిని బాగుగచెప్పబోవుచున్నాను. అది లేనట్టి పరబ్రహ్మమనబడునయ్యది సత్తనిగాని (ఉన్నదనిగాని) అసత్తనిగాని (లేదనిగాని) చెప్పబడదు.

సర్వతః పాణిపాదం త
త్సర్వతోఽక్షిశిరోముఖమ్,
సర్వతః శ్రుతిమల్లోకే
సర్వమావృత్య తిష్ఠతి. 14

అది (ఆ బ్రహ్మము, ఆత్మ) అంతటను చేతులు కాళ్ళు గలదియు, అంతటను కన్నులు, తలలు, ముఖ



ములు కలదియు అంతటను చెవులు గలదియునయి ప్రపంచమునందు సమస్తమును ఆవరించి (వ్యాపించుకొని) యున్నది.

సర్వేన్ద్రియగుణాభాసం
సర్వేన్ద్రియ వివర్జితమ్,
అసక్తం సర్వభృచ్చైవ
నిర్గుణం గుణభోక్తృ చ. 15

బహిరన్తశ్చ భూతానా
మచరం చరమేవ చ,
సూక్ష్మత్వాత్తదవిజ్ఞేయం
దూరస్థం చాన్తికే చ తత్. 16

అవిభక్తం చ భూతేషు
విభక్తమివ చ స్థితమ్,

భూతభర్తృ చ తజ్జ్ఞేయం
గ్రసిష్ణు ప్రభవిష్ణు చ. **17**

జ్యోతిషామపి తజ్జ్యోతి
స్తమసః పరముచ్యతే,
జ్ఞానం జ్ఞేయం జ్ఞానగమ్యం
హృది సర్వస్య విష్ఠితమ్. **18**

యస్వరూపమగు) ఆబ్రహ్మము సమస్తము ఇంద్రియములయొక్క గుణములను ప్రకాశింపచేయునదియు, సమస్తేంద్రియములు లేనిదియు, దేనిని భరించనిదియు, సమస్తమును భరించునదియు (సత్త్వరజస్తమో) గుణరహితమైనదియు, గుణముల ననుభవించునదియు, ప్రాణులయొక్క వెలుపలను, లోపలను ఉండునదియు, కదలనిదియును, కదలునదియు, అతిసూక్ష్మమై యుండుటవలన (అజ్ఞానులకు) తెలియబడనిదియు, దూరముగానుండునదియు, దగ్గరగాకూడ నుండునదియు, విభజింపబడనిది



యైనను ప్రాణులందు విభజింపబడినదానివలె నున్నదియు, ప్రాణులను సృష్టించునదియు, పోషించునదియు, లయింపజేయునదియు అని తెలిసికొనదగినది. మఱియు నది ప్రకాశించెడు సూర్యచంద్రాగ్న్యాది పదార్థములకుగూడ ప్రకాశము నిచ్చునదియు, తమస్సు (అజ్ఞానము) కంటె వేఱైనదియు (లేక అతీతమైనదియు), జ్ఞానస్వరూపమైనదియు (చిన్మయరూపమును), తెలియదగినదియు, (అమానిత్వాది) జ్ఞానగుణములచే బొందదగినదియు, సమస్త ప్రాణులయొక్క హృదయమునందు విశేషించి యున్నదియునని చెప్పబడుచున్నది.

ఇతి క్షేత్రం తథా జ్ఞానం
జ్ఞేయం చోక్తం సమాసతః,
మద్భక్త ఏతద్విజ్ఞాయ
మద్భావాయోపపద్యతే. **19**

ఈ ప్రకారము క్షేత్రము, అట్లే జ్ఞానము జ్ఞేయముకూడ సంక్షేపముగ చెప్పబడినవి. నాభక్తుడు (నాయందుభక్తిగలవాడు) వీని నెఱింగి నాస్వరూ

పమును(మోక్షమును, భగవదైక్యమును) బొందుట కర్హుడగుచున్నాడు.

ప్రకృతిం పురుషం చైవ
విద్ధ్యనాదీ ఉభావపి,
వికారాంశ్చ గుణాంశ్చైవ
విద్ధి ప్రకృతిసంభవాన్. 20

(ఓ అర్జునా!) ప్రకృతిని పురుషుని–ఉభయులను ఆది లేనివారినిగ నెఱుగుము. (మనోబుద్ధీంద్రియాదుల) వికారములను, (సత్త్వరజస్తమో) గుణములను ప్రకృతివలన గలిగినవిగా నెఱుఁగుము.

కార్యకారణకర్తృత్వే
హేతుః ప్రకృతి రుచ్యతే,
పురుషస్సుఖదుఃఖానాం
భోక్తృత్వే హేతురుచ్యతే. 21

కార్యకారణములను గలుగజేయుటయందు ప్రకృతి హేతువనియు సుఖదుఃఖముల ననుభవించు



టయందు పురుషుడు హేతువనియు చెప్పబడు చున్నది.

పురుషః ప్రకృతిస్థో హి
భుఙ్క్తే ప్రకృతిజాన్గుణాన్
కారణం గుణసఙ్గోఽస్య
సదసద్యోని జన్మసు. 22

ప్రకృతియందున్నవాడై పురుషుడు(జీవుడు) ప్రకృతి వలన బుట్టిన (సుఖదుఃఖాది) గుణములను అనుభవించుచున్నాడు. ఆ యా గుణములతోడి కూడికయే ఈ జీవునకు ఉత్తమ నికృష్టజన్మము నెత్తుటయందు హేతువై యున్నది.

ఉపద్రష్టానుమన్తా చ
భర్తా భోక్తా మహేశ్వరః,
పరమాత్మేతి చాప్యుక్తో
దేహేఽస్మిన్పురుషః పరః. 23

పురుషుడు(ఆత్మ) ఈ శరీరమందున్నప్పటికిని శరీ

రముకంటె వేఱైనవాఁడును, సాక్షిభూతుఁడును, అనుమతించువాఁడును, ధరించువాఁడును, అనుభవించువాఁడును, పరమేశ్వరుఁడును (గొప్ప ప్రభువు, నియామకుఁడును,) పరమాత్మయు, అని చెప్పఁబడుచున్నాఁడు.

యఏవం వేత్తి పురుషం
ప్రకృతిం చ గుణైస్సహ
సర్వథా వర్తమానోఽపి
న స భూయోఽభిజాయతే. **24**

ఎవఁడీప్రకారముగ పురుషుని (ఆత్మను) గుణములతోఁగూడిన ప్రకృతిని తెలిసికొనుచున్నాఁడో, అతఁడే విధముగ నున్నప్పటికిని మఱల జన్మింపఁడు.

ధ్యానేనాత్మని పశ్యన్తి
కేచిదాత్మాన మాత్మనా,
అన్యే సాంఖ్యేన యోగేన
కర్మయోగేన చాపరే. **25**

ఆత్మను(ప్రత్యగాత్మను లేక పరమాత్మను) కొం



దఱు శుద్ధమగు మనస్సుచే ధ్యానయోగముద్వారా తమయందుగాంచుచున్నారు. (సాక్షాత్కరించుకొనుచున్నారు.) అట్లే మఱికొందఱు సాంఖ్యయోగముచేతను, ఇంక కొందఱు కర్మయోగముచేతను చూచుచున్నారు (అనుభూతమొనర్చుకొనుచున్నారు).

అన్యే త్వేవమజానన్తః
శ్రుత్వాఽన్యేభ్య ఉపాసతే,
తేఽపి చాతితరన్త్యేవ
మృత్యుం శ్రుతిపరాయణాః. **26**

మఱికొందఱైతే ఈప్రకారముగ (ధ్యాన సాంఖ్య కర్మయోగములవలన) తెలిసికొనజాలనివారై, ఇతరులవలన (ఆ పరమాత్మనుగూర్చి) విని ఉపాసించుచున్నారు (అనుష్ఠించుచున్నారు). శ్రవణతత్పరులగువారున్ను మృత్యువును (మృత్యురూపమగు ఈ సంసారమును) తప్పక దాటుదురు.

యావత్సఞ్జాయతే కిఞ్చి
త్సత్త్వం స్థావర జఙ్గమమ్,

క్షేత్రక్షేత్రజ్ఞ సంయోగా

త్తద్విద్ధి భరతర్షభ. 27

భరతవంశశ్రేష్ఠుడవగు ఓ అర్జునా! ఈ ప్రపంచమున స్థావరజంగమాత్మకమగు పదార్థమేదేది పుట్టుచున్నదో, అదియది యంతయు క్షేత్రక్షేత్రజ్ఞుల కూడిక వలననే కలుగుచున్నదని యెఱుగుము.

సమం సర్వేషు భూతేషు

తిష్ఠన్తం పరమేశ్వరమ్

వినశ్యత్స్వవినశ్యన్తం

యః పశ్యతి స పశ్యతి. 28

సమస్త ప్రాణులందును సమముగనున్నట్టి పరమాత్మను, ఆయా ప్రాణుల దేహాదులు నశించినను నశింపనివానినిగ ఎవడు చూచుచున్నాడో (తెలిసికొనుచున్నాడో) అతడే నిజముగ చూచువాడగును (విజ్ఞుడని భావము).



సమం పశ్యన్హి సర్వత్ర

సమవస్థితమీశ్వరమ్,

న హినస్త్యాత్మనాఽఽత్మానం

తతో యాతి పరాం గతిమ్. 29

ఏలయనగా సమస్త ప్రాణులయందును లెస్సగ వెలయుచున్నట్టి పరమాత్మను సమముగ వ్యాపించియున్నట్లు జూచుచు మనుజుడు తన ఆత్మను తాను హింసించుకొనడు. కావున సర్వోత్తమగతిని (మోక్షమును) బొందుచున్నాడు.

ప్రకృత్యైవ చ కర్మాణి

క్రియమాణాని సర్వశః,

యః పశ్యతి తథాఽఽత్మాన

మకర్తారం స పశ్యతి. 30

ఎవడు కర్మలను ప్రకృతిచేతనే సర్వవిధముల చేయబడుచున్నట్లుగను, అట్లే ఆత్మను కర్తకాని

వానిగను చూచుచున్నాడో (తెలిసికొనుచున్నాడో) అతడే నిజముగ చూచుచున్నవాడగును.

యదా భూత పృథగ్భావ
మేకస్థ మనుపశ్యతి,
తత ఏవ చ విస్తారం
బ్రహ్మ సంపద్యతే తదా. **31**

ఎప్పుడు వేర్వేఱుగనున్న ఈ భూతప్రపంచమంతను ఒక్కదానియందు (పరమాత్మయందు) ఉన్న దానిగను, మఱియు దానినుండియే విస్తరించుచున్నదానిగను వీక్షించునో, అపుడు (మనుజుడు) బ్రహ్మమును పొందుచున్నాడు. (లేక బ్రహ్మముగనే అగుచున్నాడు.)

అనాదిత్వాన్నిర్గుణత్వా
త్పరమాత్మాఽయ మవ్యయః,
శరీరస్థోఽపి కౌన్తేయ
న కరోతి న లిప్యతే. **32**



ఓ అర్జునా! ఆదిలేనివాడు (కారణరహితుడు) అగుటచేతను, (త్రి) గుణరహితుడగుటవలనను, ఈ పరమాత్మ శరీరమందున్నప్పటికిని ఏమియు చేయకయు, దేనిచేతను అంటబడకయు నున్నాడు.

యథా సర్వగతం సౌక్ష్మ్యా
దాకాశం నోపలిప్యతే,
సర్వత్రావస్థితో దేహే
తథాఽఽత్మా నోపలిప్యతే. **33**

సర్వత్ర వ్యాపించియున్న ఆకాశము సూక్ష్మముగుటవలన ఏ ప్రకారముగ (ధూళి మున్నగువానిచే) అంటబడదో, ఆప్రకారమే శరీరమంతటను (లేక సకలశరీరములందును) వెలయుచున్న పరమాత్మ (శరీర గుణదోషములచే) అంటబడకయున్నాడు.

యథా ప్రకాశయత్యేకః
కృత్స్నం లోకమిమం రవిః,

క్షేత్రం క్షేత్రీ తథా కృత్స్నం
ప్రకాశయతి భారత. 34

ఓ అర్జునా! సూర్యుడొక్కడే ఈ సమస్తలోకమును ఎట్లు ప్రకాశింపజేయుచున్నాడో, అట్లే క్షేత్రజ్ఞుడగు పరమాత్మ ఈ సమస్తక్షేత్రమును ప్రకాశింపజేయుచున్నాడు.

క్షేత్రక్షేత్రజ్ఞయోరేవ
మన్తరం జ్ఞానచక్షుషా,
భూతప్రకృతిమోక్షం చ
యే విదుర్యాన్తి తే పరమ్. 35

ఎవరు జ్ఞానదృష్టిచేత ఈ ప్రకారముగ క్షేత్రక్షేత్రజ్ఞులయొక్క భేదమును భూతములకు సంబంధించియుండు (లేక, కారణమైన) ప్రకృతి(అవిద్య) నుండి విముక్తినికలుగజేయు ఉపాయమును తెలిసికొందురో వారుపరమాత్మపదమును(మోక్షమును) పొందుదురు.



ఇతి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు
బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే
శ్రీకృష్ణార్జునసంవాదే
క్షేత్రక్షేత్రజ్ఞవిభాగయోగోనామ
త్రయోదశోఽధ్యాయః.

---

ఓమ్

శ్రీకృష్ణపరబ్రహ్మణే నమః

# శ్రీ భగవద్గీత

## అథ చతుర్దశోఽధ్యాయః

## గుణత్రయవిభాగయోగః

శ్రీ భగవానువాచ :–

పరం భూయః ప్రవక్ష్యామి
జ్ఞానానాం జ్ఞానముత్తమమ్,
యజ్జ్ఞాత్వా మునయః సర్వే
పరాం సిద్ధిమితో గతాః. **1**

శ్రీభగవంతుడు చెప్పెను. (ఓ అర్జునా!) దేనిని తెలిసికొని మునులందఱును ఈ సంసారబంధము నుండి (విడివడి) సర్వోత్తమమగు మోక్షసిద్ధిని బడసిరో, అట్టి - పరమాత్మ విషయికమైనదియు,



జ్ఞానములలోకెల్ల ఉత్తమమైనదియునగు జ్ఞానమును మఱల చెప్పుచున్నాను.

ఇదం జ్ఞానముపాశ్రిత్య
మమ సాధర్మ్యమాగతాః,
సర్గేఽపి నోపజాయన్తే
ప్రలయే న వ్యథన్తి చ. **2**

ఈ జ్ఞానము నాశ్రయించి జనులు నాతో సైక్యము నొందినవారై (నా స్వరూపమును బడసి) సృష్టికాలమున జన్మింపరు; ప్రళయకాలమున నశింపరు. (జనన మరణ రహితులై పునరావృత్తిలేక యుందురని భావము.)

మమ యోనిర్మహద్బ్రహ్మ
తస్మిన్ గర్భం దధామ్యహమ్,
సమ్భవః సర్వభూతానాం
తతో భవతి భారత. **3**

అర్జునా! గొప్పదైన మూలప్రకృతి (మాయ)

నాయొక్క సర్వభూతోత్పత్తిస్థానము. అద్దాని యందు నేను గర్భకారణమైన చైతన్య రూపమగు బీజము నుంచుచున్నాను. దానివలన సమస్త ప్రాణుల యొక్కయు ఉత్పత్తి సంభవించుచున్నది.

సర్వయోనిషు కౌన్తేయ
మూర్తయస్సమ్భవన్తి యాః,
తాసాం బ్రహ్మ మహద్యోని
రహం బీజప్రదః పితా. **4**

అర్జునా! (దేవమనుష్యాది) సమస్తజాతులందును ఏ శరీరము లుద్భవించుచున్నవో, వానికి మూల ప్రకృతి (మాయ) యే మాతృస్థానము (తల్లి). నేను బీజమునుంచునట్టి తండ్రిని.

సత్త్వం రజస్తమ ఇతి
గుణాః ప్రకృతిసమ్భవాః,
నిబధ్నన్తి మహాబాహో
దేహే దేహినమవ్యయమ్. **5**



గొప్పభుజములుగల ఓ అర్జునా! ప్రకృతివలన బుట్టిన సత్త్వరజస్తమోగుణములు మూడును నాశరహితుడైన ఆత్మను దేహమునందు (లేక దేహమునకు) బంధించివైచుచున్నవి.

తత్ర సత్త్వం నిర్మలత్వా
త్ప్రకాశక మనామయమ్,
సుఖసఙ్గేన బధ్నాతి
జ్ఞానసఙ్గేన చానఘ. **6**

పాపరహితుడవగు ఓ అర్జునా! ఆ సత్త్వాది గుణములలో సత్త్వగుణము నిర్మలమైనదగుటవలన ప్రకాశమును గలుగజేయునదియు, ఉపద్రవము లేనిదియు (అగుచు), (ఇంద్రియ) సుఖమునందలి యాసక్తి చేతను, (వృత్తి) జ్ఞానమునందలి ఆసక్తి చేతను జీవుని బంధించుచున్నది.

రజో రాగాత్మకం విద్ధి
తృష్ణాసఙ్గసముద్భవమ్,

తన్నిబధ్నాతి కౌన్తేయ
కర్మసఙ్గేన దేహినమ్. 7

ఓ అర్జునా! రజోగుణము దృశ్యవిషయముల యెడల ప్రీతినిగలుగ జేయునదియు, తృష్ణను (కోరికను,) ఆసక్తిని కలుగజేయునదియు, (అని) యెఱుఁగుము. అయ్యది కర్మములందలి ఆసక్తిచేత (కర్మబంధముచేత) ఆత్మను (జీవుని) లెస్సగ బంధించి వేయుచున్నది.

తమస్త్వజ్ఞానజం విద్ధి
మోహనం సర్వదేహినామ్,
ప్రమాదాలస్యనిద్రాభి
స్తన్నిబధ్నాతి భారత. 8

ఓ అర్జునా! తమోగుణము అజ్ఞానమువలన కలుగునదియు, సమస్తప్రాణులకును మోహమును (అవివేకమును) గలుగజేయునదియునని యెఱుఁగుము. అయ్యది మఱపు (పరాకు), సోమరితనము, నిద్ర మొదలగువానిచే జీవుని లెస్సగ బంధించివేయుచున్నది.



సత్త్వం సుఖే సఞ్జయతి
రజః కర్మణి భారత,
జ్ఞానమావృత్య తు తమః
ప్రమాదే సఞ్జయత్యుత. 9

ఓ అర్జునా! సత్త్వగుణము సుఖమందును, రజోగుణము కర్మమునందును, తమోగుణము జ్ఞానమును (వివేకమును) కప్పివైచి ప్రమాదము (పొరపాటు) నందును జీవుని చేర్చుచున్నవి (కలుపుచున్నవి). ఆశ్చర్యము!

రజస్తమశ్చాభిభూయ
సత్త్వం భవతి భారత,
రజస్సత్త్వం తమశ్చైవ
తమస్సత్త్వం రజస్తథా. 10

ఓ అర్జునా! సత్త్వగుణము (బలముకలిగియుండు నపుడు) రజోగుణ తమోగుణములను అణగద్రొక్కి ప్రవర్తించును. అట్లే రజోగుణము సత్త్వగుణ

తమోగుణములను, తమోగుణము సత్త్వగుణ రజోగుణములను అణగద్రొక్కి ప్రవర్తించును.

సర్వద్వారేషు దేహేఽస్మి
న్ప్రకాశ ఉపజాయతే,
జ్ఞానం యదా తదా విద్యా
ద్వివృద్ధం సత్త్వమిత్యుత. 11

ఎపుడీ శరీరమునందు శ్రోత్రాది ఇంద్రియ ద్వారములన్నిటియందును ప్రకాశరూపమగు(బుద్ధి వృత్తిరూపమగు)జ్ఞానము కలుగుచున్నదో, అప్పుడు సత్త్వగుణము బాగుగ వృద్ధినొందుచున్నదని తెలిసికొనవలెను.

లోభః ప్రవృత్తిరారమ్భః
కర్మణామశమః స్పృహా,
రజస్యేతాని జాయన్తే
వివృద్ధే భరతర్షభ. 12

భరతవంశ శ్రేష్ఠుడవగు ఓ అర్జునా! రజోగుణ



మభివృద్ధినొందునపుడు మనుజునియందు లోభత్వము, కార్యములందుప్రవృత్తి (కామ్య, నిషిద్ధ) కర్మములనుప్రారంభించుట, మనశ్శాంతిలేకుండుట (లేక ఇంద్రియనిగ్రహము లేకుండుట) ఆశ, అను నివి పుట్టుచుండును.

అప్రకాశోఽప్రవృత్తిశ్చ
ప్రమాదో మోహ ఏవ చ,
తమస్యేతాని జాయన్తే
వివృద్ధే కురునన్దన. 13

కురువంశీయుడవగు ఓ అర్జునా! తమోగుణము అభివృద్ధినొందినదగుచుండగా మనుజునియందు అవివేకము(బుద్ధిమాంద్యము), సోమరితనము, అజాగ్రత, అజ్ఞానము(మూఢత్వము, లేక విపరీతజ్ఞానము) అను నివి కలుగుచున్నవి.

యదా సత్త్వే ప్రవృద్ధే తు
ప్రలయం యాతి దేహభృత్,

తదోత్తమవిదాం లోకా
నమలాన్ ప్రతిపద్యతే. **14**

ఎప్పుడైతేజీవుడుసత్త్వగుణమభివృద్ధినిబొందినదగుచుండగామరణించునో, అప్పుడతడు ఉత్తమజ్ఞానముగలవారియొక్క పరిశుద్ధములైనలోకములనే పొందును

రజసి ప్రలయం గత్వా
కర్మసంగిషు జాయతే,
తథా ప్రలీన స్తమసి
మూఢయోనిషు జాయతే. **15**

రజోగుణము అభివృద్ధినొందియుండగామరణించువాడు కర్మాసక్తులగు వారి యందు జన్మించుచున్నాడు. అట్లేతమోగుణమభివృద్ధినొందియుండగా మరణించువాడు పామరుల గర్భములందు లేకపశుపక్ష్యాది హీనజాతులందు పుట్టుచున్నాడు.

కర్మణస్సుకృతస్యాహు
స్సాత్త్వికం నిర్మలం ఫలమ్,



రజసస్తు ఫలం దుఃఖ
మజ్ఞానం తమసః ఫలమ్. **16**

సాత్త్వికమైన కర్మమునకు (లేక పుణ్యకార్యములకు) సత్త్వగుణసంబంధమైన నిర్మలసుఖము ఫలమనియు, రజోగుణసంబంధమైనకర్మమునకుదుఃఖము ఫలమనియు, తమోగుణసంబంధమైనకర్మకు అజ్ఞానము ఫలమనియు (పెద్దలు) చెప్పుదురు.

సత్త్వాత్సంజాయతే జ్ఞానం
రజసో లోభ ఏవ చ,
ప్రమాదమోహౌ తమసో
భవతోఽజ్ఞానమేవ చ. **17**

సత్త్వగుణమువలన జ్ఞానము, రజోగుణమువలన లోభము, తమోగుణమువలన అజాగ్రత (మఱపు), భ్రమ, అజ్ఞానము కలుగుచున్నవి.

ఊర్ధ్వం గచ్ఛన్తి సత్త్వస్థా
మధ్యే తిష్ఠన్తి రాజసాః,

జఘన్యగుణవృత్తిస్థా
అధో గచ్ఛన్తి తామసాః. **18**

సత్త్వగుణము కలవారు (మరణానంతరము) ఊర్ధ్వలోకముల కేగుచున్నారు. రజోగుణముగల వారు మధ్యమమగు మనుష్యలోకమునజన్మించుచున్నారు. నీచగుణప్రవృత్తిగలతమోగుణయుతులు (పాతాళాది) అధోలోకములకు (లేక, అల్పములగు పశ్వాదిజన్మలకు) జనుచున్నారు.

నాన్యం గుణేభ్యః కర్తారం
యదా ద్రష్టాఽనుపశ్యతి,
గుణేభ్యశ్చ పరం వేత్తి
మద్భావం సోఽధిగచ్ఛతి. **19**

ఎప్పుడువివేకవంతుడు (సత్త్వాది)గుణములకంటె నితరమును కర్తగా నెంచడో, మఱియు తన్ను గుణములకంటె వేఱగువానినిగ తెలిసికొనుచున్నాడో, అపుడాతడు నాస్వరూపమును (మోక్షమును) బొందుచున్నాడు.



గుణానేతానతీత్య త్రీన్
దేహీ దేహసముద్భవాన్,
జన్మమృత్యుజరాదుఃఖై
ర్విముక్తోఽమృతమశ్నుతే. **20**

జీవుడు దేహోత్పత్తికి కారణభూతములగు ఈ మూడుగుణములను దాటి (దాటినచో) పుట్టుక, చావు, ముసలితనము, దుఃఖములు—అను వానిచేత లెస్సగ విడువబడినవాడై, మోక్షమును (మరణరహిత ఆత్మస్థితిని) బొందుచున్నాడు.

**అర్జున ఉవాచ :—**

కైర్లిఙ్గైస్త్రీన్గుణానేతా
నతీతో భవతి ప్రభో,
కిమాచారః కథం చైతాం
స్త్రీన్గుణానతివర్తతే. **21**

అర్జునుడుపలికెను–ప్రభువగుశ్రీకృష్ణా! ఈమూడుగుణ

ములను దాటినవాడెట్టి లక్షణములతో గూడియుండు
ను? ఎట్టి ప్రవర్తనగలిగియుండును? మఱియు ఈమూడు
గుణములనునాతడే ప్రకారము దాటివేయగల్గును?

శ్రీ భగవానువాచ:—

ప్రకాశం చ ప్రవృత్తిం చ
మోహమేవ చ పాణ్డవ,
న ద్వేష్టి సంప్రవృత్తాని,
న నివృత్తాని కాఙ్క్షతి. **22**

ఉదాసీనవదాసీనో
గుణైర్యో న విచాల్యతే,
గుణా వర్తన్త ఇత్యేవ
యోఽవతిష్ఠతి నేఙ్గతే. **23**

సమదుఃఖసుఖః స్వస్థ
స్సమలోష్టాశ్మకాఞ్చనః,



తుల్యప్రియాప్రియోధీర
స్తుల్యనిన్దాత్మసంస్తుతిః. **24**

మానావమానయోస్తుల్య
స్తుల్యో మిత్రారిపక్షయోః,
సర్వారమ్భపరిత్యాగీ
గుణాతీతస్స ఉచ్యతే. **25**

శ్రీ భగవానుడు చెప్పెను:—

ఓ అర్జునా! ఎవడు తనకు సంప్రాప్తములైన సత్త్వ
గుణసంబంధమగు ప్రకాశమును (సుఖమును)గాని,
రజోగుణసంబంధమగు కార్యప్రవృత్తినిగాని, తమో
గుణసంబంధమగు మోహమును (నిద్రాతంద్రలను)
గాని ద్వేషింపడో, అవి తొలగిపోయినచో వానిని
అపేక్షింపడో, తటస్థునివలె ఉన్నవాడై గుణములచేత
(గుణకార్యములగు సుఖాదులచేత) చలింపజేయ
బడడో, గుణములు ప్రవర్తించుచున్నవని మాత్రము
తెలిసికొనియుండునో, (ఏ పరిస్థితులయందును)
చలింపక నిశ్చలముగ నుండునో, మఱియు ఎవడు

సుఖదుఃఖములందు సమభావము గలవాడును, ఆత్మయందే స్థిరముగనున్నవాడును, మట్టిగడ్డ, రాయి, బంగారము-వీనియందు సమబుద్ధిగలవాడును, ఇష్టానిష్టములందు సమభావము గల్గియుండువాడును, ధైర్యవంతుడును, సమస్త కార్యములందును కర్తృత్వ బుద్ధిని వదలువాడును, (లేక కామ్యకర్మలన్నిటిని విడచువాడును, లేక సమస్తకర్మములను త్యజించి నిరంతరము బ్రహ్మనిష్ఠయందుండువాడును) అయి యుండునో అట్టివాడు గుణాతీతుడని చెప్పబడును.

మాం చ యోఽవ్యభిచారేణ
భక్తియోగేన సేవతే,
స గుణాన్ సమతీత్యైతాన్
బ్రహ్మభూయాయ కల్పతే. 26

ఎవడు నన్నే అచంచలమైన భక్తియోగము చేత సేవించుచున్నాడో అతడీ గుణములన్నిటిని తెస్సగాదాటినవాడై బ్రహ్మస్వరూపముగా నగుటకు (జీవన్ముక్తుడగుటకొఱకు) సమర్థుడగుచున్నాడు



బ్రహ్మణో హి ప్రతిష్ఠాఽహ
మమృతస్యావ్యయస్య చ
శాశ్వతస్య చ ధర్మస్య
సుఖస్యైకాన్తికస్య చ. 27

ఏలయనగా, నేను నాశరహితమును, నిర్వికారమును, శాశ్వతధర్మస్వరూపమును, (దుఃఖమిశ్రితము కాని) నిరతిశయ (అచంచల) ఆనందస్వరూపమును అగు బ్రహ్మమునకు ఆశ్రయమును (అనగా బ్రహ్మముయొక్క స్వరూపమును) అయి యున్నాను.

ఇతి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు
బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే
శ్రీ కృష్ణార్జున సంవాదే
గుణత్రయవిభాగయోగో నామ
చతుర్దశోఽధ్యాయః.

---

ఓం

శ్రీకృష్ణపరబ్రహ్మణే నమః

# శ్రీ భగవద్గీత

## అథ పంచదశోఽధ్యాయః

## పురుషోత్తమప్రాప్తి యోగః

శ్రీ భగవానువాచ :—

ఊర్ధ్వమూలమధఃశాఖ
మశ్వత్థం ప్రాహురవ్యయమ్,
ఛన్దాంసి యస్య పర్ణాని
యస్తం వేదస వేదవిత్. 1

శ్రీ భగవానుడు చెప్పెను—

(ఓ అర్జునా!) దేనికి వేదములు ఆకులుగానున్నవో, అట్టిసంసారమను అశ్వత్థవృక్షము (రావిచెట్టు) నుపైనవేళ్ళుగలదిగను, క్రింద కొమ్మలు గలదిగను, (జ్ఞానప్రాప్తిపర్యంతము)నాశము లేనిదిగను (పెద్దలు)



చెప్పుదురు. దాని నెవడు తెలిసికొను చున్నాడో అతడు వేదార్థము నెఱిగినవాడు అగుచున్నాడు.

అధశ్చోర్ధ్వం ప్రసృతాస్తస్య శాఖా
గుణప్రవృద్ధా విషయ ప్రవాలాః,
అధశ్చ మూలాన్యనుసన్తతాని
కర్మానుబన్ధీని మనుష్యలోకే. 2

ఆ (సంసార)వృక్షముయొక్క కొమ్మలు సత్త్వరజస్తమోగుణములచే వృద్ధిబొందింపబడినవియు, (శబ్దాది) విషయము లనెడు చిగుళ్ళుగలవియునై, క్రిందికిని(స్థావరము మొదలుకొని) మీదికిని(బ్రహ్మలోకమువఱకు)వ్యాపించియున్నవి. మనుష్యలోకమునందు కర్మసంబంధమును (కర్మవాసనలను) గలుగజేయునవియగు దాని వేళ్ళు క్రిందను(మీదనుగూడ) బాగుగ విస్తరించి,(దృఢముగనాటుకొని)యున్నవి.

న రూపమస్యేహ తథోపలభ్యతే
నాన్తో న చాదిర్న చ సంప్రతిష్ఠా,

అశ్వత్థమేనం సువిరూఢమూల
మసఙ్గశస్త్రేణ దృఢేన ఛిత్త్వా,
తతః పదం తత్పరిమార్గితవ్యం
యస్మిన్ గతా న నివర్తన్తి భూయః,
తమేవ చాద్యం పురుషం ప్రపద్యే
యతః ప్రవృత్తిః ప్రసృతా పురాణీ.

ఈ సంసారవృక్షముయొక్క స్వరూపము ఆ లాగున (ఇపుడు వర్ణింపబడినరీతిగా) ఈ ప్రపంచమున (సంసారాసక్తిగలవారిచేత) తెలియబడకున్నది. దాని ఆదిగాని, అంతముగాని, మధ్యము(స్థితి)గాని కనబడకున్నది. గట్టిగ వేళ్లు పాతిన ఈ సంసారమను అశ్వత్థవృక్షమును అసంగమను బలమైన ఆయుధముచే నఱికివైచి అపిమ్మట ఏ స్థానమునకు ప్రవేశించిన వారు మఱల వెనుకకు (సంసారమునకు) రారో, ఎవనినుండి అనాదియైన ఈ సంసారవృక్షముయొక్క ప్రవృత్తి వ్యాపించెనో, (అట్టి) ఆదిపురుషుడగు పర



మాత్మనే శరణుబొందుచున్నాను - అనునట్టి (భక్తి) భావముతో ఆ పరమాత్మపదమును వెదకవలయును.

నిర్మాన మోహా జితసఙ్గదోషా
అధ్యాత్మనిత్యా వినివృత్తకామాః,
ద్వన్ద్వైర్విముక్తాః సుఖదుఃఖసంజ్ఞై
ర్గచ్ఛన్త్యమూఢాః పదమవ్యయం తత్.

అభిమానము (లేక, అహంకారము,) అవివేకము లేనివారును, సంగము దృశ్యపదార్థములందాసక్తి అను దోషమును జయించినవారును, నిరంతరము ఆత్మజ్ఞానము(బ్రహ్మనిష్ఠ)గలవారును, కోరికలన్నియు తెన్నగ(వాసనాసహితముగ) తొలగినవారును, సుఖదుఃఖములగు ద్వంద్వములనుండి బాగుగ విడువబడినవారును అగు జ్ఞానులు అట్టి అవ్యయమగు బ్రహ్మపదమును (మోక్షమును) బొందుచున్నారు.

న తద్భాసయతే సూర్యో
న శశాఙ్కో న పావకః,

యద్గత్వా న నివర్తన్తే
తద్ధామ పరమం మమ. **6**

ఆ(పరమాత్మ)స్థానమును సూర్యుడుకాని, చంద్రుడు కాని, అగ్ని కాని ప్రకాశింపజేయజాలరు. దేనినిపొంది నచో(జనులు) మరల(ఈ సంసారమునకు)తిరిగిరారో అదియే నాయొక్క శ్రేష్ఠమైనస్థానము అయియున్నది.

మమైవాంశో జీవలోకే
జీవభూతస్సనాతనః,
మనఃషష్ఠానీన్ద్రియాణి
ప్రకృతిస్థాని కర్షతి. **7**

నాయొక్కయే అనాదియగు (నిత్యమగు) అంశము జీవలోకమందు జీవుడై ప్రకృతియందున్న త్వక్ చక్షుశ్శ్రోత్ర జిహ్వాఘ్రాణ మనంబులను ఆఱు ఇంద్రియములను ఆకర్షించుచున్నది.

శరీరం యదవాప్నోతి
యచ్చాప్యుత్క్రామతీశ్వరః,



గృహీత్వైతాని సంయాతి
వాయుర్గన్ధానివాశయాత్. **8**

(దేహేంద్రియాది సంఘాతమునకు) ప్రభువగు జీవుడు శరీరమునువిడుచుచున్నప్పుడును, నూతన శరీరమును పొందుచున్నపుడును-పుష్పాది స్థానముల నుండి గాలి వాసనలను గ్రహించిపోవు చందమున-పంచేంద్రియములు, మనస్సు అను ఆఱింటిని గ్రహించి వెడలుచున్నాడు.

శ్రోత్రం చక్షుః స్పర్శనంచ
రసనం ఘ్రాణమేవ చ,
అధిష్ఠాయ మనశ్చాయం
విషయానుపసేవతే. **9**

ఈ జీవుడు(జీవాత్మ) చెవిని, కంటిని, చర్మమును (త్వగింద్రియమును), నాలుకను, ముక్కును, మనస్సును ఆశ్రయించి (శబ్దాది) విషయములను అనుభవించుచున్నాడు.

ఉత్క్రామన్తం స్థితం వాపి
భుఞ్జానం వా గుణాన్వితమ్,
విమూఢా నానుపశ్యన్తి
పశ్యన్తి జ్ఞానచక్షుషః. **10**

(ఒక శరీరమునుండి మఱియొక శరీరమునకు) బయలు దేఱుచున్నవాడును లేక, శరీరమునందున్న వాడును, లేక, విషయముల ననుభవించుచున్న వాడును, (సత్త్వాది) గుణములతో గూడినవాడు నగు ఈ జీవాత్మను అజ్ఞానులు చూడజాలరు.(తెలిసి కొనజాలరు). జ్ఞానదృష్టిగలవారుమాత్రము చూచు చున్నారు. (తెలిసికొనుచున్నారు).(అనగా ఆ యా క్రియలు జరుపుచున్నపుడాతనిని అజ్ఞు లెఱుఁగజాల రనియు, జ్ఞానులుమాత్ర మెఱుఁగగలరనియు భావము.)

యతన్తో యోగినశ్చైనం
పశ్యన్త్యాత్మన్యవస్థితమ్,



యతన్తోఽప్యకృతాత్మానో
నైనం పశ్యన్త్యచేతసః. **11**

(ఆత్మసాక్షాత్కారమునకై) ప్రయత్నముచేయు చున్న యోగులు దేహమయందున్నట్టి ఈ ఆత్మను చూచుచున్నారు. (అనుభూతమొనర్చుకొను చున్నారు). అట్లు ప్రయత్నము చేయుచున్నవారైనను చిత్తశుద్ధిలేని అవివేకులు ఈ ఆత్మను చూడజాలకున్నారు.

యదాదిత్యగతం తేజో
జగద్భాసయతేఽఖిలమ్,
యచ్చన్ద్రమసి యచ్చాగ్నౌ
తత్తేజో విద్ధి మామకమ్. **12**

సూర్యునియందే తేజస్సు(ప్రకాశము, చైతన్యము) ప్రపంచమునంతను ప్రకాశింపజేయుచున్నదో, అట్లే చంద్రునియందును, అగ్నియందును ఏ తేజస్సు గలదో, ఇదియంతయు నాదిగా నెఱుఁగుము.

గామావిశ్య చ భూతాని
ధారయామ్యహమోజసా,
పుష్ణామి చౌషధీస్సర్వా
స్సోమో భూత్వా రసాత్మకః. 13

మఱియు నేను భూమిని ప్రవేశించి శక్తిచేత సమస్తప్రాణికోట్లను ధరించుచున్నాను (నిలుపుచున్నాను) రసస్వరూపుడగు చంద్రుడనై సస్యము లన్నింటిని పోషించుచున్నాను.

అహం వైశ్వానరో భూత్వా
ప్రాణినాం దేహమాశ్రితః,
ప్రాణాపానసమాయుక్తః
పచామ్యన్నం చతుర్విధమ్. 14

నేను 'వైశ్వానరుడ'ను జఠరాగ్నిగానయి ప్రాణులయొక్క శరీరమును ఆశ్రయించి, ప్రాణాపాన వాయువులతో గూడుకొని నాలుగు విధములగు అన్నమును పచనముచేయుచున్నాను.



సర్వస్య చాహం హృది సన్నివిష్టో
మత్తః స్మృతిర్జ్ఞానమపోహనం చ,
వేదైశ్చ సర్వైరహమేవ వేద్యో
వేదాన్తకృద్వేదవిదేవ చాహమ్. 15

నేను సమస్తప్రాణులయొక్క హృదయమందున్నవాడను. నావలననే (జీవునకు) జ్ఞాపకశక్తి, జ్ఞానము (తెలివి), మఱపు కలుగుచున్నవి. వేదములన్నిటిచేతను తెలియదగినవాడను నేను అయియున్నాను: మఱియు వేదము నెఱిగినవాడను గూడ నేనే అయియున్నాను.

ద్వావిమౌ పురుషౌ లోకే
క్షరశ్చాక్షర ఏవ చ
క్షరస్సర్వాణి భూతాని
కూటస్థోఽక్షర ఉచ్యతే. 16

ప్రపంచమునందు క్షరుడనియు, అక్షరుడనియు ఇరువురు పురుషులుకలరు. అందు సమస్తప్రాణుల

దేహములు (ఉపాధులు) క్షరుడనియు, కూటస్థుడగు జీవుడు అక్షరుడనియు చెప్పబడుచున్నారు.

ఉత్తమః పురుష స్త్వన్యః
పరమాత్మేత్యుదాహృతః,
యో లోకత్రయమావిశ్య
బిభర్త్యవ్యయ ఈశ్వరః. **17**

ఎవడు మూడులోకములందును ప్రవేశించి వానిని భరించుచున్నాడో, అట్టి నాశరహితుడును, జగన్నియామకుడును, (పైన తెలిపిన క్షరాక్షరులిద్దరికంటెను) వేరైనవాడును నగు ఉత్తమపురుషుడు పరమాత్మయని చెప్పబడుచున్నాడు.

యస్మాత్క్షరమతీతోఽహ
మక్షరాదపి చోత్తమః,
అతోఽస్మి లోకే వేదే చ
ప్రథితః పురుషోత్తమః. **18**



నేను క్షరస్వరూపునికంటె మించినవాడను, అక్షరస్వరూపుని (జీవుని) కంటె శ్రేష్ఠుడను అయి యున్నందువలన ప్రపంచమునందును, వేదమునందును 'పురుషోత్తము'డని ప్రసిద్ధికెక్కియున్నాను.

యో మామేవ మసమ్మూఢో
జానాతి పురుషోత్తమమ్,
స సర్వవిద్భజతి మాం
సర్వభావేన భారత. **19**

ఓ అర్జునా! ఎవడు అజ్ఞానములేనివాడై ఈప్రకారముగ నన్ను పురుషోత్తమునిగా తెలిసికొనుచున్నాడో, అతడు సమస్తమును తెలిసినవాడగుచు పూర్తి మనస్సుతో (సర్వవిధముల) నన్ను భజించుచున్నాడు

ఇతి గుహ్యతమం శాస్త్ర
మిదముక్తం మయాఽనఘ,
ఏతద్బుద్ధ్వా బుద్ధిమాన్ స్యా
త్కృతకృత్యశ్చ భారత. **20**

పాపరహితుడవగు ఓ అర్జునా! ఈ ప్రకారముగ అతిరహస్యమైనట్టి ఈ శాస్త్రమును నీకు జెప్పితిని దీనిని చక్కగా తెలిసికొనినవాడు జ్ఞానవంతుడును, కృతకృత్యుడును కాగలడు.

ఇతి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు
బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే
శ్రీకృష్ణార్జున సంవాదే
పురుషోత్తమప్రాప్తియోగో నామ
పంచదశోఽధ్యాయః.

---

ఓమ్

శ్రీకృష్ణపరబ్రహ్మణే నమః

# శ్రీ భగవద్గీత

## అథ షోడశోఽధ్యాయః

## దైవాసురసంపద్విభాగయోగః

శ్రీ భగవానువాచ:—

అభయం సత్త్వసంశుద్ధి
ర్జ్ఞానయోగవ్యవస్థితిః,
దానం దమశ్చ యజ్ఞశ్చ
స్వాధ్యాయస్తప ఆర్జవమ్. 1

అహింసా సత్యమక్రోధ
స్త్యాగశ్శాన్తిర పైశునమ్,

దయా భూతేష్వలోలత్వం
మార్దవం హ్రీరచాపలమ్. 2

తేజః క్షమాధృతిశ్శౌచ
మద్రోహో నాతిమానితా,
భవన్తి సమ్పదం దైవీ
మభిజాతస్య భారత. 3

శ్రీ భగవంతుడు చెప్పెను:-

ఓ అర్జునా! (1) భయము లేకుండుట(2) అంతఃకరణశుద్ధి(3 జ్ఞానయోగమునందుండుట (4)దానము (5) బాహ్యేంద్రియనిగ్రహము(6)(జ్ఞాన) యజ్ఞము (7) వేదశాస్త్రాదుల అధ్యయనము (8) తపస్సు (9) ఋజుత్వము (కపటము లేకుండుట) (10) ఏ ప్రాణికిన్ని బాధగలుగజేయకుండుట (అహింస), (11) సద్వస్తువగు పరమాత్మ నాశ్రయించుట, లేక నిజముపలుకుట (సత్యము)(12) కోపము లేకుండుట (13) త్యాగబుద్ధిగలిగియుండుట (14) శాంతిస్వభావము (15) కొండెములు చెప్పకుండుట (16)ప్రాణులందు దయగలిగియుండుట(17)విషయలోలత్వము లేకుండుట, అనగా విషయములందాసక్తి లేకుండుట జ్ఞానిచే చలింపకుండుటయు (18) మృదుత్వము (క్రౌర్యము లేకుండుట) (19)(ధర్మవిరుద్ధకార్యములందు) సిగ్గు, (20) చంచల స్వభావము లేకుండుట (21) ప్రతిభ (లేక, బ్రహ్మతేజస్సు) (22) ఓర్పు (కష్టసహిష్ణుత) (23) ధైర్యము (24) బాహ్యాభ్యంతర శుచిత్వము (25) ఎవనికిని ద్రోహము చేయకుండుట, ద్రోహచింతనము లేకుండుట (26) స్వాతిశయము లేకుండుట, (తాను పూజింపదగినవాడనను అభిమానము గర్వము లేకుండుట) అను నీ సుగుణములు దైవసంపత్తియందు పుట్టిన వానికి కలుగుచున్నవి. (అనగా దైవసంపత్తిని పొందగి పుట్టిన వానికి కలుగుచున్నవని భావము.)



దమ్భో దర్పోఽభిమానశ్చ
క్రోధః పారుష్యమేవ చ,
అజ్ఞానం చాభిజాతస్య
పార్థసమ్పదమాసురీమ్. 4

ఓ అర్జునా! డంబము, గర్వము, అభిమానము (దురహంకారము), కోపము, (వాక్కునందున్న గువాని యందు) కాఠిన్యము అవివేకము అను ఈ దుర్గుణములు అసురసంపత్తియందు పుట్టినవానికి కలుగుచున్నవి (అనగా అసురసంపత్తినిపొందదగి జన్మించిన వారికి కలుగుచున్నవని భావము.)

దైవీసంపద్విమోక్షాయ
నిబన్ధాయాసురీ మతా,
మా శుచః సంపదం దైవీ
మభిజాతోఽసి పాణ్డవ. **5**

ఓ అర్జునా! దైవీసంపద పరిపూర్ణ(సంసార)బంధనివృత్తిని, ఆసురీసంపద గొప్ప(సంసార) బంధమును గలుగజేయునని నిశ్చయింపబడినది. నీవు దైవీసంపదయందే (దైవీసంపదను బొందదగియే) జన్మించినాడవు కావున శోకింప నవసరములేదు.

ద్వౌ భూతసర్గౌ లోకేఽస్మిన్
దైవ ఆసుర ఏవ చ,



దైవో విస్తరశః ప్రోక్త
ఆసురం పార్థ మే శృణు. **6**

ఓ అర్జునా! ఈప్రపంచమున దైవసంబంధమైన గుణములు కలదియని, అసురసంబంధమైన గుణములు కలదియని రెండు విధములగు ప్రాణుల సృష్టులు కలవు. అందు దైవీసంబంధమైనదానిని గూర్చి నీకు సవిస్తరముగ తెలిపితిని. ఇక అసురసంబంధమైన దానిని గూర్చి నావలన వినుము.

ప్రవృత్తిం చ నివృత్తిం చ
జనా న విదురాసురాః,
న శౌచం నాపి చాచారో
న సత్యం తేషు విద్యతే. **7**

అసురస్వభావముగల జనులు ధర్మప్రవృత్తిని గాని అధర్మనివృత్తినిగాని యెఱుగరు. వారియందు శుచిత్వముగాని, ఆచారము (సత్కర్మానుష్ఠానము) గాని, సత్యముగాని యుండదు.

అసత్యమప్రతిష్ఠం తే
జగదాహురనీశ్వరమ్,
అపరస్పరసమ్భూతం
కిమన్యత్కామహైతుకమ్. 8

వారు జగత్తు అసత్యమనియు (వేదాదిప్రమాణరహితమనియు), ప్రతిష్ఠ (ధర్మాధర్మవ్యవస్థలు) లేనిదనియు, (కర్త యగు) ఈశ్వరుడు లేనిదనియు, కామమే హేతువుగాగలదై స్త్రీపురుషులయొక్క పరస్పరసంబంధము చేతనే కలిగినదనియు, అదియు గాక ఈజగత్తునకు వేఱుకారణమేమియు లేదనియు చెప్పుదురు.

ఏతాం దృష్టిమవష్టభ్య
నష్టాత్మానోఽల్పబుద్ధయః,
ప్రభవన్త్యుగ్రకర్మాణః
క్షయాయ జగతోఽహితాః. 9

(వారు) ఇట్టి నాస్తికదృష్టిని అవలంబించి, చెడిన



మనస్సుగలవారును, అల్పబుద్ధితో గూడియున్నవారును, క్రూరకార్యములను జేయువారును (జగత్తునకు) శత్రువులును (లోకకంటకులును) అయి ప్రపంచముయొక్క వినాశముకొఱకు పుట్టుచున్నారు.

కామమాశ్రిత్య దుష్పూరం
దమ్భమానమదాన్వితాః,
మోహాద్గృహీత్వాఽసద్గ్రాహాన్
ప్రవర్తన్తేఽశుచివ్రతాః. 10

వారు తనివితీరని కామమునాశ్రయించి, డంబము అభిమానము, మదముగలవారలై అవివేకమువలన చెడుపట్టుదలనాశ్రయించి అపవిత్రములగు వ్రతములు (నీచవృత్తులు) గలవారై ప్రవర్తించుచున్నారు.

చిన్తామపరిమేయాం చ
ప్రలయాన్తాముపాశ్రితాః,
కామోపభోగపరమా
ఏతావదితి నిశ్చితాః. 11

ఆశాపాశశతైర్బద్ధాః
కామక్రోధపరాయణాః,
ఈహన్తే కామభోగార్థ
మన్యాయేనార్థసంచయాన్. 12

మఱియు వారు అపరిమితమైనదియు, మరణము వఱకు (లేక, ప్రళయకాలమువఱకు) విడువనిదియునగు విషయచింతను (కోరికలను) ఆశ్రయించినవారును, కామోపభోగమే పరమపురుషార్థముగ దలంచువారును, ఇంతకుమించినది వేఱొకటిలేదని నిశ్చయించువారును, పెక్కు ఆశాపాశములచే బంధింపబడినవారును కామక్రోధములనే ముఖ్యముగ నాశ్రయించినవారును అయి కామములననుభవించుటకొఱకుగాను అన్యాయమార్గములద్వారా ధనసమూహములనుకోరుచున్నారు.

ఇదమద్య మయా లబ్ధ
మిమం ప్రాప్స్యే మనోరథమ్,



ఇదమస్తీదమపి మే
భవిష్యతి పునర్ధనమ్. 13

అసౌ మయా హతశ్శత్రు
ర్హనిష్యే చాపరానపి,
ఈశ్వరోఽహమహం భోగీ
సిద్ధోఽహం బలవాన్ సుఖీ. 14

ఆఢ్యోఽభిజనవానస్మి
కోఽన్యోఽస్తి సదృశో మయా,
యక్ష్యే దాస్యామి మోదిష్య
ఇత్యజ్ఞానవిమోహితాః. 15

అనేకచిత్తవిభ్రాన్తా
మోహజాలసమావృతాః,

ప్రసక్తాః కామభోగేషు
పతన్తి నరకేఽశుచౌ. **16**

"ఈ కోరికను ఇపుడు నేను పొందితిని. ఈ కోరికను ఇకమీదట పొందగలను, ఈ ధనము ఇపుడు నాకు కలదు; ఇంకను ఎంతయో ధనము నేను సంపాదింపగలను; ఈ శత్రువును నేనిపుడు చంపితిని; తక్కిన శత్రువులనుగూడ చంపగలను; నేను ప్రభువును; సమస్తభోగములను అనుభవించువాడను; తలంచిన కార్యమును నెరవేర్పశక్తిగలవాడను; బలవంతుడను; సుఖవంతుడను; ధనవంతుడను; గొప్ప వంశమున జన్మించినవాడను; నాతో సమానమైనవాడు మఱియొక డెవడు కలడు? నేను యజ్ఞములఁ జేసెదను; దానములనిచ్చెదను, ఆనందము ననుభవించెదను'-అని యీ ప్రకారముగ అజ్ఞానముచే మోహము భ్రమ)నొందినవారును, అనేకవిధములైన చిత్తచాంచల్యములతో గూడినవారును, మోహము (దారాపుత్ర క్షేత్రాదులందు అభిమానము) అను వలచే బాగుగా గప్పబడిన వారును, కామముల ననుభవించుట యందు



మిగుల యాసక్తి కలవారును అయి వారు (అసుర ప్రకృతిగలవారు) అపవిత్రమైన నరకమునందు పడుచున్నారు.

ఆత్మసమ్భావితాః స్తబ్ధా
ధనమానమదాన్వితాః,
యజన్తే నామయజ్ఞైస్తే
దమ్భేనావిధిపూర్వకమ్. **17**
అహంకారం బలం దర్పం
కామం క్రోధం చ సంశ్రితాః,
మామాత్మపరదేహేషు
ప్రద్విషన్తోఽభ్యసూయకాః. **18**

తమ్ముతాముగొప్పగాదలంచువారును, వినయము (మర్యాద) లేనివారును, ధనముకలదని అభిమానముతోను, మదముతోనుగూడియుండువారును, అహంకారమును, (పరపీడాకరమగు) బలమును, గర్వమును, కామమును, క్రోధమును బాగుగ ఆశ్రయించిన

వారును, తమశరీరములందును, ఇతరుల శరీరములందును (సాక్షిగ నున్న) నన్ను మిగుల ద్వేషించువారును, అసూయాపరులైయుండువారునగు (అసుర సంపదగల) వారుడంబముతో శాస్త్రవిరుద్ధముగ నామమాత్రపు యజ్ఞములచే యాగము చేయుచుందురు.

తానహం ద్విషతః క్రూరాన్
సంసారేషు నరాధమాన్,
క్షిపామ్యజస్రమశుభా
నాసురీష్వేవ యోనిషు. 19

(ఆప్రకారము) సమస్త ప్రాణులలోగలఆత్మయగు నన్ను ద్వేషించువారును, క్రూరులును, అశుభ (పాప)కార్యములను జేయువారునగు అట్టి మనుజాధములను నేను జననమరణరూపములగు ఈ సంసారమార్గములందు అసురసంబంధమైన నీచజన్మలందే యెల్లప్పుడు త్రోసివైచెదను.



ఆసురీం యోనిమాపన్నా
మూఢా జన్మని జన్మని,
మామప్రాప్యైవ కౌన్తేయ
తతో యాన్త్యధమాంగతిమ్.20

ఓ అర్జునా! అసురసంబంధమైన(నీచ)జన్మమును పొందినవారలగు మూఢులుప్రతిజన్మయందునునన్ను పొందకయే, అంతకంటె (తాము పొందినజన్మకంటె) నీచతరమైన జన్మమును పొందుచున్నారు.

త్రివిధం నరకస్యేదం
ద్వారం నాశనమాత్మనః,
కామః క్రోధస్తథాలోభ
స్తస్మాదేతత్త్రయం త్యజేత్ .21

కామము, క్రోధము, లోభము అను నీమూడును మూడువిధములగు నరకద్వారములు. ఇవి తనకు (జీవునకు) నాశము గలుగజేయును — కాబట్టి ఈ

మూడింటిని విడనాడవలెను. [లేక కామము, క్రోధము లోభము] అను మూడువిధములగు ఈ అసురసంపద నరకమునకు ద్వారము-అనియు చెప్పవచ్చును.

ఏతైర్విముక్తః కౌన్తేయ
తమోద్వారైస్త్రిభిర్నరః,
ఆచరత్యాత్మనః శ్రేయ
స్తతో యాతి పరాం గతిమ్. 22

ఓ అర్జునా! (కామ క్రోధ లోభములనునట్టి) ఈ మూడు నరకద్వారములనుండి బాగుగ విడువబడిన మనుజుడు తనకు హితమును గావించుకొనుచున్నాడు. అందువలన సర్వోత్కృష్టమగు మోక్షగతిని పొందుచున్నాడు.

యశ్శాస్త్రవిధిముత్సృజ్య
వర్తతే కామకారతః,
న స సిద్ధిమవాప్నోతి
న సుఖం న పరాంగతిమ్. 23



ఎవడు శాస్త్రోక్తమగు విధిని విడిచిపెట్టి తన యిష్టము వచ్చినట్లు ప్రవర్తించునో, అట్టివాడు పురుషార్థసిద్ధినిగాని సుఖమునుగాని యుత్తమగతియగు మోక్షమునుగాని పొందనేరడు.

తస్మాచ్ఛాస్త్రం ప్రమాణం తే
కార్యాకార్యవ్యవస్థితౌ,
జ్ఞాత్వా శాస్త్రవిధానోక్తం
కర్మకర్తుమిహార్హసి. 24

కావున నీవు చేయదగినదియు, చేయరానిదియు నిర్ణయించునపుడు శాస్త్రము ప్రమాణమైయున్నది. శాస్త్రమునందు చెప్పబడినదానిని తెలిసికొని దానిననుసరించి నీవీప్రపంచమునకర్మమును చేయదగును.

ఇతి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు
బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే
శ్రీకృష్ణార్జున సంవాదే
దైవాసురసంపద్విభాగయోగోనామ
షోడశోఽధ్యాయః.

---

ఓమ్

శ్రీకృష్ణపరబ్రహ్మణే నమః

# శ్రీ భగవద్గీత

## అథ సప్తదశోఽధ్యాయః

### శ్రద్ధాత్రయవిభాగ యోగః

అర్జున ఉవాచ :—

యే శాస్త్రవిధిముత్సృజ్య
యజన్తే శ్రద్ధయాన్వితాః,
తేషాం నిష్ఠా తు కా కృష్ణ
సత్త్వమాహో రజస్తమః. **1**

అర్జునుడు అడిగెను :—

ఓ కృష్ణా! ఎవరు శాస్త్రోక్త విధానమును విడిచి పెట్టి శ్రద్ధతో గూడుకొని పూజాదుల నొనర్తురో వారియొక్క స్థితి సాత్త్వికమా, లేక రాజసమా, లేక తామసమా! ఏదియై యున్నది?



శ్రీ భగవానువాచ :—

త్రివిధా భవతి శ్రద్ధా
దేహినాం సా స్వభావజా,
సాత్త్వికీ రాజసీ చైవ
తామసీ చేతి తాం శృణు. **2**

శ్రీ భగవంతుడు చెప్పెను — (ఓ అర్జునా! ప్రాణులయొక్క స్వభావముచే (పూర్వజన్మ సంస్కారముచే) గలిగిన ఆ శ్రద్ధ సాత్త్వికమనియు రాజసమనియు, తామసమనియు మూడు విధములుగా నగుచున్నది. దానిని గూర్చి వినుము.

సత్త్వానురూపా సర్వస్య
శ్రద్ధా భవతి భారత,
శ్రద్ధామయోఽయం పురుషో
యో యచ్ఛ్రద్ధస్స ఏవ సః. **3**

ఓ అర్జునా! సమస్తజీవులకును వారి వారి (పూర్వజన్మ సంస్కారముతో గూడిన) యంతఃకరణము

ననుసరించి శ్రద్ధ (గుణము, సంస్కారము) గలుగు చున్నది.

యజన్తే సాత్త్వికా దేవాన్
యక్షరక్షాంసి రాజసాః,
ప్రేతాన్ భూతగణాంశ్చాన్యే
యజన్తే తామసా జనాః. 4

సత్త్వగుణముగలవారు దేవతలను, రజోగుణము గలవారు యక్షులను రాక్షసులను, తమోగుణము గలవారు భూతప్రేతగణములను పూజించుచున్నారు.

అశాస్త్రవిహితం ఘోరం
తప్యన్తే యే తపో జనాః,
దమ్భాహంకారసంయుక్తాః
కామరాగ బలాన్వితాః. 5
కర్శయన్తః శరీరస్థం
భూతగ్రామమచేతసః,



మాంచైవాన్తః శరీరస్థం
తాన్విద్ధ్యాసురనిశ్చయాన్. 6

ఏజనులు శరీరమున నున్నట్టి పంచభూతసముదాయమును, లేక ఇంద్రియ సమూహమును (ఉపవాసాదులచే) శుష్కింపజేయువారును, శరీరమందంతర్యామిగనున్న నన్నును కష్టపెట్టువారును, దంభాహంకారములతో గూడినవారును, కామము రాగము (ఆసక్తి) పశుబలము కలవారును (లేక కామబలము రాగబలముగలవారును) అవివేకులును అయి శాస్త్రమునందు విధింపబడనిదియు, తనకును ఇతరులకును గూడ బాధాకరమైనదియునగు తపస్సును జేయుచున్నారో, అట్టివారిని అసుర స్వభావము గలవారినిగ తెలిసికొనుము.

ఆహారస్త్వపి సర్వస్య
త్రివిధో భవతి ప్రియః,
యజ్ఞస్తపస్తథా దానం
తేషాం భేదమిమం శృణు. 7

ఆహారముకూడ సర్వులకును (సత్త్వాది గుణము లను బట్టి) మూడువిధములుగ ఇష్టమగుచున్నది. అలాగుననే యజ్ఞము, తపస్సు, దానముకూడ జనులకు మూడు విధములుగ ప్రియమై యుండు చున్నది. ఆ యాహారాదుల ఈ భేదమును తార్చి (చెప్పెదను) వినుము.

ఆయుస్సత్త్వబలారోగ్య
సుఖప్రీతివివర్ధనాః,
రస్యాః స్నిగ్ధాః స్థిరా హృద్యా
ఆహారాః సాత్త్వికప్రియాః. 8

ఆయుస్సును, మనోబలమును, దేహబలమును, ఆరోగ్యమును, సౌఖ్యమును, ప్రీతిని, బాగుగ వృద్ధి నొందించునవియు, రసముగలవియు, చమురుగల వియు. దేహమందు చాలకాలము నుండునవియు, మనోహరము లైనవియునగు ఆహారములు సత్త్వ గుణముగలవారికి ఇష్టములై యుండును.

కట్వమ్లలవణాత్యుష్ణ
తీక్ష్ణరూక్షవిదాహినః,



ఆహారా రాజసస్యేష్టా
దుఃఖశోకామయప్రదాః. 9

చేదుగాను పులుపుగాను, ఉప్పగాను, మిక్కిలి వేడిగాను, కారముగాను, చమురులేనిదిగాను, మిగుల దాహము గలుగజేయునవిగాను ఉండు నవియు, (శరీరమునకు) దుఃఖమును, (మనస్సు నకు) వ్యాకులత్వమును గలుగ జేయునవియునగు ఆహారపదార్థములు రజోగుణము గలవానికి ఇష్ట ములై యుండును.

యాతయామం గతరసం
పూతి పర్యుషితం చ యత్,
ఉచ్ఛిష్టమపి చామేధ్యం
భోజనం తామసప్రియమ్. 10

వండిన పిమ్మట ఒక జాము దాటినదియు (లేక బాగుగ ఉడకనిదియు), సారము నశించినదియు, దుర్గంధము గలదియు, పాచిపోయినదియు, (వండిన పిదప ఒక రాత్రి గడచినదియు,) ఒకరు తినగా మిగిలినది (ఎంగిలి చేసినది)యు, అశుద్ధముగా

నున్నదియు (భగవంతునకు నివేదింపబడనిదియు) అగు ఆహారము తమోగుణము గలవారి కిష్టమైనది యగును.

అఫలాకాఙ్క్షిభిర్యజ్ఞో
విధిదృష్టో య ఇజ్యతే,
యష్టవ్యమేవేతి మనః
సమాధాయ స సాత్త్వికః. **11**

'ఇది చేయదగినదియే' యని మనస్సును సమాధాన పఱచి శాస్త్రసమ్మతమగు ఏ యజ్ఞము ఫలాపేక్షలేని వారిచేత చేయబడుచున్నదో అది సాత్త్వికయజ్ఞ మనఁబడును.

అభిసన్ధాయ తు ఫలం
దమ్భార్థమపి చైవ యత్,
ఇజ్యతే భరతశ్రేష్ఠ
తం యజ్ఞం విద్ధి రాజసమ్. **12**

భరతవంశశ్రేష్ఠుడవగు ఓ అర్జునా! ఫలమును



గోరియు డంబము కొఱకును గావింపబడు యజ్ఞమును రాజసమైనదానినిగా నీవు తెలిసికొనుము.

విధిహీన మసృష్టాన్నం
మన్త్రహీన మదక్షిణమ్,
శ్రద్ధావిరహితం యజ్ఞం
తామసం పరిచక్షతే. **13**

విధ్యుక్తము కానిదియు, అన్నదానము లేనిదియు మంత్రరహితమైనదియు, దక్షిణ లేనిదియు, శ్రద్ధ బొత్తిగా లేనిదియునగు యజ్ఞము తామసయజ్ఞమని చెప్పబడును.

దేవద్విజగురుప్రాజ్ఞ
పూజనం శౌచమార్జవమ్,
బ్రహ్మచర్యమహింసా చ
శారీరం తప ఉచ్యతే. **14**

దేవతలను, బ్రహ్మనిష్ఠులను, గురువులను, జ్ఞానులను (మహాత్ములను, బ్రహ్మజ్ఞానముగల పెద్దలను)

పూజించుట, బాహ్యాభ్యంతర శుద్ధిగలిగియుండుట, ఋజుత్వముతో గూడియుండుట, (కుటిలత్వము లేకుండుట, మనోవాక్కా యములతో ఏకరీతిగా వర్తించుట), బ్రహ్మచర్యవ్రతమును పాలించుట; ఏ ప్రాణిని హింసింపకుండుట శారీరక (శరీరసంబంధమైన) తపస్సని చెప్పబడుచున్నది.

అనుద్వేగకరం వాక్యం
సత్యం ప్రియహితం చ యత్,
స్వాధ్యాయాభ్యసనం చైవ
వాఙ్మయం తప ఉచ్యతే. **15**

ఇతరుల మనస్సునకు బాధగలిగింపనిదియు సత్యమైనదియు, ప్రియమైనదియు, మేలు గలిగించునదియు నగు వాక్యమును, వేదాదులయొక్క అధ్యయనమును అభ్యసించుట (వేదము, ఉపనిషత్తులు, భగవద్గీత, భారత భాగవత రామాయణాదులు మున్నగువానిని అధ్యయనము చేయుట, ప్రణవాది మంత్రములను జపించుట) వాచిక తపస్సని చెప్పబడుచున్నది.



మనః ప్రసాదస్సౌమ్యత్వం
మౌనమాత్మవినిగ్రహః,
భావసంశుద్ధిరిత్యేత
త్తపో మానస ముచ్యతే. **16**

మనస్సును నిర్మలముగానుంచుట (కలతనొందనీయక స్వచ్ఛముగానుంచుట), ముఖప్రసన్నత్వము (క్రూరభావము లేకుండుట) పరమాత్మను గూర్చిన మననము (దైవధ్యానము) గలిగియుండుట [లేక దృశ్యసంకల్పము లెవ్వియు లేక ఆత్మయందే స్థితి గలిగియుండుట అను (వాఙ్మౌన సహిత) మనోమౌనము] మనస్సును బాగుగ నిగ్రహించుట, పరిశుద్ధమగు భావము గలిగియుండుట (మోసము మున్నగునవి లేకుండుట) అను నివి మానసిక తపస్సని చెప్పబడుచున్నది.

శ్రద్ధయా పరయా తప్తం
తపస్త త్త్రివిధం నరైః,

అఫలాకాఙ్క్షిభిర్యుక్తైః
సాత్త్వికం పరిచక్షతే. 17

ఫలాపేక్ష లేనివారును, నిశ్చలచిత్తులును, (లేక దైవభావనాయుక్తులును) అగు మనుజులచే అధికమగు శ్రద్ధతో ఆచరింపబడినట్టి ఆ (పైన దెల్పిన శారీరక, వాచిక, మానసికములగు) మూడు విధములైన తపస్సును సాత్త్వికమని (సాత్త్విక తపస్సని) (పెద్దలు) చెప్పుచున్నారు.

సత్కారమాన పూజార్థం
తపో దమ్భేన చైవ యత్,
క్రియతే తదిహ ప్రోక్తం
రాజసం చలమధ్రువమ్. 18

ఇతరులచే తాము సత్కరింపబడవలెనని, గౌరవింపబడవలెనని, పూజింపబడవలెనని డంబముతో మాత్రమే చేయబడుతపస్సు అస్థిరమై, అనిశ్చితమైనట్టి ఫలముగలదై (లేక చపలమైనట్టిరూపముగలదై) ఈ ప్రపంచమున రాజస తపస్సు అని చెప్పబడినది.



మూఢగ్రాహేణాత్మనో
యత్పీడయా క్రియతే తపః,
పరస్యోత్సాదనార్థం వా
తత్తామసముదాహృతమ్. 19

మూర్ఖపు పట్టుదలతో తన శరీరమును (శుష్కోపవాసాదులచే) బాధించుకొనుట ద్వారాగాని, లేక ఇతరులను నాశనము చేయవలెనను ఉద్దేశ్యముతో గాని చేయబడు తపస్సు తామసికతపస్సని చెప్పబడినది.

దాతవ్యమితి యద్దానం
దీయతేఽనుపకారిణే,
దేశే కాలే చ పాత్రే చ
తద్దానం సాత్త్వికం స్మృతమ్. 20

'ఈయవలసినదే' యను నిశ్చయముతో ఏ దానము పుణ్యప్రదేశమందును, పుణ్యకాలమందును యోగ్యుడగువానికి మఱియు ప్రత్యుపకారము చేయ

శక్తిలేని వానికో [illegible] ఈయబడుచున్నదో అది సాత్త్వికదానమని చెప్పబడుచున్నది.

యత్తు ప్రత్యుపకారార్థం
ఫలముద్దిశ్య వా పునః,
దీయతే చ పరిక్లిష్టం
తద్దానం రాజసం స్మృతమ్. 21

ప్రత్యుపకారముకొఱకుగాని, లేక ఫలమును ఉద్దేశించిగాని, లేక మనఃక్లేశముతో (అతికష్టముతో) గాని ఈయబడు దానము రాజసదానమని చెప్పబడుచున్నది.

అదేశకాలే యద్దాన
మపాత్రేభ్యశ్చ దీయతే,
అసత్కృతమవజ్ఞాతం
తత్తామసముదాహృతమ్. 22

దానమునకు తగని (అపవిత్రములగు) దేశకాలములందును పాత్రులు (అర్హులు) కానివానికొఱకును, సత్కారశూన్యముగను, అమర్యాద



తోను ఈయబడు దానము తామస దానమని చెప్పబడును.

ఓం తత్సదితి నిర్దేశో
బ్రహ్మణస్త్రివిధః స్మృతః,
బ్రాహ్మణాస్తేన వేదాశ్చ
యజ్ఞాశ్చ విహితాః పురా. 23

పరబ్రహ్మమునకు 'ఓమ్' అనియు 'తత్' అనియు, 'సత్' అనియు మూడువిధములగు పేర్లు చెప్పబడినవి. ఈనామత్రయము వలననే (దాని యుచ్చారణచేతనే) పూర్వము బ్రాహ్మణులు (బ్రహ్మజ్ఞానులు), వేదములు, యజ్ఞములు నిర్మింపబడినవి.

తస్మాదోమిత్యుదాహృత్య
యజ్ఞదానతపఃక్రియాః,
ప్రవర్తన్తే విధానోక్తా
స్సతతం బ్రహ్మవాదినామ్. 24

అందువలన, వేదములను బాగుగా నెఱిగిన వారియొక్క శాస్త్రోక్తములగు యజ్ఞదానతపఃక్రియ లన్నియు ఎల్లప్పుడును 'ఓమ్'అని చెప్పిన పిమ్మటనే అనుష్ఠింప బడుచున్నవి.

తదిత్యనభిసన్ధాయ
ఫలం యజ్ఞతపఃక్రియాః,
దానక్రియాశ్చ వివిధాః
క్రియన్తే మోక్షకాఙ్క్షిభిః. 25

అట్లే 'తత్' అను పదమును ఉచ్చరించియే ముముక్షువులు ఫలాపేక్ష లేక పలువిధములైన యజ్ఞదాన, తపఃకర్మలను చేయుచున్నారు.

సద్భావే సాధుభావే చ
సదిత్యేతత్ప్రయుజ్యతే,
ప్రశస్తే కర్మణి తథా
సచ్ఛబ్దః పార్థ యుజ్యతే. 26



ఓ అర్జునా! 'కలదు' అనెడి అర్థమందును, 'మంచిది' అనెడి అర్థమందును 'సత్' అను ఈ పరబ్రహ్మనామము ప్రయోగింపబడుచున్నది. అట్లే ఉత్తమమైన కర్మము నందును ఆ 'సత్' అను పదము వాడబడుచున్నది.

యజ్ఞే తపసి దానే చ
స్థితిః సదితి చోచ్యతే,
కర్మచైవ తదర్థీయం
సదిత్యేవాభిధీయతే. 27

యజ్ఞమునందును, తపస్సునందును, దానము నందును గల నిష్ఠ (ఉనికి) కూడ 'సత్' అని చెప్పబడుచున్నది. మఱియు బ్రహ్మోద్దేశమైన (భగవత్ప్రీత్యర్థమైన) కర్మలుకూడ 'సత్' అనియే పిలువబడుచున్నవి.

అశ్రద్ధయా హుతం దత్తం
తపస్తప్తం కృతం చ యత్,

అసదిత్యుచ్యతే పార్థ
న చ తత్ప్రేత్య నో ఇహ. **28**

ఓ అర్జునా! అశ్రద్ధతో చేయబడిన హోమము గాని, దానముగాని, తపస్సుగాని, ఇతర కర్మలు గాని 'అసత్తని' చెప్పబడును. అవి ఇహలోక ఫలమును (సుఖమును) గాని, పరలోకఫలమును సుఖముచు) గాని కలుగజేయవు.

ఇతి శ్రీమద్భగవద్గీతా సూపనిషత్సు
బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే
శ్రీకృష్ణార్జునసంవాదే
శ్రద్ధాత్రయవిభాగయోగో నామ
సప్తదశోఽధ్యాయః

—

ఓమ్
శ్రీకృష్ణపరబ్రహ్మణే నమః

# శ్రీ భగవద్గీత

## అథ అష్టాదశోఽధ్యాయః

### మోక్షసన్న్యాసయోగః

అర్జున ఉవాచ :-

సన్న్యాసస్య మహాబాహో
తత్త్వమిచ్ఛామి వేదితుమ్,
త్యాగస్య చ హృషీకేశ
పృథక్కేశినిషూదన. **1**

అర్జునుడు అడిగెను :-

గొప్ప భుజములుగలవాడవును, ఇంద్రియముల యొక్క నియామకుడవును, కేశియను రాక్షసుని సంహరించిన వాడవు నగు ఓ కృష్ణా! సన్న్యాసము యొక్కయు, త్యాగముయొక్కయు యథార్థ

మును తెలిసికొనగోరుచున్నాను. కావున ఆరెంటిని వేఱువేఱుగా నాకు చెప్పుము.

శ్రీ భగవానువాచ :-

కామ్యానాం కర్మణాం న్యాసం
సన్న్యాసం కవయో విదుః,
సర్వకర్మఫలత్యాగం
ప్రాహుస్త్యాగం విచక్షణాః. 2

శ్రీ భగవంతుడు చెప్పెను - (ఓ అర్జునా!) కామ్యకర్మలను వదలుటయే సన్న్యాసమని కొందఱు పండితులు చెప్పుదురు. మఱికొందఱు పండితులు సమస్త కర్మలయొక్క ఫలమును త్యజించుటయే త్యాగమని వచించుదురు.

త్యాజ్యం దోషవదిత్యేకే
కర్మ ప్రాహుర్మనీషిణః,
యజ్ఞదానతపఃకర్మ
న త్యాజ్యమితి చాపరే. 3



కొందఱు బుద్ధిమంతులు (సాంఖ్యులు) దోషమువలె కర్మము విడిచిపెట్టదగినదని చెప్పుదురు. మఱికొందఱు యజ్ఞము, దానము, తపస్సు-మున్నగు కర్మములు విడువదగనివనియు చెప్పుదురు.

నిశ్చయం శృణు మే తత్ర
త్యాగే భరతసత్తమ,
త్యాగో హి పురుషవ్యాఘ్ర
త్రివిధః సంప్రకీర్తితః. 4

భరతకులోత్తముఁడవును, పురుషశ్రేష్ఠుడవునగు ఓ అర్జునా! అట్టి కర్మత్యాగవిషయముననాయొక్క నిశ్చయమేదియో చెప్పెదను వినుము. త్యాగము మూడు విధములుగా చెప్పబడి యున్నదికదా!

యజ్ఞదాన తపః కర్మ
న త్యాజ్యం కార్యమేవ తత్
యజ్ఞో దానం తపశ్చైవ
పావనాని మనీషిణామ్. 5

యజ్ఞము, దానము, తపస్సు అనెడి కర్మములు త్యజింపదగినవికావు; చేయదగినవియే యగును. ఏలయనిన ఆ యజ్ఞదానతపంబులు బుద్ధిమంతులకు పవిత్రతను(చిత్తశుద్ధిని) కలుగజేయునవై యున్నవి

ఏతాన్యపి తు కర్మాణి
సఙ్గం త్యక్త్వా ఫలాని చ,
కర్తవ్యానీతి మే పార్థ
నిశ్చితం మతముత్తమమ్. 6

అర్జునా! ఈ యజ్ఞదానతపఃకర్మలనుగూడ ఆసక్తిని, ఫలములను విడిచియే చేయవలెనని నాయొక్క నిశ్చితమగు ఉత్తమాభిప్రాయము.

నియతస్య తు సన్న్యాసః
కర్మణో నోపపద్యతే,
మోహాత్తస్య పరిత్యాగ
స్తామసః పరికీర్తితః. 7

(వేదశాస్త్రాదులచే) విధింపబడినట్టి కర్మము



యొక్క పరిత్యాగము యుక్తముకాదు. అజ్ఞానముచే అట్టి కర్మమును ఎవడైన విడిచిపెట్టునేని అది తామసత్యాగమే యగునని చెప్పబడుచున్నది

దుఃఖమిత్యేవ యత్కర్మ
కాయక్లేశ భయాత్త్యజేత్,
స కృత్వా రాజసం త్యాగం
నైవత్యాగఫలం లభేత్. 8

ఎవడు శరీరప్రయాసవలని భయముచేత దుఃఖమును కలుగజేయునది యనియే తలంచి విధ్యుక్త కర్మమును విడిచిపెట్టునో, అట్టివాడు రాజసత్యాగమును గావించినవాడై త్యాగఫలమును పొందకయే యుండును.

కార్య మిత్యేవ యత్కర్మ
నియతం క్రియతేఽర్జున,
సఙ్గం త్యక్త్వా ఫలంచైవ
స త్యాగస్సాత్త్వికో మతః. 9

ఇది చేయదగినదియే యని తలంచి శాస్త్ర నియతమగు ఏ కర్మము అభిమానము, ఫలము విడిచిపెట్టబడి చేయబడుచున్నదో అట్టి (కర్మ మందలి సంగఫల) త్యాగము సాత్త్వికత్యాగమని నిశ్చయింపబడినది.

న ద్వేష్ట్యకుశలం కర్మ
కుశలే నానుషజ్జతే,
త్యాగీ సత్త్వసమావిష్టో
మేధావీ ఛిన్న సంశయః. **10**

సత్త్వగుణముతో గూడినవాడును, ప్రజ్ఞాశాలియు, సంశయములను బోగొట్టుకొనినవాడును నగు త్యాగశీలుడు, అశుభమును కామ్యమును, దుఃఖకరము నగు కర్మను ద్వేషింపడు. శుభమును, నిష్కామమును, సుఖకరమునగు కర్మయందు ఆసక్తుడు కాడు. (అభిమానము కలిగియుండడు.)

న హి దేహభృతా శక్యం
త్యక్తుం కర్మాణ్య శేషతః,



యస్తు కర్మఫలత్యాగీ
స త్యాగీత్యభిధీయతే. **11**

కర్మములను పూర్తిగా విడుచుటకు దేహధారి యగు జీవునకు సాధ్యముకాదు. ఎవడు కర్మముల యొక్క ఫలములను విడచుచున్నాడో అట్టివాడే త్యాగియని పిలువబడుచున్నాడు.

అనిష్టమిష్టం మిశ్రం చ
త్రివిధం కర్మణః ఫలమ్,
భవత్య త్యాగినాం ప్రేత్య
నతు సన్న్యాసినాం క్వచిత్. **12**

దుఃఖకరమైనదియు, సుఖకరమైనదియు, సుఖ దుఃఖములు రెండును గలసినదియునగు మూడు విధములైన కర్మఫలము కర్మఫలత్యాగము చేయని వారలకు మరణానంతరము కలుగుచున్నది. కర్మ ఫలత్యాగము చేసినవారికన్ననో. అవి యెన్నటికిని కలుగనేరవు.

పఞ్చైతాని మహాబాహో
కారణాని నిబోధ మే
సాంఖ్యే కృతాన్తే ప్రోక్తాని
సిద్ధయే సర్వకర్మణామ్. **13**

గొప్పబాహువులుగల ఓ అర్జునా! సమస్త కర్మలు నెరవేరుటకు కర్మకాండయొక్క అంతమును దెలుపు సాంఖ్యశాస్త్రమునందు చెప్పబడిన ఈ ఐదు కారణములను నావలన తెలిసికొనుము.

అధిష్ఠానం తథా కర్తా
కరణం చ పృథగ్విధమ్,
వివిధాశ్చ పృథక్చేష్టా
దైవం చైవాత్ర పఞ్చమమ్. **14**

ఈ కర్మాచరణ విషయమున (1) శరీరము (2) కర్త (3) 11 విధములగు ఇంద్రియములు (4) పలువిధములుగను, వేఱువేఱుగను నుండు క్రియలు (వ్యాపారములు) ఐదవదియగు (5) దైవమును కారణములుగా నున్నవి.



శరీరవాఙ్మనోభిర్య
త్కర్మ ప్రారభతే నరః,
న్యాయ్యం వా విపరీతం వా
పఞ్చైతే తస్య హేతవః. **15**

మనుజుడు శరీరము, వాక్కు, మనస్సు అను వీనిచేత న్యాయమైనట్టిగాని (శాస్త్రీయమైనట్టి) గాని, అన్యాయమైనట్టి (అశాస్త్రీయమైనట్టి), గాని ఏ కర్మమును ప్రారంభించుచున్నాడో, దానికీయైదున్ను కారణములైయున్నవి.

తత్రైవం సతి కర్తార
మాత్మానం కేవలం తు యః,
పశ్యత్యకృతబుద్ధిత్వా
న్న స పశ్యతి దుర్మతిః. **16**

కర్మవిషయమందిట్లుండగా (పైనదెల్పిన అయిదున్ను కారణములైయుండగా) ఎవడు సంస్కరింపబడని బుద్ధిగలవాడగుటచే, నిరుపాధికుడగు

ఆత్మను కర్తగా తలంచుచున్నాడో; అట్టి అవివేకి కర్మముయొక్కగాని, ఆత్మయొక్కగాని, వాస్తవ స్వరూపమును ఎఱుఁగకున్నాడు.

యస్య నాహంకృతో భావో
బుద్ధిర్యస్య న లిప్యతే,
హత్వాఽపి స ఇమాన్
లోకాన్న హన్తి న నిబధ్యతే. 17

ఎవనికి 'నేను' కర్తను అను తలంపు లేదో, ఎవనియొక్క బుద్ధివిషయములను కర్మలను అంటదో అతడీ ప్రాణులన్నిటిని చంపినను వాస్తవముగ ఏమియు చంపుటలేదు. మఱియు నతడు కర్మలచే, పాపముచే బంధింపబడుటయు లేడు.

జ్ఞానం జ్ఞేయం పరిజ్ఞాతా
త్రివిధా కర్మచోదనా,
కరణం కర్మ కర్తేతి
త్రివిధః కర్మసంగ్రహః. 18



కర్మమునకు హేతువు తెలివి, తెలియదగిన వస్తువు, తెలియువాడు అని మూడువిధములుగ నున్నది. అట్లే కర్మ కాధారమున్న ఉపకరణము (సాధనము), క్రియ, చేయువాడు–అని మూడు విధములుగ నున్నది.

జ్ఞానం కర్మ చ కర్తా చ
త్రిధైవ గుణభేదతః,
ప్రోచ్యతే గుణసంఖ్యానే
యథావచ్ఛృణు తాన్యపి. 19

గుణములనుగూర్చి విచారణచేయు సాంఖ్య శాస్త్రమునందు జ్ఞానము, కర్మము, కర్త అను నివియు సత్త్వాది గుణములయొక్క భేదము ననుసరించి మూడువిధములుగనే చెప్పబడుచున్నవి. వానినిగూడ యథారీతి (శాస్త్రోక్తప్రకారము) చెప్పెదను వినుము.

సర్వభూతేషు యేనైకం
భావ మవ్యయ మీక్షతే,

అవిభక్తం విభక్తేషు
తజ్జ్ఞానం విద్ధి సాత్త్వికమ్. 20

విభజింపబడి వేఱువేఱుగనున్న సమస్తచరాచర ప్రాణులందును, ఒక్కటైన నాశరహితమగు ఆత్మ వస్తువును (దైవముయొక్క ఉనికిని) విభజింపబడక (ఏకముగ) నున్నట్లు ఏ జ్ఞానముచేత నెఱుఁగుచున్నాడో అట్టి జ్ఞానము సాత్త్వికమని తెలిసికొనుము.

పృథక్త్వేన తు యజ్జ్ఞానం
నానాభావాన్ పృథగ్విధాన్,
వేత్తి సర్వేషు భూతేషు
తజ్జ్ఞానం విద్ధి రాజసమ్. 21

ఏ జ్ఞానమువలన మనుజుడు సమస్తప్రాణులందును వేఱువేఱు విధములుగనున్న అనేక జీవులను వేఱువేఱుగా నెఱుఁగుచున్నాడో అట్టి జ్ఞానమును రాజస జ్ఞానమని తెలిసికొనుము.



యత్తు కృత్స్నవదేకస్మి
న్కార్యే సక్తమహైతుకమ్.
అతత్త్వార్థవదల్పం చ
తత్తామసముదాహృతమ్. 22

ఏ జ్ఞానమువలన మనుజుడు ఏదేని ఒక్కపనియందు (శరీర, ప్రతిమాదులందు) సమస్తమును అదియేయని తగిలియుండునో, అందులకు తగిన హేతువు లేకుండునో, తత్త్వమును (సత్యవస్తువును) తెలియకనుండునో, అల్పమైనదిగ (అల్పఫలము గలిగినదిగ) నుండునో, అట్టి జ్ఞానము తామసజ్ఞానమని చెప్పబడినది.

నియతం సఙ్గరహిత
మరాగద్వేషతః కృతమ్,
అఫలప్రేప్సునా కర్మ
యత్తత్సాత్త్విక ముచ్యతే. 23

శాస్త్రముచే నియమింపబడినదియు, ఫలాపేక్ష గాని, ఆసక్తి (సంగము,) అభిమానముగాని, రాగద్వేషములుగాని లేకుండ చేయబడునదియు సాత్త్వికకర్మ మనఁబడును.

యత్తు కామేప్సునా కర్మ
సాహంకారేణ వా పునః,
క్రియతే బహులాయాసం
తద్రాజసముదాహృతమ్. **24**

ఫలాపేక్షగలవానిచేతగాని, మఱియు అహంకారములో గూడిన వానిచేగాని అధిక ప్రయాస కరమగు కర్మమేది చేయబడుచున్నదో అది రాజసకర్మయని చెప్పబడినది.

అనుబన్ధం క్షయం హింసా
మనపేక్ష్య చ పౌరుషమ్,
మోహాదారభ్యతే కర్మ
యత్తత్తామసముచ్యతే. **25**

తాను చేయు కర్మకు మున్ముందు కలుగబోవు



దుఃఖాదులను, (ధనాదుల) నాశమును, (తన యొక్క, ఇతరులయొక్క శరీరాదులకుగల్గు) బాధను; తన సామర్థ్యమును ఆలోచింపక, అవివేకములో ప్రారంభింపబడు కర్మము తామస కర్మయని చెప్పబడుచున్నది.

ముక్తసఙ్గోఽనహంవాదీ
ధృత్యుత్సాహసమన్వితః,
సిద్ధ్యసిద్ధ్యోర్నిర్వికారః
కర్తా సాత్త్విక ఉచ్యతే. **26**

సంగమము (ఆసక్తిని) ఫలాపేక్షను విడిచిన వాడును, 'నేనుకర్త' యను అభిమానము, అహంభావము లేనివాడును, ధైర్యములోను, ఉత్సాహములోను గూడియున్నవాడును, కార్యము సిద్ధించినను, సిద్ధింపకున్నను వికారమును జెందని వాడునగు కర్త సాత్త్వికకర్తయని చెప్పబడుచున్నాడు.

రాగీ కర్మఫలప్రేప్సు
ర్లుబ్ధో హింసాత్మకోఽశుచిః,

హర్ష శోకాన్వితః కర్తా
రాజసః పరికీర్తితః. 27

అనురాగము (బంధ్వాదులందభిమానము) గలవాడును కర్మఫలము నాశించువాడును, లోభియు, హింసాస్వభావము కలవాడును, శుచిత్వము లేనివాడును, (కార్యము సిద్ధించినపుడు) సంతోషములోను, (చెడినపుడు) దుఃఖములోను గూడియుండు వాడునగు కర్త రాజసకర్తయని చెప్పబడును.

అయుక్తః ప్రాకృతః స్తబ్ధః
శఠో నైష్కృతికో ఒలసః,
విషాదీ దీర్ఘసూత్రీ చ
కర్తా తామస ఉచ్యతే. 28

మనోనిగ్రహము (లేక చిత్తైకాగ్రత) లేనివాడును, పామరస్వభావము గలవాడును (అవివేకియు), వినయము లేనివాడును, మోసగాడును, ఇతరులను వంచించి వారి జీవనములను పాడుచేయు



వాడును, సోమరితనముగలవాడును, ఎల్లప్పుడును దిగులుతో నుండువాడును, స్వల్పకాలములో చేయవలసిన దానిని దీర్ఘకాలమునకైనను పూర్తి చేయనివాడునునగు కర్త తామసకర్తయని చెప్పబడుచున్నాడు.

బుద్ధేర్భేదం ధృతే శ్చైవ
గుణతస్త్రివిధం శృణు,
ప్రోచ్యమానమశేషేణ
పృథక్త్వేన ధనంజయ. 29

ఓ అర్జునా! బుద్ధియొక్కయు, ధైర్యముయొక్కయు భేదమును గుణములనుబట్టి మూడు విధములుగా వేర్వేరుగను, సంపూర్ణముగను చెప్పబడుచున్న దానిని (నీ విపుడు) వినుము.

ప్రవృత్తిం చ నివృత్తిం చ
కార్యాకార్యే భయాభయే,
బన్ధం మోక్షం చ యా వేత్తి
బుద్ధిస్సా పార్థ సాత్త్వికీ. 30

ఓ అర్జునా! ఏబుద్ధి ధర్మమందు ప్రవృత్తిని (లేక ప్రవృత్తిమార్గమగు కర్మమార్గమును) అధర్మమునుండి నివృత్తిని (లేకనివృత్తిమార్గమగు సన్న్యాసమార్గమును), చేయదగు దానిని, చేయ దగనిదానిని, భయమును, అభయమును, బంధ మును, మోక్షమును తెలిసికొనుచున్నదో అట్టి బుద్ధి సాత్త్వికమైనది యగును.

యయా ధర్మమధర్మం చ
కార్యం చాకార్య మేవ చ,
అయథావత్ప్రజానాతి
బుద్ధిస్సా పార్థ రాజసీ. **31**

ఓ అర్జునా! ఏ బుద్ధిచేత మనుజుడుధర్మమును, అధర్మమును, చేయదగినదానిని, చేయరానిదానిని, ఉన్నది యున్నట్లుకాక (మఱియొక విధముగ, పొరబాటుగ) తెలిసికొనుచున్నాడో ఆ బుద్ధి రాజసబుద్ధియె యున్నది.

అధర్మం ధర్మమితి యా
మన్యతే తమసాఽఽవృతా,



సర్వార్థాన్విపరీతాంశ్చ
బుద్ధిస్సా పార్థ తామసీ. **32**

ఓ అర్జునా! ఏ బుద్ధి అవివేకముచేత కప్ప బడినదై అధర్మమును ధర్మమని యెంచునో, మఱియు సమస్త పదార్థములను విరుద్ధములుగా తలంచునో, అట్టి బుద్ధి తామసబుద్ధియై యున్నది.

ధృత్యా యయా ధారయతే
మనః ప్రాణేన్ద్రియక్రియాః,
యోగేనావ్యభిచారిణ్యా
ధృతిస్సా పార్థ సాత్త్వికీ. **33**

ఓ అర్జునా! చలింపని (విషయములందు ప్రవ ర్తింపని) ఏ ధైర్యముతో గూడినవాడై మనస్సు యొక్కయు, ప్రాణముయొక్కయు, ఇంద్రియ ములయొక్కయు క్రియలను యోగసాధనచేత (విషయములనుండి త్రిప్పి) ఆత్మధ్యానమున (లేక శాస్త్రోక్తమార్గమున) నిలువబెట్టుచున్నాడో, అట్టి ధైర్యము సాత్త్వికమైనది.

యయా తు ధర్మకామార్థాన్
ధృత్యా ధారయతేఽర్జున,
ప్రసఙ్గేన ఫలాకాఙ్క్షీ
ధృతిస్సా పార్థ రాజసీ. **34**

ఓ అర్జునా! ఏ ధైర్యముచేత మనుజుడు ఫలాపేక్షగలవాడై ధర్మమును, అర్థమును, కామమును మిగుల యాసక్తితో అనుష్ఠించుచుండునో, అట్టి ధైర్యము రాజసమైయున్నది.

యయా స్వప్నం భయం శోకం
విషాదం మదమేవ చ
న విముఞ్చతి దుర్మేధా
ధృతిస్సా పార్థ తామసీ. **35**

ఓ అర్జునా! ఏ బుద్ధిచేత దుర్బుద్ధియగు మనుజుడు నిద్రను, భయమును, దుఃఖమును, సంతాపమును (దిగులును), మదమును విడువకయుండునో, అట్టి ధైర్యము తామసమైనది.



సుఖం త్విదానీం త్రివిధం
శృణు మే భరతర్షభ,
అభ్యాసాద్రమతే యత్ర
దుఃఖాన్తం చ నిగచ్ఛతి. **36**

భరతకుల శ్రేష్ఠుడవగు ఓ అర్జునా! దేని యొక్క అభ్యాసముచే మనుజుడు ఆనందము నొందుచుండునో, దుఃఖశాంతినిగూడ తెస్సగ జేయుచుండునో, అట్టి సుఖ మిప్పుడు మూడువిధములుగా నాచే తెలుపబడుచున్నది. వినుము —

యత్తదగ్రే విషమివ
పరిణామేఽమృతోపమమ్,
తత్సుఖం సాత్త్వికం ప్రోక్త
మాత్మబుద్ధి ప్రసాదజమ్. **37**

ఏ సుఖము ప్రారంభమునందు విషమువలెను, పర్యవసానమందు అమృతమును బోలినదిగనుండునో, తన బుద్ధియొక్క నిర్మలత్వముచే గలుగునట్టి ఆ సుఖము సాత్త్వికమని చెప్పబడినది

విషయేన్ద్రియసంయోగా
ద్యత్తదగ్రేఽమృతోపమమ్,
పరిణామే విషమివ
తత్సుఖం రాజసం స్మృతమ్. 38

ఏ సుఖము విషయేన్ద్రియ సంబంధమువలన మొదట అమృతమునుబోలియు, పర్యవసానమందు (అనుభవానంతరమున) విషము వలెను నుండు చున్నదో అట్టి సుఖము రాజసమని చెప్పబడినది.

యదగ్రే చానుబన్ధే చ
సుఖం మోహనమాత్మనః,
నిద్రాలస్య ప్రమాదోత్థం
తత్తామసముదాహృతమ్. 39

నిద్ర, సోమరితనము, ప్రమత్తత - అనువాని వలన బుట్టినదై ఏ సుఖము ఆరంభమందును, అంతమందును (అనుభవించిన మీదటను) మనకు మోహమును (అజ్ఞానమును, భ్రమను) గలుగ జేయుచున్నదో అది తామససుఖమని చెప్పబడినది.



న తదస్తి పృథివ్యాం వా
దివి దేవేషు వా పునః,
సత్త్వం ప్రకృతిజైర్ముక్తం
యదేభిస్స్యాత్త్రిభిర్గుణైః. 40

ప్రకృతి (మాయ) నుండి పుట్టినవగు ఈమూడు గుణములతో గూడియుండని వస్తు వీ భూలోక మునగాని, స్వర్గమందుగాని, దేవతలయందుగాని, ఎచ్చటను లేదు.

బ్రాహ్మణ క్షత్రియ విశాం
శూద్రాణాం చ పరన్తప,
కర్మాణి ప్రవిభక్తాని
స్వభావప్రభవైర్గుణైః. 41

శత్రువులను తపింపజేయు ఓ అర్జునా! బ్రాహ్మణక్షత్రియ వైశ్య శూద్రులకు (వారివారి జన్మాంతర సంస్కారము ననుసరించిన) స్వభావము (ప్రకృతి) వలన పుట్టిన గుణములనుబట్టి కర్మలు వేఱు వేఱుగా విభజింప బడినవి.

శమోదమస్తపః శౌచం
క్షాన్తిరార్జవ మేవ చ,
జ్ఞానం విజ్ఞాన మాస్తిక్యం
బ్రాహ్మం కర్మ స్వభావజమ్. **42**

అంతరింద్రియ నిగ్రహము (మనోనిగ్రహము), బాహ్యేంద్రియ నిగ్రహము, తపస్సు, శుచిత్వము, ఋజుమార్గవర్తనము, శాస్త్రజ్ఞానము, అనుభవజ్ఞానము, దైవమందు, గురువునందు, శాస్త్రమందు నమ్మకము గలిగియుండుట స్వభావమువలన పుట్టిన బ్రాహ్మణ కర్మమై యున్నది.

శౌర్యం తేజో ధృతిర్దాక్ష్యం
యుద్ధేచాప్య పలాయనమ్,
దాన మీశ్వర భావశ్చ
క్షాత్రం కర్మ స్వభావజమ్. **43**

శూరత్వము, తేజస్సు (కీర్తి, ప్రతాపము), ధైర్యము, సామర్థ్యము యుద్ధమునందు పారిపోకుండుట, దానము (ధర్మపూర్వక) ప్రజాపరిపాలనాశక్తి (శాసకత్వము)-ఇయ్యవి స్వభావమువలన పుట్టిన క్షత్రియ కర్మమైయున్నది.



కృషి గోరక్ష వాణిజ్యం
వైశ్యం కర్మ స్వభావజమ్,
పరిచర్యాత్మకం కర్మ
శూద్రస్యాపి స్వభావజమ్. **44**

వ్యవసాయము, గోసంరక్షణము, వర్తకము వైశ్యునకు స్వభావజనితములగు కర్మలైయున్నవి అట్లే సేవారూపమైన కర్మము శూద్రునకు స్వభావసిద్ధమై యున్నది.

స్వే స్వే కర్మణ్యభిరత
స్సంసిద్ధిం లభతే నరః,
స్వకర్మ నిరతస్సిద్ధిం
యథా విన్దతి తచ్ఛృణు. **45**

తన తన స్వాభావిక కర్మమునం దాస

(శ్రద్ధ) గల మనుజుడు జ్ఞానయోగ్యతారూపసిద్ధిని బొందుచున్నాడు. స్వకీయకర్మయం దాసక్తిగల వాడు జ్ఞానయోగ్యతారూపసిద్ధిని యెట్లు పడయ గల్గునో దానిని చెప్పెదను వినుము.

యతః ప్రవృత్తిర్భూతానాం
యేన సర్వమిదం తతమ్,
స్వకర్మణా తమభ్యర్చ్య
సిద్ధిం విన్దతి మానవః. **46**

ఎవనివలన ప్రాణులకు ఉత్పత్తి మొదలగు ప్రవర్తనము (ప్రవృత్తి) కలుగుచున్నదో, ఎవనిచేత ఈ సమస్త ప్రపంచము వ్యాపింపబడియున్నదో, ఆతనిని (అట్టి పరమాత్మను) మనుజుడు స్వకీయ కర్మముచే నారాధించి జ్ఞానయోగ్యతారూపసిద్ధిని పొందుచున్నాడు.

శ్రేయాన్ స్వధర్మో విగుణః
పరధర్మాత్స్వనుష్ఠితాత్,



స్వభావనియతం కర్మ
కుర్వన్నాప్నోతి కిల్బిషమ్. **47**

తనయొక్క ధర్మము (తన అవివేకముచే) గుణము లేనిదిగ కనబడినను (లేక, అసంపూర్ణముగ అనుష్ఠింపబడినను) చక్కగా అనుష్ఠింపబడిన ఇతరులధర్మముకంటె (లేక, ఇతరధర్మములకంటె) శ్రేష్ఠమైన దేయగును. స్వభావముచే ఏర్పడిన (తన ధర్మమునకు తగిన) కర్మమును చేయుచున్న యెడల మనుజుడు పాపమును పొందనేరడు.

సహజం కర్మ కౌన్తేయ
సదోషమపి న త్యజేత్,
సర్వారమ్భా హి దోషేణ
ధూమేనాగ్నిరివావృతాః. **48**

ఓ అర్జునా! స్వభావసిద్ధమగు కర్మము దోషయుక్తమైనను (దృశ్యరూపమైనను, లేక, త్రిగుణాత్మకమైనను) దానిని వదలరాదు. పొగచేత అగ్ని కప్పబడునట్లు సమస్తకర్మములు (త్రిగుణముల యొక్క) దోషముచేత కప్పబడియున్నవికదా!

అసక్తబుద్ధిస్సర్వత్ర
జితాత్మా విగతస్పృహః,
నైష్కర్మ్యసిద్ధిం పరమాం
సన్న్యాసేనాధిగచ్ఛతి. 49

సమస్త విషయములందును తగులుబాటు పొందని (అసక్తమగు) బుద్ధిగలవాడును, మనస్సును జయించిన వాడును, కోరికలు లేనివాడు నగు మనుజుడు సంగత్యాగముచే (జ్ఞానమార్గముచే) సర్వోత్కృష్టమైన నిష్కర్మ్యాత్మస్థితిని పొందుచున్నాడు.

సిద్ధిం ప్రాప్తో యథా బ్రహ్మ
తథాఽఽప్నోతి నిబోధ మే,
సమాసేనైవ కౌన్తేయ
నిష్ఠా జ్ఞానస్య యా పరా. 50

ఓ అర్జునా! కర్మసిద్ధిని (నిష్కామకర్మలచే చిత్తశుద్ధిని) బడసినవాడు పరమాత్మనే ప్రకారము



పొందగలడో ఆ విధమును మఱియు జ్ఞానముయొక్క శ్రేష్ఠమైన నిష్ఠ (లేక పర్యవసానము) ఏది కలదో దానినిన్ని (జ్ఞాననిష్ఠను, లేక జ్ఞానపరాకాష్ఠను) సంక్షేపముగ నావలన దెలిసికొనుము.

బుద్ధ్యా విశుద్ధయా యుక్తో
ధృత్యాఽఽత్మానం నియమ్య చ,
శబ్దాదీన్విషయాంస్త్యక్త్వా
రాగద్వేషౌ వ్యుదస్య చ. 51

వివిక్తసేవీ లఘ్వాశీ
యతవాక్కాయ మానసః,
ధ్యానయోగపరో నిత్యం
వైరాగ్యం సముపాశ్రితః. 52

అహంకారం బలం దర్పం
కామం క్రోధం పరిగ్రహమ్,

విముచ్య నిర్మమశ్శాన్తో
బ్రహ్మభూయాయ కల్పతే. 53

అతినిర్మలమైనబుద్ధితో గూడినవాడును, ధైర్యముతో మనస్సును నిగ్రహించువాడును, శబ్దస్పర్శాది విషయములను విడిచిపెట్టువాడును, రాగద్వేషములను పరిత్యజించువాడును, ఏకాంతస్థలమునందు నివసించువాడును, మితాహారమును సేవించువాడును, వాక్కును, శరీరమును, మనస్సును స్వాధీనము చేసికొనినవాడును, ఎల్లప్పుడును ధ్యానయోగతత్పరుడై యుండువాడును, వైరాగ్యమును లెస్సగ నవలంబించినవాడును, అహంకారమును, బలమును (కామక్రోధాదిసంయుక్తమగు బలమును లేక మొండిపట్టును) డంబమును, కామమును (విషయాసక్తిని) క్రోధమును వస్తుసంగ్రహణమును బాగుగ వదలివైచువాడును, మమకారము లేనివాడును, శాంతుడును అయియుండువాడు బ్రహ్మస్వరూపము నొందుటకు (బ్రహ్మైక్యమునకు, మోక్షమునకు) సమర్థుడగుచున్నాడు.



బ్రహ్మభూతః ప్రసన్నాత్మా
న శోచతి న కాఙ్క్షతి,
సమస్సర్వేషు భూతేషు
మద్భక్తిం లభతే పరామ్. 54

బ్రహ్మరూపమును (బ్రహ్మైక్యమును) బొందినవాడు (జీవన్ముక్తుడు), నిర్మలమైన (ప్రశాంతమైన) మనస్సుగలవాడునగు మనుజుడు దేనినిగూర్చియు దుఃఖింపడు. దేనినికోరడు; సమస్త ప్రాణులందును సమబుద్ధిగలవాడై (వానిని తనవలెనే చూచుకొనుచు) నాయందలి ఉత్తమభక్తిని పొందుచున్నాడు.

భక్త్యా మామభిజానాతి
యావాన్యశ్చాస్మి తత్త్వతః,
తతో మాం తత్త్వతో జ్ఞాత్వా
విశతే తదనన్తరమ్. 55

భక్తిచేత మనుజుడు నేనెంతటివాడనో, ఎట్టివాడనో, యథార్థముగ తెలిసికొనుచున్నాడు. ఈ ప్రకారముగ నన్ను గూర్చి వాస్తవముగా నెఱింగి అనంతరము నాయందు ప్రవేశించుచున్నాడు.

సర్వకర్మాణ్యపి సదా
కుర్వాణో మద్వ్యపాశ్రయః,
మత్ప్రసాదాదవాప్నోతి
శాశ్వతం పదమవ్యయమ్. **56**

సమస్తకర్మములను ఎల్లప్పుడును చేయుచున్నవాడైనను కేవలము నన్నే ఆశ్రయించువాడు (శరణుబొందువాడు) నా యనుగ్రహము వలన నాశరహితమగు శాశ్వత మోక్షపదమును పొందుచున్నాడు.

చేతసా సర్వకర్మాణి
మయి సన్న్యస్య మత్పరః,



బుద్ధియోగ ముపాశ్రిత్య
మచ్చిత్త స్సతతం భవ. **57**

సమస్తకర్మములను (కర్మఫలములను) వివేకయుక్తమగు బుద్ధిచేత నాయందు సమర్పించి, నన్నే పరమప్రాప్యముగా నెంచినవాడవై చిత్తైకాగ్రతతో గూడిన తత్త్వవిచారణను (లేక ధ్యానయోగమును) అవలంబించి, ఎల్లప్పుడు నాయందే చిత్తమును నిలుపుము.

మచ్చిత్తస్సర్వదుర్గాణి
మత్ప్రసాదాత్తరిష్యసి,
అథ చేత్త్వమహంకారా
న్న శ్రోష్యసి వినఙ్క్ష్యసి. **58**

నాయందు చిత్తమును జేర్చినవాడవైతివేని- నా యనుగ్రహమువలన సమస్త సాంసారిక దుఃఖములను దాటగలవు. అట్లుగాక అహంకారమువలన నా యీ వాక్యములను వినకుందువేని చెడిపోదువు.

యద్యహంకారమాశ్రిత్య
న యోత్స్య ఇతి మన్యసే,
మిథ్యైష వ్యవసాయస్తే
ప్రకృతిస్త్వాం నియోక్ష్యతి. 59

ఒకవేళ అహంకారము నవలంబించి 'నేను యుద్ధము చేయను' అని నీవు తలంచెదవేని అట్టి నీ ప్రయత్నము వ్యర్థమైనదియే యగును. (ఏలయనిన) నీ (క్షత్రియ) స్వభావమే నిన్ను (యుద్ధమున) నియోగింపగలదు.

స్వభావజేన కౌన్తేయ
నిబద్ధస్స్వేన కర్మణా,
కర్తుం నేచ్ఛసి యన్మోహా
త్కరిష్యస్యవశోఽపి తత్. 60

ఓ అర్జునా! స్వభావము (పూర్వజన్మసంస్కారము)చే గలిగిన (ప్రకృతిసిద్ధమైన) నీ యొక్క కర్మముచే లెస్సగ బంధింపబడినవాడవై దేనిని



చేయుటకు అవివేకమున నిచ్ఛగింపకున్నావో దానిని పరాధీనుడవై (కర్మాధీనుడవై) తప్పక చేసియే తీరుదువు.

ఈశ్వరస్సర్వభూతానాం
హృద్దేశేఽర్జున తిష్ఠతి,
భ్రామయన్ సర్వభూతాని
యన్త్రారూఢాని మాయయా. 61

ఓ అర్జునా! జగన్నియామకుడగు పరమేశ్వరుడు (అంతర్యామి) మాయచేత సమస్త ప్రాణులను యంత్రము నారోహించినవారినివలె (కీలుబొమ్మలనువలె) త్రిప్పుచు సమస్తప్రాణులయొక్క హృదయమున వెలయుచున్నాడు.

తమేవ శరణం గచ్ఛ
సర్వభావేన భారత,
తత్ప్రసాదాత్పరాం శాన్తిం
స్థానం ప్రాప్స్యసి శాశ్వతమ్. 62

ఓ అర్జునా! సర్వవిధముల ఆ (హృదయస్థుడగు) ఈశ్వరునే శరణుబొందుము. అతని యనుగ్రహముచే సర్వోత్తమమగు శాంతిని శాశ్వతమగు మోక్షపదవిని నీవు పొందగలవు.

ఇతి తే జ్ఞానమాఖ్యాతం
గుహ్యాద్గుహ్యతరం మయా,
విమృశ్యైత దశేషేణ
యథేచ్ఛసి తథా కురు. 63

ఈ విధముగా రహస్యములగా అన్నిటి కంటెను పరమరహస్యమైనట్టి జ్ఞానమును (గీతాశాస్త్రమును) నేను నీకు జెప్పితిని. దీనినంతను బాగుగ విచారణచేసి తరువాత నీ కిష్టమొట్లాచరింపుము.

సర్వగుహ్యతమం భూయః
శృణు మే పరమం వచః,
ఇష్టోఽసి మే దృఢమితి
తతో వక్ష్యామి తే హితమ్. 64



(ఓ అర్జునా!) రహస్యము లన్నిటిలోను పరమరహస్యమైనదియు, శ్రేష్ఠమైనదియునగు నా వాక్యమును మరల వినుము. (ఏలయనిన) నీవు నాకు మిక్కిలి ఇష్టుడవు. ఆ కారణమున నీ కొరకు హితమునుగోరి మరల చెప్పుచున్నాను.

మన్మనాభవ మద్భక్తో
మద్యాజీ మాం నమస్కురు,
మామేవైష్యసి సత్యం తే
ప్రతి జానే ప్రియోఽసి మే. 65

నాయందు మనస్సునుంచుము. నాయెడల భక్తి గలిగియుండుము. నన్నారాధించుము. నాకు నమస్కరింపుము. అట్లు కావించెదవేని నీవు నన్నే పొందగలవు. నీవు నాకిష్టుడవై యున్నావు. కాబట్టి యథార్థముగా ప్రతిజ్ఞచేసి చెప్పుచున్నాను.

సర్వధర్మాన్ పరిత్యజ్య
మామేకం శరణం వ్రజ

అహంత్వా సర్వపాపేభ్యో
మోక్షయిష్యామి మాశుచః. 66

సమస్త ధర్మములను విడిచిపెట్టి నన్నొక్కని మాత్రము శరణుబొందుము. నేను సమస్త పాపముల నుండియు నిన్ను విముక్తినిగ జేసెదను.

ఇదం తే నాతపస్కాయ
నాభక్తాయ కదాచన,
న చాశుశ్రూషవే వాచ్యం
న చమాం యోఽభ్యసూయతి. 67

నీకు బోధింపబడిన ఈ గీతాశాస్త్రము తపస్సు లేనివానికిగాని భక్తుడుకానివానికిగాని, వినుట కిష్టములేనివానికిగాని (లేక గురుసేవ చేయనివానికిగాని), నన్ను దూషించువానికిగాని (లేక నాయెడల అసూయజెందువానికిగాని) ఎన్నడును చెప్పదగినదికాదు.

య ఇమం పరమం గుహ్యం
మద్భక్తేష్వభిధాస్యతి,



భక్తిం మయి పరాం కృత్వా
మామేవైష్యత్యసంశయః. 68

ఎవడు అతిరహస్యమైన ఈ గీతాశాస్త్రమును నాభక్తులకు చెప్పునో అట్టివాడు నాయందుత్తమ భక్తిగలవాడై, సంశయరహితుడై (లేక నిస్సందేహముగ) నన్నే పొందగలడు.

న చ తస్మాన్మనుష్యేషు
కశ్చిన్మే ప్రియకృత్తమః,
భవితా న చ మే తస్మా
దన్యః ప్రియతరో భువి. 69

మనుజులలో అట్టివానికంటె నాకు మిక్కిలి ప్రియము నొనర్చువాడెవడును లేడు. మఱియు అతనికంటె నాకు మిక్కిలి ఇష్టుడైనవాడు ఈ భూలోకమున మఱియొకడు కలుగబోడు.

అధ్యేష్యతే చ య ఇమం
ధర్మ్యం సంవాదమావయోః,

జ్ఞానయజ్ఞేన తేనాహ
మిష్టస్స్యామితి మే మతిః. **70**

ఎవడు ధర్మయుక్తమైన (లేక ధర్మస్వరూపమేయగు) మన యిరువురి ఈ సంభాషణమును అధ్యయనము చేయునో అట్టివానిచే జ్ఞానయజ్ఞముచేత నే నారాధింప బడినవాడనగుదునని నా నిశ్చయము.

శ్రద్ధావాననసూయశ్చ
శృణుయాదపి యో నరః,
సోఽపి ముక్తశ్శుభాన్ లోకాన్
ప్రాప్నుయాత్పుణ్యకర్మణామ్. **71**

ఏ మనుజుడు శ్రద్ధతోగూడినవాడును, అసూయ లేనివాడును నై ఈ గీతాశాస్త్రమును వినునో, అట్టివాడును పాపవిముక్తుడై పుణ్యకార్యములను చేసినవారియొక్క పుణ్యలోకములను పొందును.

కచ్చిదేతచ్ఛ్రుతం పార్థ
త్వయైకాగ్రేణ చేతసా,



కచ్చిదజ్ఞానసమ్మోహః
ప్రనష్టస్తే ధనంజయ. **72**

ఓ అర్జునా! నాయీబోధను నీవు ఏకాగ్రమనస్సుతో వింటివా? అజ్ఞానజనితమగు నీయొక్క భ్రమ (దానిచే) సంపూర్ణముగా నశించినదా?

అర్జున ఉవాచ :—

నష్టో మోహః స్మృతిర్లబ్ధా
త్వత్ప్రసాదాన్మయాఽచ్యుత,
స్థితోఽస్మి గతసందేహః
కరిష్యే వచనం తవ. **73**

అర్జునుడు చెప్పెను —

ఓ శ్రీకృష్ణా! నీయనుగ్రహమువలన నాయజ్ఞానము నశించినది. జ్ఞానము (ఆత్మస్మృతి) కలిగినది. సంశయములు తొలగినవి. ఇక నీ యాజ్ఞను నెఱవేర్చెదను.

సంజయ ఉవాచ :-

ఇత్యహం వాసుదేవస్య
పార్థస్య చ మహాత్మనః,
సంవాదమిమమశ్రౌష
మద్భుతం రోమహర్షణమ్. 74

సంజయుడు చెప్పెను — ఓ ధృతరాష్ట్ర మహారాజా! ఈ ప్రకారముగా నేను శ్రీకృష్ణుని యొక్కయు, మహాత్ముడగు అర్జునునియొక్కయు ఆశ్చర్యకరమైనట్టియు, పులకాంకురమును గలుగ జేయునదియునగు ఈ సంభాషణమును వింటిని.

వ్యాస ప్రసాదాచ్ఛ్రుతవా
నేతద్గుహ్యతమం పరమ్,
యోగం యోగేశ్వరాత్కృష్ణా
త్సాక్షాత్కథయత స్స్వయమ్. 75

శ్రీ వేదవ్యాసమహర్షియొక్క అనుగ్రహము వలన, నేను అతిరహస్యమైనదియు, మిగుల శ్రేష్ఠ



మైనదియునగు ఈ యోగశాస్త్రమును స్వయము గనే అర్జునునకు చెప్పుచున్న యోగీశ్వరుడగు శ్రీకృష్ణునివలన ప్రత్యక్షముగా (నేరులో) వింటిని.

రాజన్ సంస్మృత్య సంస్మృత్య
సంవాదమిమమద్భుతమ్,
కేశవార్జునయోః పుణ్యం
హృష్యామి చ ముహుర్ముహుః

ఓ ధృతరాష్ట్ర మహారాజా! ఆశ్చర్యకరమైనదియు, పావనమైనదియు, (లేక పుణ్యదాయకమైనదియు) నగు కృష్ణార్జునులయొక్క ఈ సంభాషణమును, తలఁచి తలఁచి మాటిమాటికి ఆనందమును బొందుచున్నాను.

తచ్చ సంస్మృత్య సంస్మృత్య
రూపమత్యద్భుతం హరేః,
విస్మయో మే మహాన్ రాజన్
హృష్యామి చ పునః పునః. 77

ఓ ధృతరాష్ట్ర మహారాజా! శ్రీకృష్ణమూర్తి యొక్క మిగుల ఆశ్చర్యకరమైన ఆ విశ్వరూప

మును తలంచి తలంచి నాకు మహదాశ్చర్యము
కలుగుచున్నది. మఱియు (దానిని తలంచుకొని)
మాటిమాటికిని సంతోషమును బొందుచున్నాను.

యత్ర యోగేశ్వరః కృష్ణో
యత్ర పార్థో ధనుర్ధరః,
తత్ర శ్రీర్విజయో భూతి
ర్ధ్రువా నీతిర్మతిర్మమ. 78

ఎచట యోగేశ్వరుడగు శ్రీకృష్ణుడును, ఎచట
ధనుర్ధారియగు అర్జునుడును ఉండునో అచట సంప
దయు, విజయమును, ఐశ్వర్యమును దృఢమగు
నీతియు ఉండునని నా యభిప్రాయము.

ఇతి శ్రీ మన్మహాభారతే శతసాహస్రికాయాం
సంహితాయాం వైయాసిక్యాం శ్రీమద్భీష్మపర్వణి
శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం
యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే
మోక్షసన్న్యాసయోగో నామ
అష్టాదశోఽధ్యాయః
శ్రీ కృష్ణార్పణమస్తు
ఓమ్ తత్ సత్

## గీతా మాహాత్మ్యము

ధరోవాచ :—

భగవన్ పరమేశాన

భక్తిరవ్యభిచారిణీ,

ప్రారబ్ధం భుజ్యమానస్య

కథం భవతి హే ప్రభో. 1

భూదేవి విష్ణుభగవానునిగూర్చి యిట్లు ప్రశ్నించెను. ఓ భగవానుడా! పరమేశ్వరా! ప్రభూ! ప్రారబ్ధము అనుభవించువానికి అచంచలమైన భక్తి ఎట్లుకలుగగలదు?

విష్ణురువాచ :—

ప్రారబ్ధం భుజ్యమానోఽపి

గీతాభ్యాసరత స్సదా,

న ముక్తస్స సుఖీ లోకే

కర్మణా నోపలిప్యతే. 2



విష్ణువు చెప్పెను— ఓ భూదేవీ! ప్రారబ్ధ మనుభవించుచున్నను, ఎవడు నిరంతరము గీతాభ్యాసమందు నిరతుడై యుండునో అట్టివాడు ముక్తుడై కర్మలచే నంటబడక ఈ ప్రపంచమున సుఖముగ నుండును.

మహాపాపాది పాపాని

గీతాధ్యానం కరోతి చేత్,

క్వచిత్స్పర్శం న కుర్వన్తి

నలినీదల మంభసా. 3

తామరాకును నీరంటనట్లు గీతాధ్యానము చేయువానిని మహాపాపములుకూడ కొంచెమైనను అంటకుండును.

గీతాయాః పుస్తకం యత్ర

యత్ర పాఠః ప్రవర్తతే,

తత్ర సర్వాణి తీర్థాని

ప్రయాగాదీని తత్ర వై. 4

ఎచట గీతాగ్రంథముండునో, మఱియు ఎచట గీత పారాయణ మొనర్పబడుచుండునో, అచట ప్రయాగ మొదలగు సమస్తతీర్థములున్ను ఉండును.

సర్వే దేవాశ్చ ఋషయో
యోగినః పన్నగాశ్చ యే,
గోపాలా గోపికావాఽపి
నారదోద్ధవ పార్షదైః
సహాయో జాయతే శీఘ్రం
యత్ర గీతా ప్రవర్తతే. **5**

ఎచట గీతాపారాయణము జరుగుచుండునో, అచ్చోటికి సమస్తదేవతలు, ఋషులు, యోగులు, నాగులు, గోపాలురు, భగవత్పార్శ్వవర్తులగు నారద, ఉద్ధవాదులు వచ్చి శీఘ్రముగ సహాయ మొనర్తురు.

యత్ర గీతావిచారశ్చ
పఠనం పాఠనం శ్రుతమ్,



తత్రాహం నిశ్చితం పృథ్వి
నివసామి సదైవ హి. **6**

ఓ భూదేవీ! ఎచట గీతనుగూర్చిన విచారణ, పఠనము బోధనము, శ్రవణము, జరుగుచుండునో, అచట నేనెల్లప్పుడును తప్పక నివసించుచుందును.

గీతాశ్రయోఽహం తిష్ఠామి
గీతా మే చోత్తమం గృహమ్,
గీతా జ్ఞాన ముపాశ్రిత్య
త్రీన్లోకాన్పాలయామ్యహమ్.

నేను గీతనాశ్రయించుకొని యున్నాను. గీతయే నాకుత్తమమగు నివాస మందిరము. మఱియు గీతా జ్ఞానము నాశ్రయించియే మూడు లోకములను నేను పాలించుచున్నాను.

గీతా మే పరమా విద్యా
బ్రహ్మరూపా న సంశయః,

అర్ధమాత్రాక్షరా నిత్యా
స్వనిర్వాచ్య పదాత్మికా. **8**

గీత నాయొక్క పరమవిద్య. అది బ్రహ్మస్వరూపము. ఇట సంశయమేమియును లేదు. మఱియు నయ్యది (ప్రణవముయొక్క నాల్గవపాదమగు) అర్ధమాత్రాస్వరూపము. అది నాశరహితమైనది. నిత్యమైనది. అనిర్వచనీయమైనది.

చిదానన్దేన కృష్ణేన
ప్రోక్తా స్వముఖతోఽర్జునమ్,
వేదత్రయీ పరానన్దా
తత్త్వార్థజ్ఞానమంజసా. **9**

సచ్చిదానందస్వరూపుడగు శ్రీకృష్ణపరమాత్మచే ఈ గీత స్వయముగ అర్జునునకు చెప్పబడినది. ఇది మూడు వేదముల సారము. పరమానందస్వరూపము. తన్నాశ్రయించినవారికిది శీఘ్రముగ తత్త్వజ్ఞానమును కలుగజేయును.



యోఽష్టాదశ జపేన్నిత్యం
నరో నిశ్చలమానసః,
జ్ఞానసిద్ధిం స లభతే
తతో యాతి పరం పదమ్. **10**

ఏ నరుడు నిశ్చలచిత్తుడై గీత పదునెనిమిది అధ్యాయములను నిత్యము పారాయణము సలుపుచుండునో, అతడు జ్ఞానసిద్ధినిబొంది తద్ద్వారా పరమాత్మపదమును (మోక్షమును) బడయగల్గును.

పాఠేఽసమర్థ స్సంపూర్ణే
తదర్థం పాఠ మాచరేత్,
తదా గోదానజం పుణ్యం
లభతే నాత్ర సంశయః. **11**

గీతను మొత్తము చదువలేనివారు అందలిసగము భాగమైనను పఠించవలెను. దానిచేవారికి గోదానము వలన కలుగు పుణ్యము లభించును. ఇవ్విషయమున సందేహము లేదు.

త్రి భాగం పఠమానస్తు
గంగాస్నానఫలం లభేత్,
షడంశం జపమానస్తు
సోమయాగఫలం లభేత్. **12**

గీతయొక్క మూడవభాగము(1/3)(ఆఱుఅధ్యాయములు) పారాయణ మొనర్చువారికి గంగాస్నానమువలనకలుగుఫలము చేకూరును. ఆఱవ భాగము (1/6) (మూడధ్యాయములు) పఠించువారికి సోమయాగఫలము లభించును.

ఏకాధ్యాయం తు యో నిత్యం
పఠతే భక్తి సంయుతః,
రుద్రలోక మవాప్నోతి
గణో భూత్వా వసేచ్చిరమ్. **13**

ఎవడుగీతయందలిఒక్క అధ్యాయమునుభక్తితో కూడినిత్యము పఠించుచుండునో, ఆతడు రుద్రలోకమునుపొంది అచ్చట రుద్రగణములలో నొకడై చిరకాలము వసించును.



అధ్యాయ శ్లోకపాదం వా
నిత్యం యః పఠతే నరః,
స యాతి నరతాం యావ
న్మనుకాలం వసున్ధరే. **14**

ఓభూదేవీ! ఎవడు ఒకఅధ్యాయమందలి నాల్గవభాగమును నిత్యము పారాయణముచేయునో, అతడు ఒక మన్వంతర కాలము (ఉత్కృష్టమగు) మానవ జన్మను బొందును.

గీతాయాః శ్లోక దశకం
సప్త పంచ చతుష్టయమ్,
ద్వౌ త్రీనేకం తదర్ధం వా
శ్లోకానాం యః పఠేన్నరః. **15**
చన్ద్రలోక మవాప్నోతి
వర్షాణా మయుతం ధ్రువమ్,

గీతాపాఠసమాయుక్తో
మృతోమానుషతాం వ్రజేత్. 16

గీతయందలి పదిశ్లోకములుకాని, లేక ఏడుకాని, ఐదుకాని, నాలుగుకాని, మూడుకాని, రెండుకాని, ఒకటికాని లేక కనీసము అర్ధశ్లోకమునుగాని ఎవడు పఠించునో ఆతడు చంద్రలోకమును బొంది అచట పదివేల సంవత్సరములు సుఖముగ నుండును. ఇందు సంశయము లేదు. మఱియు గీతను పఠించుచు ఎవడు మరణించునో, ఆతడు ఉత్తమమగు మానవజన్మమును బడయగల్గును.

గీతాభ్యాసం పునః కృత్వా
లభతే ముక్తిముత్తమామ్,
గీతేత్యుచ్చారసంయుక్తో
మ్రియమాణో గతిం లభేత్. 17

అట్లాతడు మానవుడై జన్మించి గీతాభ్యాసమును మరల మరల గావించుచు ఉత్తమమగు మోక్షము పొందును. 'గీతా, గీతా' అని ఉచ్చరించుచు ప్రాణములను విడుచువాడు సద్గతిని బడయును.



గీతార్థ శ్రవణాసక్తో
మహాపాపయుతోఽపి వా
వైకుంఠం సమవాప్నోతి
విష్ణునా సహ మోదతే. 18

మహాపాపాత్ముడైనను గీతార్థమును వినుటయం దాసక్తి కలవాడైనచో వైకుంఠమును బొంది అచట విష్ణువుతో సహా ఆనందమనుభవించుచుండును.

గీతార్థం ధ్యాయతే నిత్యం
కృత్వా కర్మాణి భూరిశః,
జీవన్ముక్తస్స విజ్ఞేయో
దేహాన్తే పరమం పదమ్. 19

ఎవడు గీతార్థమును చింతన చేయుచుండునో, ఆతడు అనేక కర్మలనాచరించినను, జీవన్ముక్తుడేయని చెప్పబడును. మఱియు దేహపతనానంతరమతడు పరమోత్కృష్టపదమును (విదేహకైవల్యమును) బొందును.

గీతామాశ్రిత్య బహవో
భూభుజో జనకాదయః,
నిర్ధూతకల్మషా లోకే
గీతాయాతాః పరమం పదమ్. 20

ఈప్రపంచమున గీతనుఆశ్రయించి జనకాదులగు రాజులనేకులు పాపరహితులై పరమాత్మపదమును బొందగలిగిరి.

గీతాయాః పఠనం కృత్వా
మాహాత్మ్యం నైవ యః పఠేత్,
వృథా పాఠో భవేత్తస్య
శ్రమ ఏవ హ్యుదాహృతః. 21

గీతను పఠించి ఆ పిదప మాహాత్మ్యము నెవడు పఠింపకుండునో, అతని పారాయణము (తగిన ఫలమునివ్వక) వ్యర్థమే యగును. కావున అట్టివాని గీతాపఠనము శ్రమమాత్రమే యని చెప్పబడినది.



ఏతన్మాహాత్మ్యసంయుక్తం
గీతాభ్యాసం కరోతి యః,
స తత్ఫల మవాప్నోతి
దుర్లభాం గతి మాప్నుయాత్. 22

ఈమాహాత్మ్యముతోబాటుగీతాపారాయణము చేయువాడు పైన తెలుపబడినఫలమును బొందిదుర్లభమగు సద్గతిని (మోక్షమును) బడయగలడు.

సూత ఉవాచ :—

మాహాత్మ్య మేతద్గీతాయా
మయా ప్రోక్తం సనాతనం,
గీతాన్తే చ పఠేద్యస్తు
యదుక్తం తత్ఫలం లభేత్. —

సూతుడు చెప్పెను_ఓ శౌనకాదిమహర్షులారా! ఈప్రకారముగ సనాతనమైనట్టి గీతామాహాత్మ్యమును నేను మీకు తెలిపితిని. ఇద్దానిని గీతాపారాయణానంతర మెవడు పఠించునో అతడు పైన చెప్పిన ఫలమును బొందును.

ఇతి శ్రీవరాహపురాణే శ్రీ గీతామాహాత్మ్యం

స ం పూ ర్ణ మ్

ఓమ్ తత్ సత్

---